# కవికోకిల గ్రంథావళి - ౩

# పండ్లతోట



కవికోకిల గ్రంథమాల
పెమ్మారెడ్డిపాళెం – యల్లయపాళెంపోస్టు
నెల్లూరుజిల్లా.

# కవికోకిల గ్రంథావళి-౬
# పండ్లతోట

సాదీమహాకవి "బోస్తాన్"
అను పార్సీకావ్యమునకు
అనువాదము

అనువక్త
కవికోకిల
**దువ్వూరి రామిరెడ్డి**

# ప్ర కా శి క



ఈ పండ్లతోట

కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి కట్టకడపటి రచన ఇది సాదీమహా కవి "బోస్తాను" అను పార్శీకావ్యమునకు అనువాదము.

సాదిమహాకవి **"గులిస్తాఁ"** అను పార్శీకావ్యమునకు రెడ్డిగారి **అను** వాదము గు లా బి తో ట ను యిదివరకే ప్రచురించి **ఆంధ్రమహాజనులకు అందించితిమి.**

రెడ్డిగారి రచనలలో తుదిరచనయైన ఈ పండ్లతోట అసంపూర్ణముగా నిలిచిపోయినది

అయినా, దేనికదే చిన్నచిన్న కథలతోనున్న యీకావ్యము, అసం పూర్ణమైనా, సహృదయుల రసాస్వాదనమునకు అటంకము గలుగదు.

అలస్యంగానైనా, రెడ్డిగారి పండ్లతోటను ఆంధ్ర పాఠకలోకానికి అందించగలిగినందులకు గర్విస్తున్నాము.

మా ఈ కృషికి, ఆంధ్రమహాజనుల ఆదరాభిమానాలు సదావుండ గలవని ఆశిస్తున్నాము

ప్రకాశకులు.

# ఉపోద్ఘాతము



జగదీశ్వరుని నామ సంకీర్తనఁబు
సలిపి ప్రారంభింతు సత్కావ్య రచన :
ప్రాణంబు సృజియించె, పలుకు వెలంది,
నాలుక కొనపైన నటియింపఁజేసె,
కోరునర్థులకు ముంగొంగు పసిండి,
అనదలకాలంబమా పట్టుఁగొమ్మ,
పరమదయాళువు పరహితకాంక్షి;
మన్నింపవేడ సన్మానించి ప్రోచు.
ఆస్వామిసన్నిధి నవగణియించి
మరలివచ్చినవాఁ. పెఱచోట నెచట
సన్మానముంబొంద శక్యంబుగాదు
మెడవంచఁబోని యామేదినీపతుల
శిరములాయాస్థాని ధరదాకువినతి.
పొగరుఁబోతుల కడ్డై తగు శిక్షనిడఁడు,
శరణార్థులనుజూచి తరిమికొట్టండు;
చెడ్డ చేఁతల కల్గి చిటమటించివను
దరి జేరి వాఁడనుతాపంబునొంద

ప్రాఁత తప్పుల పైని గీత బెట్టించు
తండ్రితో నెదిరించి తనయుండు పల్క
కొడుకని యెంచక కోపించు మిగుల,
ప్రియబంధువైనను భేదంబుగలుగ
వాకిలివెడలించు వాని నిశ్చింత,
బానిస చులుకయ్యె పనికిదొంగైన,
స్వామినెయ్యంబూని సైరింపఁడతని,
తన చెలికాఁడైన దయఁజూపకున్న
మరలిపోవును మూఁడు మైళ్ళదూరమున,
సేవకు వెలియైన చెడుగు సిపాయి
సేనానియూరాజు శిక్షించి పంపు,
అయిన నేలకు మింటికి కధిపుఁడెవ్వనికిఁ
బాపంబు నెపమున బత్తె మూపండు,
ఇహాపరంబులు రెండు నీశ్వరజ్ఞాన
సాగరంబున నొక్క జలబిందువగును;
తప్పులెఱింగియు దయఁ గప్పిపుచ్చు.
పృధ్వీతలంబున విశ్వజనీన
సంతర్పణము సేయు సామగ్రి గూర్చె,
ప్రియులు విరోధులన్ భేదంబు లేక
యందఱు సమపంక్తి నారగించెదరు.
దాక్షిణ్యమడఁపఁ దాఁదలపడెనన్న —
ఎవరు తత్ క్రౌర్యంబు నెడసి సుఖింత్రు?

ఈశ్వర ప్రకృతి యదెప్పుడుగాని
ద్వంద్వ సంబంధ నిందా దూరమగును,
అతనిరాజ్యంబు భూత మనుష్య
పూజాపురస్కారములకు లోఁబడదు.
ఇలనుపక్షులు చీమ లీఁగలు నరులు
నఖిలసృష్టియు దేవునాజ్ఞ వర్తించు,
చక్రవాళము నందుఁజరియించు పక్షి
యైన నిర్ణీతమా నాహార మొందు
నంత విశాలమై యమరును విందు
కరుణామయాత్ముండు, కార్య సాధకుఁడు,
ఎడఁద గుట్టుగ్రహించు, నెకిమీఁడు ప్రజకు
రాజ్యమన్న బహుపురాతనమైనది,
తన నైజమెంతో స్వతంత్రశీలంబు,
అతనికేతగును నహంకృతి, ఘనత,
మకుటధారినొనర్చు మనుజునొక్కనిని,
ఒకని సింహాసన చ్యుతుని గావించు,
తల నదృష్టపుటోపి దాల్పించు నొకని,
కడ గండ్లగొంగడి గప్పు నొక్కనికి.
నెయ్యూనిక్కె, మందు నిప్పులకొలిమి
తొగరు గులాబీలతోఁటగా మార్చె.
నీలుమహానదీ నీరంబులందు
మనుజ సమూహంబు మంటలోఁద్రోసె,

అది దయాసంకలితాజ్ఞ యైయున్న
ఇదియు శాసనముద్రయే యననొప్పు.
తెరవెన్క నొకమూల జరుగుచెడ్డలను
గనియు నాచ్ఛాదించు తనమంచిచేత!
కంటగించియు నధికార ఖడ్గంబు
నొరనుండి లాగిన 'కుఱుబి' సంతతులు
బదిరులై మూకలై భయమునొందెదరు,
విశ్వంబునంతయు విందుకుం బిలువ
సైతాను సైతము సమభాగియగును,
అతి ఘనంబైన తదాస్థానమందు
ఘనులు సేవింతురు గౌరవంబుడిగి
దయున శక్తుల కెంతొ దగ్గఱి వాఁడు?
సిరసింపకార్తుల మొఱలాలకించు,
భావికార్యంబుల బాగుగాఁ దెలియు,

గర్భకోశమునందు కలనుగావిధిని
గ్రహియించి చిత్రించు గన రమ్యమూర్తి.
తూరుపు దెసనుండి తోయజమిత్రు
పడమటిదిక్కుకుఁ బయనింపఁజేయు.
నీటిపై నేలను నెరయంగఁ బఱచె,
కంపంబుతో భూమి గాసిపడంగ
కొండ మేకులు దిగఁగొట్టె యందములను
ఇంద్రియ బింకుఁ కిచ్చె రూపంబు
ఎవ్వడు నీటిపై నీఱు జొన్న్రు వేయు?
బండ మధ్యనిమిడ్చెఁ బచ్చనుగొంపు,
పచ్చకొమ్మను నెఱ్ఱ పన్నిరుపుష్పా,
అభ్రంబుగోనీటి నంబుధిఁ జేర్చు,
నడుములోపలిమణి కడుపుఁగో నిలుపు,
ఆ బిందువు నొనర్చు నాణిముత్యంబు,
ఆ ముత్యమున కిచ్చు నందమౌరూపు.
అణుమాత్రమైన విశ్వాంతరాళమున
అతని బుద్ధికి మించునది యొండు లేదు,
వ్యక్త మవ్యక్తంబు నంతయు నొకటె
కాలు సేతులు లేని కాయముల్లల్లు
చీమ పాములకెఱు సిద్ధింపఁ జేయు,
ఆతనియాజ్ఞతో నస్థినుండి
సకలసృష్టిజనించె సంహారముగను

నీవు దప్పమ తెవ్వరీ విధానంబు
సలుప సమర్థులో సర్వలోకేశ ?
మరలవ్యక్తము నెల్ల మాద్యవస్థితికి ,
అటుమీఁద గొంపోదు వంత్యదిగాన
పాప పుణ్యము లెక్క సరికించు నెడను,
అనుసరించును లోక మాదివ్యశక్తి.
నైన, దైవికతత్త్వ మరయ దుర్లభము
ప్రాభవంబొక్కటె ప్రజకు గోచరము.
దివ్యసౌందర్యావధిం గాంచలేము
భావ ఖగంబు తత్పరమస్వభావ
గగనోచ్చ పథమున నెగుగనురభము ,
జ్ఞానహస్తంబు తత్కల్యాణ గుణగ
ణాంచలంబును సైతమంట శక్యంబె ?
ఈ సుడిలోఁ జిక్కి యెన్నియో యోడ
లడుగంటె, దరిచేర దంత చెక్కైన.
నెమ్మదిగా నెన్నొ నిశలఁ గూర్చుండి
మానస విశ్రాంతిఁ దన్మయుఁడ నైయుంటి ;
ఉన్నట్టులుండి భయోత్కంపనంబు
మునుకొంగువట్టి లెమ్మని మేలుకొల్పె ,
పరమేశు విజ్ఞత పరిగొను జగము :
ఆతని నీభావ మందుకోలేను,
ప్రతిభచేఁ దత్స్వభావము బోధపడదు

ధ్యానంబునకుఁ జిక్కదాదివ్య గుణము ,
వాక్చాతురిని 'సుహబాను' మించినను
బోల్చ నశక్యని బొగడ సాధ్యంబె ?
ఇలనెందరో ప్రవక్తలీ దారియందు
కడువడి గుఱ్ఱాల నడిపిరిగాని
'నుతియింపలే' మని గతినాపినారు.
అనిలోనఁ బ్రతిచోట హయముఁ బోఁదోల
తగవుగా, దాఁక గొన్ని తలములయందు
నస్త్ర సన్యాసంబె యర్హమైయుండు ;
అర్థగుండు రహస్య మధిగమించినను
వెలువడనీకతలఁపు మూసెదరు,
ఆ విందులోనొక్క యరగిన్నె మదిర
గొనిన, మైకపుమందు గొని నట్టులుంచు,
కనుఱెప్పలొకఁ డేఁగ కను గుట్టఁబడియె,
మఱియొండు కన్నులు దెఱచుకోఁగలదు ,
కాని, ఱెక్కలు మంట గాలిపోయినవి.
'ఖారూను' బహుధనాగార మార్గంబు
గనఁడెవ్వఁడింతకు, గనినచ్చెనేని
మతిదప్పి, బయటికి మరలి రాలేఁడు.
ఈ నిత్రుపేటిలో నేను కెరటాల
తల దేవు చేచ్చిన ధన్యుండు లేఁడు.
జ్ఞానప్రపంచము కడముట్ట దిరిగి

నిత్య తత్వంబు నన్వేషింతువేని
వాజిఁ గ్రమ్మరనీక బంధించుమొదట,
తలపోయు మెపుడు హృద్దర్పణంబునను,
క్రమముగా నార్జింతు వమలత్వమీవు ;
ప్రణయసంజనిత సౌరభ్య మత్తుడవు
గాకున్న వెదకెదు గంతవ్యసీమ
ఆ చోటి కరుదెంతు వన్వేషమున
అటనుండి యెగిరెద వాకాశవీధి
పరమ దివ్యప్రేమ పక్షముల్విప్పి ,
సత్య సందర్శన క్షణకాలమందె
మాయయుఁ బ్రబలిసీర మఱుమాయమాను ,
అటువెన్క మిగులు ననంతభాసంబు ,
యింతకు మించి పై కేతెంచలేదు
విక్రమించియును వివేక హయంబు
కడువింత యా తేజి కళ్లెంబుపట్టి
అదలించి నిలుమని యరికట్టు సాదు.
గుణగరిష్ఠుండె యీ కూపారమందు
నిర్భయంబుగఁ బయనింప శక్తుండు ;
గొల్లని వెనువెన్కఁగూడి పోకున్న
దారి దప్పి చరించు ధర నెట్టి వాఁడు.
ఈ పుణ్యమార్గంబు నెడసిన ప్రజలు
దిగ్భ్రాంతి నెల్లెడ దిరుగు చుండెదరు.

పై గంబరునకు నొప్పని దారి నడచు
వారు, గంతవ్యంబు జేర రెన్నటికి,
మహామద్ ప్రవక్త సమ్మాన్య బోధనము
ననుసరించిన గాని యమల మార్గంబు
దక్కదు, తలపోయు మొక్కింత సాది.

## ప్రాణికోటులలో శ్రేష్ఠుఁడగు మహమ్మదు ప్రవక్త ప్రశంస

[దేవుఁడాయనను అనుగ్రహించుగాత]

కరుణాస్వభావుండు కమనీయమూర్తి,
ప్రజనుద్ధరించు ప్రవక్త, సామాన్య
జనసమూహ క్షేమమునకు వత్తాసి ;
సందేశహరుల సర్వోత్తముండు,
మతిమార్గమున నేత, మహిమాన్వితుండు ;
దైవవిశ్వాసంబు దనరిన మేటి,
'జిబ్రీలు' నవతరించెడు నాటపట్టు ,
ప్రజనాదరించు శిఫారసుదారు ,
అంత్యదినంబున న్యాయాధికారి ,
మతధర్మములయందు మార్గదర్శకుఁడు.
ఆవక్తకుఁ 'తూరు' ఆకాశమయ్యె ,
కాంతులెల్లను వాని కాంతి యంశువులె ;
పూతఖురాన్ సూక్తి పూర్తికి మున్నె

వెలయు మత గ్రంథ నిలయంబులెన్నొ
నాశమొనర్చె ననాథుండు జగతి,
అరిభయంకరఖడ్గ మొఱనుండిలాగి
మహిమతోఁ జంద్రుని మధ్యభాగంబు
రెండుతుంటలుగాఁగ ఖండించివైచె,
తనకీర్తి సన్నుతి జనములనోట
నాని వ్యాపింపంగ నాషీరవాను
హర్మ్యంబులోఁగల్గె నవనికంపంబు
ఘనమైన 'లాతు' విగ్రహముతుఁడించె;
మతగౌరవమునిల్ప మతితోడ 'ఒజ్జ'
ప్రతిమగొప్పతనంబు భగ్నంబుచేసె,
తోడరి 'లాతును' 'ఒజ్జ' ధూళియు దుమ్ము
చేయఁటేగాక 'యంజీలు' 'తౌరియతు'
రద్దుగావించె నరబ్బి సంఘమున,
ఒకనాఁటి రేయి నీయుర్విని బాసి
'బుర్రాకు' నెక్కి నభోవీథిదాటె,
దేవదూతల మించె స్థిర గౌరవమున
దైవ సన్నిధికంత త్వరితంపుగని
ఖరముదోల్కొని పోవఁగా లేకబడలి
'సిద్రి' లో వెనుజిక్కె 'జిబ్రీలు' దూత
'కాబా' కు ముఖ్యాధికారి యనా నేత
అతనిగని యిట్టులనియె: ఓ దైవ

సందేశహారి, పై సరణిఁ గాలిడుము,
పొందినాఁడవు మనఃపూర్వక మైత్రి,
నాసహవాసంబు ద్రోసి పుచ్చంగ
కళ్ళెంబు వెనులాగు కారణంబేమి?
ఇటుపల్కె జిబ్రీలు: యింతకుఁబైని
సరణిపట్టఁగ నాకు శక్తి దుర్లభము,
నాగరుద్బలము సన్నగిల, నిచ్చోట
నుంటి, వెంట్రుకవాసి యుత్క్రమించినను
మహిత దివ్యజ్యోతి మాడ్చు ఱెక్కలను.
యిటువంటి పరిభవర్య. డిలనేతయైన.
పాపంబు కోరకాధి పడ దెవ్వఁడైన
ఈవు మెచ్చెడు రీతి నెఱసన్నుతింతు,
శాంతిగల్గుత నీకు జనతాప్తవక్త
ఈశుండు నీయాత్మ నాశీర్వదించు,
నీసహవాసుల నీయనుయాయి
బృందంబు నట్టులె కృపఁజూచుగాత!
పాలిత శిష్యుండబూబకరు మున్ముందు,
పిదప, సైతాను గో పిడికిట నలిపి
నట్టి ఓమరు, రాత్రియందు నిద్రఁ
డయికాచు నుస్మాను నతులవివేకి,
'దుల్దులు' నామక తురగంబునెక్కు-
నాల్గవఆలి, మానామునిసల్లె

దీవించుగావుత దేవ దేవుండు!
'ఫాతిమా' సంతాన పరమాదరమున
సూక్తి విశ్వాసంబు చ్యుతముగాకుండ
గడచిపోవునుగాత కడకు నాబ్రతుకు.
నా మొరవినకున్న ననుబ్రీతిగొన్న
అల రసూల్ సంతతి యందేలకొంగు
ఎడబాయకుండుత యెపుడునా చేయి!
ఓశుభంకరపాద, యున్నతపీర,
జీవన్మహాత్ములు సిద్ధులుండినను
నీ మహాయోగ్యత కేమిలోపంబు?
అతిథులై నీదు శాంత్యాగారమందు
బిక్షార్థి బృందంబు విడిసియుండెదరు.
దేవుండునిన్ను నుతించె, జబ్రీలు
నీప్రభావముగాంచి నేలముద్దిడియె.
నీశక్తి యెదుట వినీలమై నభము
సిగ్గుగాంచెను, నీవు సృష్టియైనపుడు
ఆదాము జలమృత్తి కావస్థనుండె
మొదటనుండియు నీవె మూలవస్తువవు
మనుజస్థితికి, తక్కుగణములు నీదు
శాఖలు, నిన్నెట్లు సరిగనుతింతు
వర్ణింతునేగాని వర్ణనకందె
నెన్నియో మడుగులు హెచ్చునీ ప్రకృతి.

'కాలాక్' ప్రశంసయేచాలు గణ్యతకు;
తగు ఖురాక్ సూక్తుల పొగడింపెచాలు!
అపరిపూర్ణుడు నాది. అర్హమానట్లు
వర్ణింప, గలఁడె నీ భవ్యతత్వంబు?
పరమేశుఁడాశిస్సు గురియునిపైని

## కావ్యరచనాహేతువు.

అవనిగ్రుమ్మరితి నేనన్ని మూలలను.
గడపితి బ్రతివానికడఁ గొంత కాల,
మఖిల కష్టసుఖంబు లనుభవించితి.
ప్రతిపంట గ్రక్కొంటిఁ బండినయెన్ను,
మీరాజు పరిశుద్ధచిత్తుల వంటి
వినయవంతుల నేడ, గనవిని యెఱుఁగ;
ఆనేలపైఁ గరుణామృత వృష్టి
గురిపించుగావుత పరమేశ్వరుండు!
పావన మీరాజు పట్టణ ప్రజల
పైననురక్తినా భావంబు నిచ్చె
పామురూమనెడు దేశంబులనుండి ;
ఆపండ్లతోఁటల యందుండివచ్చి
యుత్తచేతులతోఁడ బత్తనసఖుల
కడకేఁగ నెంతయో కలకటపడితి ,
తలఁచితి మిసరుబోఁగల కండదెచ్చి

హితులకు నుపహార మిచ్చెదనంచు ;
కరమున కండ చక్కెర లేదుగాని
అంతకన్నను తీయనైన కావ్యంబు
గలదు , సామాన్యమౌ కలకండగాదు.
జ్ఞానవంతులు పుస్తకంబుల పుటల
పదిలంబుచేసిన భావసంపత్తి.
నృపసౌధమౌ దీని నిర్మించునపుడు
ఘటియించితి దశ శిక్షాద్వారములను ,
తొలుత యధ్యాయంబు దేవున్యాయంబు
పటువివేచన మభిప్రాయనిర్ణయము
దైవభీతియుఁ బ్రజాదర పాలనంబు
అవల రెండవదాని యందు సల్పెదను
బొరి ననుగ్రహలబ్ధి మూలబంధనము.
దైవకృపావృష్టి దనిసినయర్థు
లనుదినంబు కృతజ్ఞులై సంచరింప.
మూఁడవ యధ్యాయమున సంతరింతు
హృదయార్తి మత్తత గాదమల ప్రేమ,
పంచేంద్రియాత్మక ప్రణయంబు గాదు,
నాల్గవదాన వినమ్రతగూర్తు ,
నైదింట సంతుష్టి ఆరింటఁ దృప్తి
పరులైన ధన్యుల వర్ణింతు , సప్త
మాధ్యాయమందు విద్యాశిక్షణంబు ,

అష్టమంబున సౌఖ్య మారోగ్యమిచ్చు
సర్వేశునకుఁ గృతజ్ఞత దెల్పికొనుట,
తొమ్మిదింటను సరితోవపట్టుటయు
పదిగఁ బశ్చాత్తాప పడుట. పదింట
ప్రార్థనముఁ గూర్చి పరిగణించుటయు,
గ్రంథోపసంహార కథనంబు గలదు.
సంతోషకరమైన సంవత్సరమున
శుభము చేకూర్చెడు శుక్రవారమున
రెండు 'ఈదు'ల మధ్యనుండు తేదీన
ఆర్నూట యేబది యైదు హిజ్రీని
ప్రఖ్యాతమైన యీ పండ్లతోఁట నెడు
భూషకోశాగారమున నింపినాఁడ
అడుగంటి తెచ్చిన యాణిముత్యముల.
అయిన శుభస్వాంతుఁడైన పండితుఁడు
దోషైక దృక్కును మూయునే వినను.
పట్టుదైనను జరీపనిదైన యంగి
మొత్తుగుడ్డనులోన నుంతురక్కఱగ.
పట్టుటంగీలైన పరుల నొప్పింప
దలపెట్టఁబోకుము, తగదదినీకు.
పునరుక్తి నెరసులు పొరపొచ్చెములను
కప్పిపుచ్చుము నీవు కారుణ్యగరిమ.
మత్పాండితీయ సామగ్రినిగూర్చి

పొగడుకొన్నది లేదు బూరగయ్యాది.
బిచ్చగాని విధాన పెద్దలయెదుట
వినయంబునం జేయి వెలికిఁజాపితిని,
ఆశాభయంబుల కగ్గంబు సేయు
సంత్యదినానఁ బుణ్యాత్ములకొఱకు
పాపులమన్నించు పరమదయాళు
వైన సర్వేశ్వరుండన వినియుంటి.
నా వాక్యరచనలో నీవు సైతంబు
నెరసులు గాంచిన కరుణమై సృష్టి
కర్తలోకులనెల్ల కాచుమన్నించు.
వేయింటిలోనొక్క ద్విపదయెన్నికకు
సంప్రీతిఁగూర్చిన సౌజన్యమూని
తప్పులు వెదకక యత్నంబు చాలించు.
అల 'ఖుతూన్' పట్టణ మందుఁగస్తూరి
పగిది, నా కావ్యంబు పారసీకమున
పదిలోన పదకొండు, పడయదువిలువ.
భేరీనినాదంబు తీరున దూర
పదమునుండియె వచ్చు భయకారణంబు.
పలుదోషములు కప్పఁబడిపోవునేడు
లేక యుండిన, లజ్జ లేక యీసాది
తొగరుగులాబిఁ బూదోఁటల కడకుఁ
దోఁదెచ్చి మిరెము హిందూస్థానమునకు

ఈతిబాధలనుండి యెవఁడైనముక్తి
నందిసుఖించుట కనువైనచోటు
ఈరాజ్యమున దప్ప నింకెందు లేదు.
ఎచటరాజ్యము కోశ మీప్రకారముగ
పంగ్వంధ భిక్షుక బాల వృద్ధులకు
ధర్మాన్నసత్రమై తనియించుటెఱుఁగ ;
శోకార్తుఁడు శరణుచొచ్చినకైన
గుండెగాయముమాన్పు కొనక క్రమ్మరఁడు.
మంచి వెదకువాఁడ, మను నాశతో దేవ,
అతనికోర్కులు దీర్చు మవిలంబనముగ.
కనకకోటీరంబు గగనమంటియును
నమ్రత ధరఁదాఁకు నరపాలుశిరము.
గర్వాత్మునకు మేలుగల్గు నమ్రతను ;
యాచకుండు వినమ్రుఁడైన నైజంబె,
అనద సాగిలఁబడినంత నేమౌను?
బలవంతుఁడును మ్రొక్కబడ భక్తుఁడౌను,
అతని యౌదార్య విఖ్యాతి వ్యాపింప
గుణగణస్తుతులు నిగూఢతమౌనె,
అవని వర్ధిల్లిన యంత కాలంబు
నీవంటి ప్రాజ్ఞుండు నిత్యసంతుష్ట
నైజుఁడిం కోర్కఁకు జ్ఞప్తికిరాఁడు
బలవంతు పిడికిటి పట్టులోనలఁగి

ఖర్జూర ఫలము పై గప్పినకండ
తియ్యనయ్యును విప్పఁదీసిన, లోన
గనుపట్టు నస్థిక కెనయైన విత్తు.

## సాద్‌జంగీ పుత్రుడైన అతాబక్ అబూబకర్ రాజేంద్రుని గుణగణ ప్రశంస

ఇటువంటికోర్కెల కెక్కుదుమనసు,
పాకుపాలనుతింప భావమీకొనదు,
అయిన, ఫలాని దేశాధిపు పేరు
కవితా నిబద్ధంబు గావించినాఁడ,
వెనుక సహృదయులు విపులీకరింత్రు,
వక్తృత్వపుం జెందు బఱపినసాది
వర్ధిల్లువాఁడ బూబకరు కాలమున,
తగియుందు నేను తత్కాలంబు బొగడ
న్యాయతత్పరుఁడైన నౌషీరవాను
అధిపత్యమును మహమ్మదువోలె
ప్రభుసత్తముండ బూబకరునివంటి
శుతపోషకుఁడు న్యాయమార్గానువర్తి
ఒమరునవ్వల నెవ్వఁడుద్భవింపండు.
అభిమానవంతుల కధినేత, గొప్ప
వారికి మకుటంబు, ప్రజలారమీకుఁ
దన్న్యాయపాలన దగుసన్నుతింప.

ఆర్తిఁ జెందినవాని నరయంగఁ బోము
ఆతనిరాజ్య కాలావధి యందు.
ఈసంప్రదాయంబు లీక్రమనియతి
ఈన్యాయపద్ధతి నెచ్చోటఁ గనము,
తులలేని వైభవంబులు గూర్చుకొన్నఁ
గనియుండఁబోఁడు, నిక్కము, ఫరీదూను ;
తనగొప్పతనముచే దార్ఢ్యంబు గాంచె
బలహీనమైన పేదల హస్తయుగము.
తత్కారణంబున దైవసన్నిధిని
హెచ్చెను మిగుల భూమీశు గౌరవము.
'జాలురుస్తుము' గాంచి జడియనియట్లు
తన రక్షణచ్ఛాయ ధరణిపైఁ గప్పె.
కాలదుశ్చేష్టకు గ్రహచారమునకు
విలపింత్రులోకులు కలకాల ; మైన
రారాజ, నీన్యాయ్య రాజ్యకాలమున
కాలదుర్గతి నొక్కఁడు కందఁబోఁడు.
నీయేలుబడి ప్రజానీకంబు సాగియు ,
అటుమీఁదవారి కత్యంతమెట్టిదియొ !
మంగళాంతాదృష్ట మహిమచే నీవు
సాదిని గంటివి సమకాలికునిగ.
చపల సూర్యేంద్రులు చరియించుదాక
నీస్మృతి యాకృతి నిత్యమాగాత !

ఇలమించి పేరువహించిన స్వప్నులు
అలవఱ్చుకోనిర పూర్వుల నీతిపథము.
నీవన్ననో ప్రభుత్వ నీతిమించితివి
పూర్వులకన్న నపూర్వనై పుణివి.
కాయి యిత్తడితోడఁ బ్రహరీలు కట్టె
'యూయురాజు' సరిక్రొత్తై 'అల్సికందరుఁడు'
'కాఫరు యూయురాజు' గణనాపవివు
కట్టించినావు బంగారుగోడలను.
ఇంతన్యాయము శాంతి యొసఁగు నేల్బడిని
సుఖియించు కవులు నీస్తుతి సల్పకున్న
వారి నాల్కలు చెగి పడుఁగాత, నేల,
ఔదార్య ఖనివి, దానాంబోధి వౌర !
క్షితుల సంస్థితికి నీ స్థితియె యూడరువు ,
ఈ తేనిగుణగణం బెన్నమిక్కుటము,
ఈ చిన్నకృతిలోన నిటికింపఁగా దు :
అవియెల్ల వివరింప దివ్యుడగు నేని
వేఱొక్క గ్రంథంబు విరచింపవలయు.
కడలేని యింతటి కారుణ్యమునకు
దగు కృతజ్ఞత దెల్ప దరమౌనె నాకు?
దాసరితప్పులు దండంబుతోడ
తీఱునన్నట్లు ప్రార్థించి మ్రొక్కెదను
వాంఛల కనుకూల పడుగాత జగము;

గగనంబు నిను మైత్రి గనుగొనుత,
నిను జగన్నిర్మాత కని కాచుగాత:
ఉచ్చస్థమైన నీ యుజ్జ్వల గ్రహము
ప్రసరించుఁగాంతిఁ, బ్రపంచంబునందు
నీ విరోధి గ్రహంబు నీచతంబొంది
తన్మంద భాగ్యాని దగ్ధంబుసేయు
కలుగకుండును గాత కాల దుర్నయము;
ఆపద్భయంబు నీయంతరంగమున
తూర్పెత్త కుండుత దుమ్మెదుకారు,
ఏలన, పాదుషా యెడ గాసిచెందు,
కుంది కుములును లోకుల మానసంబు
నెలకొను గావుత నిండార నీదు
స్వాంత దేశంబుల శాంతి సంపదలు,
నీ రాజ్యమునుండి దూరమగాత
కష్టంబులును బ్రజారిష్టకంబులును,
నీమతంబట్టులే నెమ్మనుగూడ
ఘనసత్త్వయుక్తమై మనుగాత చిరము
కీడుగోరెడువాని పాడు డెందంబు
తలపోతయుల్లు మందత నొందుగాత!
అనిశంబు దైవసాహాయ్యంబు కలిమి
సంతుష్టమగాత నీ స్వాంతంబు ప్రభువ,
మతము సామ్రాజ్యంబు మఱివృద్ధియగాత,

కరుణించుగాత జగత్సృష్టికర్త,
వ్యర్థమానిక నెంత ప్రస్తుతించినను,
అతిశక్తి సంపన్నుఁడైన దేవుఁడు
నీవు సుఖ క్షేమ నిత్యాభివృద్ధి
గాంచు నంత యనుగ్రహించినఁ జాలు!
ప్రఖ్యాతిగన్న నీవంటి సత్పుత్రు
డుంట. సాద్ జంగీయు నుల్లంబునందు
బరువు బాధలు లేక మరణించెమున్న
అక్కజం బేమి యీ చక్కనికొమ్మ
మోసెత్తై పరిశుద్ధ మూలంబునుండి
మట్టిలో దేహంబు మఱగిపోయినను
ఆత్మయున్నత పదం బధివసించెడిని
పేరొందినట్టి యాగోరిపై దేవ,
కురిపించు జడివెట్ట కరుణామృతంబు,
జనులు సాద్ జంగి దృష్టాంతపాత్రునిగ
స్మరియింత్రు, తత్పుత్రు నాదబూ బకరు
కావుమా ప్రీతి నాకాశ చక్రంబ!

## సాద్ అబూబకరు పుత్రుఁడైన యిస్లాం రాజకుమారుని ప్రశంస

యువకుం డదృష్ట సంయుక్తపాలుండు,
భాస్వన్మనుండు, సంభావ్యశీలుండు,

విభుత బాలుండు, వివేక వృద్ధుండు
పాండిత్యకుశలుండు భావోన్నతుండు,
భుజబలధీరుండు బుద్ధిమంతుండు;
కడుపున నీవంటి కనకాంకురమును
గని, సందిటం బెంచుకొను కాలమాత
భాగ్యమే భాగ్యంబు! వర్ణింప దరమె!
దానహస్తంబుచే తటినీ జలంబు
చూరగొంటివి నీవు' తారాపథంబు
నతకరించితివి మహాన్నత్యమునను!
ప్రభువులంగో నెల్ల ప్రముఖుండా! నిన్ను
కనువిచ్చి నిండార గనుభాగ్యలక్ష్మి.
నవురు ముత్యాలధాన్యము నిండియున్న
శుక్తికి, నొకపాటి మౌక్తికంబునకు
గలయంత మూల్యంబుగలుగ, బో; దట్టి
దాగిన మంచిముత్యంబవు నీవు
భూపాలక కుటుంబ భూషణంబౌట.
ఒకకంట గనిపెట్టి యుండుమో దేవ,
దృష్టిదోషము వానిదెస సోకకుండ,
పేరన్ని దిక్కుల మాఱుమోగించు
భక్తిసేవల గొప్పవానిగావించు,
మది, న్యాయపుణ్య సుస్థిరునినొనర్చు;
ఇహపరంబులయందు నిచ్చలీడేర్చు

కలుగకుండుత శత్రుకంటక భయము,
కనకయుండుత దుష్టకాలక్షితంబు,
నినువంటిఫలమును గను కల్పలతయె;
సుతుఁడు యశస్కామి, పితయుయశశ్వి
ఈకుటుంబము దూఱు హీనాత్ములెల్లు
శుభములకుఁ బరాయిచోటగుగాత!
నీదు విజ్ఞానంబు, నీన్యాయపరత,
నీరాజ్యసంపద, నీమత ప్రీతి
చిరము వర్ధిల్లు నాశ్రితకల్పభూజ!



దేవుండుదయ, బ్రసాదించిన లాభ
ములు శుభంబులు, భావమున కెక్కుడౌను;
ఎటుల సేవించు, సర్వేశ్వరుకృపకు
నర్హమానవుఁ నాల్కఁ బభినుతిసల్పు?
దరిచేసులను మైత్రిదనుపు నీతేని
చల్లనీడసుఖించు జనసమూహంబు,
ప్రజలపై నీరాజు పరిపాలనంబు
చిరతరస్థాయిగా, జేయుమో దేవ
స్వాంతంబు భక్తివిశ్వాస నిర్ణిద్రి
మానవు లొనరింపుమా యెల్లవేళ.
వాంఛాలతను బండ్లు ఫలియింపనిమ్ము:
శాలజన్యాసపుఁ బచ్చఁదనము, మోమందు
నెనరు తెల్లదనంబు నెలకొననిమ్ము.
కపటమార్గంబు దొరిక్కకు మాయసాది,
సత్యమున్న వచించుజంకు గొంకెడలి.
అంచె నీవెఱుఁగుచు వధిపుఁ సద్గుఁడు;

సత్యభాషివి నీవు జనపతిశ్రేష్ఠ!
'ఖిజిలర్సలాక్' కాలికిరింద నభంబుఁ
దొమ్మిదిగద్దెల దొంతరల్ నిల్చి
నంత యావశ్యకమయ్యెనా యేమి?
గౌరవపాద మాకసమునంబెట్టు
మని చెప్పఁబోకు, హాస్యంబు సద్భక్తిఁ
బుడమినాన్చు మటంచు నుడువుమో సాది,
భక్తినమ్రితల దైవద్వారసీమ
నిలనంటఁ దవలంచు, మిదియెపుణ్యాత్మ
లనుసరించెడు చక్కనౌ రాచబాట,
దాసుఁడ వేని యీ ద్వార దేశమునఁ
బడిగాపువడుము, నీ ప్రభుత చిహ్నంబు
మకుటంబు దొలగించి మన్నదుమ్మగుము.
దైవంబు ప్రార్థించు తఱుణమ్మునందు
దొడుగఁబోకుము రాచయుడుపు లంగీలు;
దరిచేసివలె, గుండెదొరఁగు నావేద
నము వెలికూర్చుము విమలమౌమనము
భువనపోషక, నీవు పూర్ణశక్తుఁడవు,
దరిచేసులం బ్రోచు దాతవునీవె,
సార్వభౌముఁడగాను శాసింపఁబోను,
నీసన్నిధిని బిచ్చమాసించు దీను
లందు నేనొక్కఁడ నాదునో దేవ,

రోమమిసిద్ధించునా యీ సేవలన
నీచేతిపాపంబు నిండాఁగన్న,
సాయబుద్ధియు మంచిసేయుతలంపు
నొనగూర్చు, మాటుగానయియున్న నేనేడ,
యొకనికైనను మేలునొనగూర్చు టెడ?
పగలురాచటికంబు పచరింతు వేగ
దరిజేసుకొన్ను సంతప్త చిత్తమున
రేయిపారిరించు మాశ్రిత పక్షపాతు
నడుము బిగించి నీకడపలిముంగ
పడిగాపునై యుండు గలుగునే నృపులు,
నీవన్న, దైవసన్నిధిఁ దలవంచి
ప్రార్థింతువార తత్పరదాస్యవృత్తి!
జ్ఞానిసలక్షుఁడాను పరిభువపాయ్యరె,
దనస్వామి కిందాను దాసుంగు న్యాయ
నిర్వర్తనంబున నియమితుండౌట

— కథ —

## చిరుతపులిపై స్వారిచేయు మహాత్ముడు, సాది.

ఒకనాడు 'సద్యాపి' నికటపు దేశ
మునఁ జిరుతపులి నెక్కి, ననుగాంచి చక్కఁ
కరుదెంచు నొక్కని వెఱగునంగంటి,
నడువఁగాళ్ళాడక తోడిబంధుగంత

వెఱఁదత్తరమున నివ్వెఱ నొందియుంటి
ననుగాంచి చిరునవ్వు ననలెత్త వేల్పు
వా కౌఁగిలించి వచియించె నిట్లు,
ఈదృశ్యమును జూచి యేలయాశ్చర్య
పడెదవో సాది, యెప్పుడు నీవుగూడ
స్వామియాజ్ఞకుఁ బెడమోము పెట్టకుము
నీయాజ్ఞ నితరులు నెరవేర్చుకొఱకు.
దైవశాసనము నౌదల దాల్చు నేని
రక్షించి మన్నించు రాజు నీశ్వరుఁడు.
భగవంతునకు దయాపాత్రుఁడవైన
కరహస్తములఁబట్టి పఱచ డెన్నఁడును.
ఇదియె చక్కనిత్రోవ, ఈ భక్తిమార్గ
మునఁ గ్రమ్మఱంబోకు. ముందు కాలిడుము
తలఁచిన కోర్కెలు ఫలియించు నీకు,
సాదిమాటలు మెచ్చు జనుల కెవ్వేళ
సదుపదేశము లాభసంధాయియౌను.

## నౌషిరవాను హర్మ్రాజునకు నీతిచెప్పుట

మరణవేదన మొందు తఱుణంబునందు
హార్మ్రాజుతో నిట్టులన సాగెఁదండ్రి,
స్వసుఖములకు నీవు బందావుగాక
మనసుకెట్టు దరిద్రజని రక్షణమున;

నిజభోగపరతంత్రి నృపుఁడవౌనెడల
నీభూమి సుఖముగా నివసింపఁబోకఁడు,
తోడరిగొట్టెలయందఁ దోఁడేలుదిరుగ
గొల్లందు నిశ్చింత గూర్కు చునుంట
పండితాంగీకృతి పడయదోలెనయు,
దివము నక్క అగల్గి, తినఁగిండి లేని
నిలుపేదలాబోవఁ ద్వారపమమాయి,
రాజు రాజత్వ బు రైతుమూలకము,
రాజు వృక్షంబౌను, రైతులు వేళ్ళు,
వృక్షంబు దృఢమౌను వేరులబలిమి,
శక్యమౌవఱకుఁ బ్రజాభ్యాదయంబు
కసిగాట్ల నొప్పించి గాసిపెట్టకుము,
అటుగాక, నీవె నియమగుమూలంబు
కుద్దాలమునఁ దివ్వికొన్నట్టులగును.
సరచక్క తోవను జనఁగోరు దేసి
భక్తులవలెఁగొమ్ము భయము నాసయును,
ప్రజలకష్టంబులు పతికింపు గావు,
భయపడు రాజ్యంబు భగ్నమౌననుచు,
తనస్వభావముస నీగుణము లేకున్న
ఆరాజు దేశంబునందు సామాన్య
జనసౌఖ్య సౌరభ్య మొనగూడఁబోదు,
భార్యబిడ్డలవంటి బంధంబులున్న

వారల కనుకూల వర్తివై మనుము,
ఏకాకివైన, నీయిచ్ఛ నెఁబొమ్ము.
రాజపీడఁ గృశించు రైతు గాపించు
ప్రాంతంబుల సమృద్ధి పడయఁగోరకుము,
బలగర్వ యుతులకు భయపడఁబోకు.
భగవద్భయము లేనివారికి వెఱువు,
తనరైతుల యొడంద దఁకొల్పినట్టి
ప్రభువన్య రాష్ట్రంబు వర్ధిల్లినట్లు
కలగాంచు; పతి బలాత్కారంబు వలన
అపకీర్తి గలుగు, రాజ్యంబు పాడౌను.
తలపోయఁదగును పెద్దలు మదుక్తి
ప్రజల నన్యాయమంబు పాశేసి చంప
దగదు, వారలె ప్రభుత్వమునకు నండ
బలువైన వెన్నెముక, బలగంబు బలము.
నీమేలుకోసమే గ్రామవాసులను
కాచిరక్షించుము, కర్మకరుండు
కష్టించు మిగుల సంతుష్టుఁడై యున్న
మున్నెన్నొ యుపకారములు చేసినట్టి
వానికెగ్గొనరింప మానవత్వంబె?

## ఖుస్రు షిరాయాకు నీతిచెప్పుట

కాలంబు కడదాటి కనుమోడ్చు వేళ

మీరాయనకిట్టులఁ జెప్పి ఖుస్రువుఁడు
చలపట్టి నెరవేర్చ తలఁచిన, పసని
ప్రజలక్షేమంబుపై భావంబు నిల్ప
విజ్ఞతకును సదభిప్రాయమునకు
పెడమోము పెట్టకు పుడమి నృపులు
నీయాజ్ఞ కనువర్తులై యుండునటుల.
అన్యాయ్య నృపుని రాజ్యంబుననుండి
పరుగెత్తిపోయిన ప్రజలు నాఁటేని
దుర్యశంబెల్లెడఁ దూరుపెత్తెదరు.
తన పునాదిని ద్రవ్వఁకొనుటకు నెంతో
కాలంబు పట్టదు కడదుష్టమతికి.
బిడ్డలు స్త్రీలునూర్చు వేడిసెట్టునూర్చు.
సైనికులొనరించు సర్వనాశంబు
కంటె ఘోరతరంబుగఁ బరిణమించు,
విశ్వాస్త వెలిగించి పెట్టినదివ్వె
పురముగాల్చుట నీవు నెఱిఁగి యుండెదవు
ఏల్పడి సాగించు చింత న్యాయంబు
దప్పక జీవించు ధరణీశుకంటె
పృథివి గలండె యదృష్టవంతుండు?
పయనించు సమయంబు ప్రాప్తించినపుడు
అతనిఁగోరి శాంతికై వేఁడుచుండ్రు.
సాధులు దుష్టులు చనుచుందు. రైన,

నీ పేరు మంచికి నెలవౌటమేలు.
దైవభీతుని రైతుసేవ నేమించు;
యమితవిత్తుఁడె రాజ్యక్షేమకరుఁడు.
ప్రజలఁబీడించి లాభము నీకుఁగూర్చు
వాఁడు నీకపకారి, వాఁడు జోరీఁగ!
జనులరక్తము ద్రావినను దృప్తిగనఁడు.
తనబలాత్కృతికి భూజనులు చెయెత్తి
"చస్తిమో దేవుడా శరణు శరణనగ"
బాధించు రాక్షసుపైని పాలనము
నమ్మి పెట్టుట దోషమెమ్మహీపతికి.
సత్కార్యపోషణాసక్తుఁడు పరుల
యెగ్గుకీడులకుఁ దానగ్గంబుగాఁడు
దుష్టకార్యంబులఁ దొడరునీచుండు
తనప్రాణమునకు శాత్రవుఁడు తానౌను,
చిరపీడనాసక్తు శిక్షింతువేని
ధనధాన్యముల నాచికొన నేమి ఫలము?
మేలెంచి యతని నిర్మూలింపఁదగును.
బాధించు నుద్యోగిపై నోర్పుతగదు.
లంచాల క్రొవ్వుతో లావైన మేను
నిలుపునఁ జర్మంబు నొలిచినమేలు,
మేకలపైదూకి మెడత్రుంచునపుడె
కాదంచు నన్నన్నె గడతేర్పవచ్చు

గండుతోఁ జేటిని గళముత్తరించి,

## దొంగలమధ్యచిక్కిన వణిజుఁడు

బాణశరాసన పాణుఁడై వచ్చి
దారి దోపిడిగాండ్రు తనచుట్టుముట్ట
వారిమధ్యను పట్టుపడిన వర్తకుఁడు
ఎంతచక్కఁగఁ బల్కెనిట్టి వాక్యములు!
దారిదొంగలు మోము ధైర్యంబు సూపి
తలపడి యెదిరింప, దంగు స్త్రీలైన
పురుషులైనను నేమి? సరి పాలకుండు
వణిజుల గాచింపఁ బట్టణంబులకు
సైన్యంబులకు క్షేమసంపత్తియుడుగు,
అవనిపైన చెడ్డయులవాటుదూఱు
నానుడి నెఱయుంగ మానితులైన
పండితులిఁక నెట్లువత్తు రచ్చటికి?
మంచిపేరు వహింప మనసుండు నేని
మంచితనంబు సమార్జింతు వేని
వణిజులన్ దూతలఁ బరమాదరించు,
ప్రాణతుల్యంబుగా బాటసారులను
పోషించుచుందు రెప్పుడు గొప్పవారు;
ఏలన నాపాంథులిలను గ్రుమ్మరుచు
తమ మంచిపేరు నిత్యము వెల్లడింత్రు

పరదేశి యెటనుండి భగ్నచిత్తుండుగ
గ్రిమ్మరియునో యట్టిరాజ్యంబు స్వారగ
పాడొందు, పాంథుల వైదేశికులను
స్నేహంబునం జేరజీరి మన్నించు;
వారు నీ సత్కీర్తి పేరు ప్రతిష్ఠ
దేశదేశములంగ తిరిగి యమ్మెదరు.
అతిథిసత్కారుని నెయ్యమున లాలించు;
కాని ముందుగ మేలుకనియుంట మేలు;
ఒకవేళ కీడు వారొనరింపవచ్చు
క్రొత్తవారలతోడం గొంత దాపరిక
ముంచి మెలంగుట యుత్తమంబగును;
పగవాడు చెలికాని వాలకంబూని
వచ్చుటయును సంభవంబె యొక్కపుడు.
గారవించుము చిరకాల మిత్రులను
తోడరదు వారిలో ద్రోహచింతనము,
భృత్యుండు నిన్ గొల్చి వృద్ధుండై యున్న
పెద్దకాలపుసేవం బెరిగిన హక్కు
మరచిపోవుట నీకు మాన్యంబుగాదు.
వార్థక్యమున వాని బాహువు, సేవ
బలహీనమైయున్నం బరంగునుగాదె
నీకు నౌదార్యతుందిల కరంబు!

# ఖుస్రూషాపూర్షుల కథ

తన పేరు కొట్టివేసెను 'ఖుస్రుషాహి'
యనివిని 'షాపూరు' వనరి నిట్టూర్చి,
దినవెచ్చముసకైనఁ జినడబ్బు లేక,
పలుకష్టములపాలు పడుచుండినపుడు,
తన యిక్కటుల చరిత్రను విస్తరించి
రాజునకిటు లేఖ వ్రాసిపుత్తెంచె,
'ధరలోన న్యాయంబు నెఱపుటేటేఁడ,
నేను లేకుండిన నీకేమికొదవ?
ఎప్పటియటుల సమృద్ధిగా సాగు;
అర్పించుకొంటి నాయావనంబంత
నీసేవ; కష్టాట నెనరింత లేక
వార్ధక్యమున నన్ను వర్జింపఁబోకు.
విప్లవకరుఁడైన పెఱవాఁడుగాసి
పెట్టక దేశంబు వెడలఁగొట్టించు,
వానిపైఁగోపంబు బూనకుండుటయె
భావ్యమా, తన దుఃస్వభావంబె చాలు
విడువక శత్రుపై వెన్నంటి తిరుగు.
పారసీకమునందు, ప్రభవించియున్నఁ
ద్రోసిపంపకు 'సునారూము' 'సుక్లాబు'
నగరంబులకు వాని నగడు పాల్పడఁగ,

అట్లైన వాని నిక్కటుల నొప్పించు,
మనకష్టమొరలు నెత్తినఁబెట్టఁదగదు,
''ఇటువంటి మనుజున కిరవైన దేశ
మల్లకల్లోలమై యడలొందుగాత!''
యనివారు నిందింతు, రది యసహ్యంబు.
అర్థవంతునిఁజూచి యధికారమిమ్ము,
పేదవానికి రాజభీతి చొప్పడదు.
ప్రశ్నకుఁ బ్రత్యుత్తరంబు నీలేక
తలవంచుకొను పేదవలన నేమౌను
ఎదుట నిలంబడి యేడ్చుట దప్ప?
ఉద్యోగి విశ్వాస యోగ్యుండుగాక
యుండిన నియమించు మొక్కనాఁడును,
ఇద్దరిభావంబు లేకీభవింప
వాని వీనిని పదభ్రష్టుఁగావించు,
దైవభీతుని దొరతనమందు నిల్పి
దగు; నీకు వెఱచినంతనె నమ్మఁదగిన
యుద్యోగియని వాని నూహింపఁబోకు.
ధనమును వెదజల్లు, తర్వాతమెంచు
తెలివితోఁ గపెట్టు తీఱికకొలఁది.
శతమునందొకని విశ్వసనీయుఁగనవు.
పాఁతకొక్కులకొక్క పనియిచ్చువారి
నొకటిగాఁబంపకు మొకచోటికైన,

ఇరువురనోన్యన్యంబు నేకీభవింప
రని యెవ్వరెఱుఁగుదు, రవ్వారియందు
నొకఁడు దొంగైన నింకొకఁడు తోడగుచు
వానిమోసము దాచఁ బరదానుగప్ప,
దారిదోపిడిగాండ్రు తిమిలోనఁదాము
భయసంశయములకు బద్ధులైయున్న
సరిమధ్యముననుండి సార్థవాహంబు
తప్పించుకొనిపోవు దెప్పరిల్లకయె.
కినిసి పదభ్రష్టునొనరింప నొకని
గొంతకాలం బేగినంత మన్నించు,
వేయిబద్ధులఁ జెఱ విడిపించుకంటెఁ
బ్రిత్యాశుకోర్కె దీర్పంగ మేలౌను.
గట్టివాఁడయసగానిఁ గార్యాలయమునఁ
బ్రముఖునింగావించు, పతికొండుగాక
మనిన, నాశాసూత్రమును ద్రెంపడతఁడు
తండ్రి బిడ్డలనట్లు తర్జించుఁ బ్రజల
న్యాయతత్పరుఁడైన సరపాలకుండు.
ఒకవేళ దండించు నుల్లంబు నొవ్వఁ,
గరుణనింకొకసారిఁ గన్నీరుదుడుచు
మెత్తమెత్తగనున్న మిడిసిమిట్టెక్కు,
అలిగి పైకొనిన నిరాశుఁడౌ పగఱ,
కనికరంబును గట్టితనముంట మేలు;

క్షతిసేయు టేగాదు శస్త్రవైద్యుండు
పుండాఱ జరుము కప్పుర మొలామ.
బలధైర్యములు సత్స్వభావంబు గల్గి
యౌదార్యవంతుఁడవై పరివర్తించు,
దైవంబునీపైన ధనమువర్షించెఁ
బరిజలపై నీవును భాగ్యమెగఁజల్లు.
గత నృపాలుర రాజ్యకాలచరిత్ర
ఎలయించుకొమ్ము నీస్మృతికి, నాపగిది
నిల్పిపొమ్ము చిరంబు నీపదాంకముల.
పుట్టి గిట్టినజాడ పొలుపొందు, నెవని
సత్కీర్తి నెక్కొను శాశ్వతంబగుచు;
వంతెనల్ బావులు పాంథ సత్రములు
కట్టించి పోయిన కరుణామయుండు
చచ్చియుఁ బ్రతికిన చందంబె యగును.
స్మరణాంకముగ నొక్క సత్కార్యమేని
చేయక చనువాని జీవితవృక్ష
మెండినట్లుగు నొక్కపండు పండకయె!
దానధర్మము లేక తరలినవాని
యాత్మశాంతికి ప్రార్థనాంజలి యిడరు
నీపేరు చిరమిలనిల్పఁ గోరినను
మహితుల సత్కీర్తి మఱుగుసేయకుము.
భోగభాగ్యంబులు పొదలుచుండినను

ఎంత సంతసమున్న ఇచ్ఛలుండినను
కడకన్నియున్ వీడి కదలిపోవలయు
భువినుండి యొకఁడు కొంపోవు సద్యశము,
ఇంకొక్కనికిఁ జిరమిలను శేషించుఁ
దన దురాచార వర్తన తలఁపు.
హర్షించి వినఁబోకు మన్యకష్టముల,
పలికెద వేని కొండలపోసి పలుకు,
పొరపడ్డవారల మఱపు నెపంబు
అనుమానమొందక యంగీకరించు,
రక్షింపుమని వేడ రక్షణంబొసఁగు,
పరితప్తుఁడై దోషి నీరక్షణచ్ఛాయ
నాశ్రయించిన, ప్రాఁత యపరాధములకుఁ
దలనుత్తరించుట ధర్మంబుగాదు.
వినఁడేని నీతిచెప్పిన నొక్కతూరి
మఱుసారి వినని చెరసాలఁబెట్టి
సంకెళ్ళనుంచుటే సరియైనశిక్ష.
సంకెళ్ళు నీతులు సైతంబు వ్యర్థ
మేని, యాతఁడు దుష్టవృక్షంబు; దాని
మొదలంటఁద్రవ్వి నిర్మూలింపమేలు
ఒకని తప్పులకు నీకొల్లముండినను
తడవు యోచించి యాతనిని దండించు.
బడకసాన్ కెంపును బగులగొట్టంగఁ

దేశీకయోగాని, తిరిగి ఖండములు
సంఘూర్చి యడుకంగ సాధ్యంబుగాదు,

## నరపతులు ముందు
## వెనుకలాలోచించుట
## దండనమున ఆలసించుట.

కడచి యెడారుల, గడలిఁ బైనించి,
'ఉమాను' జలనిధినుండి యేతెంచెఁ
బట్టణంబు నొక్క పరదేశవాసి.
అజము తుర్కియు నరబ్బియు రూము
దేశంబులం గలదిరిగి వీక్షించి,
పరిశుద్ధమౌ తన భావంబు నిలిపి
వివిధంబులైన సద్విద్యలార్జించె,
పరదేశ యాత్రిలఁ బాంగితిం బడసె,
సాంఘిక మర్యాద జన మేళనంబు
నభ్యాసమొనరించె; నాకారమందు
బోలుబొత్తగనున్న భూజంబుఁబోలు,
కాని, యాకులు లేవు కడుదుర్బలుండు
ఇన్నాళు మాసిక లెడలేక కుట్టి
నట్టిబొంత ధరించు, నందు దేహంబు
ఉక్కిరిబిక్కిరై యుసుకెత్తిపోవు,
అతఁడు చేరిన పట్నమందలి జేఁడు
కడుగొప్పవాడు చక్రవిదారి వాఁడు,

మంచిపేరు వహింప మనసుండువాఁడు
పావనాత్ముల పాదసేవ నమ్రిండు.
వచ్చినవానికా ప్రభువు బానిసలు
దారి దుమ్ము డలంగఁ దలగడిగించి
స్నానంబు చేయించి భోనంబునిడిరి.
ధరణీశు సన్నిధిఁ దలనేలనాంచి
వినతిఁ జేతులు కట్టుకొని నిలుచుండి
యిటుసన్నుతించె పాహీని నతెండు;
ఈరాజ్యమందు నేనేబసనైన
పరితప్తహృదయ నిర్భాగ్యుని గనను;
పానమత్తుని గన్నపాపానఁబోను,
అదిగాక మధుశాలలన్ని జీర్ణించె.
ఎవని బాధలకేసి యెదఁ బ్రీతిగొనఁడు;
అను ప్రశంసయె రాజ్యమునకు రాజునకు
చాలని, సరసభాషా మౌక్తికముల
పెనుజల్లు గురిపింప జననాథుఁడలరి
యతని వాక్చాతుర్య మభిరుచి మెచ్చి.
దగ్గఱకుంబిల్చి తగగౌరవించి
విచ్చేసినందుకు వినుతించి మ్రొక్కి
బంగారు రత్నాలు బహుమతివెట్టి
వతను వంశము గూర్చి ప్రశ్నించెనతని.
'సామీప్యమున నన్యజనులను మింతు'

నని మాఱుపల్కిన నధిపుఁడాలించి
తనలోన నీరీతిఁ దలపోయుచుండె;
మంత్రాంగమునకిట్టి మాన్యుండె తగును.
ఐన నాస్థానికుల్ నాసిర్ణయంబు
నవివేకమని యెంచి హాసియింపనట్లు
కాలక్రమంబున మేలు చేకూర్తు.
మున్ముందు నాతని బుద్ధి వైభవముఁ
బరికించి యంతస్తు నెఱుగంగవలయు
పిదప నైపుణిఁబట్టి పదవి హెచ్చింపఁ
బడును, దానను భవజ్ఞుఁడు గాకయుండి
గొప్ప కార్యములు చేకొనిన నెడందఁ
బలుమాఱు దుఃఖంబు భరియించుచుండు
యోచించి ఖాజీయు నొకతీర్పువ్రాయ
తలపాగ దాల్చువారల విమర్శలకు
సిగ్గు చెందఁడు; తూఁపు చేవీడనపుడె
గుఱిచూడు, హితబోధఁ బొరివివేకమున
యూసపు సరిపోలు నుత్తముండైన
సచివుఁడొటకు నొక్కసమ చెల్లవలయు;
కాలమించుక కొంత కడచినఁగాని
పరుఁడిట్టివాఁడని భావింపలేము
అన్నివిధంబుల నతని తత్త్వంబు
నారసి, ప్రాజ్ఞుండు, నవుఁలమతంబు

తగువాఁడు, సత్ప్రవర్తన గల్గువాఁడు,
భాసురభావుండు, భాషావిదుండు,
పరులయోగ్యత మెచ్చు పావనాత్ముండు,
సలలితాభిప్రాయముల నేర్పు నందుఁ
బెద్దలలో నెల్లఁ దద్దయుం బెద్ద
యని యెంచి పిమ్మట నతని నేమించెఁ
దన మంత్రిపైని పెత్తనము సాగించు
పెద్దవజీరుగాఁ బృథ్వీశ్వరుండు.
అంతనా సచివుఁడత్యంత వేత్తృతను
ప్రజ్ఞతో రాజకార్యము సల్పుచుంట,
శాసనంబులవల్ల జనుల కొక్కింత
యెదనొవ్వనట్టు లింపొదవె పాలనము.
తనవల్ల నొకఁడేని వసరనియట్లు
కలము క్రిందికిఁ దెచ్చెఁ గడఁక నేల్బడిని.
బిరుసుమాటెపుడు వాతెఱ జాఱకుంట
పలు విమర్శలకు నాల్కలు కట్టువడియె;
యవగింజయంత ద్రోహము గానఁబడమి
నితఁ డుపయోగింపఁ డీర్ష్యాళువునకు,
వేగిన గోదుమల్ వృథయైన పగిది.
ఆతని కాంతి మచ్ఛేతంబు రాజ్య
మంతటన్ వెదచల్లెఁ నమలదీధితుల
క్రొత్తవాని యశంబు కొనలొత్తుచుండ

ప్రాంత మంత్రికిఁబుట్టెఁ బరితాపమెసను,
రవయంతమైన రంధ్రము కంటఁబడదు
బుద్ధిమంతుఁడుండు పూర్వాంశు దూఱ
విశ్వాసనీయుండు వెడఁద పళ్ళెరము,
చెడగోరు వాఁడెట్టిచిమ, యద్దాని
నిది బొందసేయంగ నెటు సాధ్యమౌను?
సూర్యబింబము వంటి సుందరాకారు
లెలప్రాయపు గులాము లిద్దరు నృపతిఁ
గొలువ నడుము కట్టుకొని యుందురెపుడు
అచ్చుటులం బోలు నందచందములు
రవి చంద్రముల బోని ప్రవిమలాకృతులు
ఎనయింప మూఁడవ వెదిలేనివారు.
పరికింతు వేస బింబ ప్రతిబింబ
ములపోల్కి హెచ్చులొచ్చులు లేనివారు
ఆవాగ్మి మృదు మధు రాలాపములకు
ఈగులాముల మెత్తు బెద పట్టువడిరె,
అతని నిర్మల స్వాంతంబు సద్గు
ణంబుల నెఱిఁగి మన్నన చూపివారు
శ్రేయోభిలాషులౌ స్నేహితులైరి.
సౌజన్యమున నవ్యసచివుండు కూడ
మానవత్వప్రేమ నూనెఁజిత్తమున,
హ్రస్వదృష్టుల మలినాశగా దగియు,

ఆగులాములఁ జూచినపుడెల్ల నతని
యెదలోన సుఖభావ ముదయించు చుండెఁ.
ఓయిఖాజీ, నీదు యోగ్యతాగార
వముల యౌన్నత్యంబు వాంఛింతు వేని
మధురాస్యముల పైని మతినిల్పఁబోకు,
నీయంతరంగంబు నిష్కామమయ్యు
నష్టభయంబు వెన్నాడు జాగ్రత్త!
పాతఁ మంత్రియు వారి పరిణయ గంధంబు
పసిపట్టి యేదను చేపడియె సంచలరి.
కంటిలో నలుసంత కారణంబున్న
గోరంత శంకను కొండంత చేసి
చెడుతలంపున నిట్లు చెప్పె భూపతికి,
ఈతని బేరేమొ? యెటుఁగ మెవ్వండో?
పరువు ప్రతిష్ఠతో బ్రతుకఁడిచోటు!
వినియుంటి నాకృతఘ్నుని చిత్తమిపుడు
మీగులాములపైని రాగిల్లె ననుచు,
కడు ద్రోహి యతఁడు దుష్కామ తత్పరుఁడు
ఒక్క దేశమునందు నొకరాజ్యమందు
స్థిరనివాసము లేని దేశదిమ్మరులు
బ్రదుకుచుండెదరు నిర్భయచిత్తవృత్తి,
ఈయదృష్ట ముఖుండు ఈనీచబుద్ధి
తమ దేవిడీని నిందలపాలు చేసె,

చెడుగుగాంచిన వెన్క చెప్పకయున్న
నను సాకి సంతరించిన గొప్పవారి
యుప్పునకుఁ ద్రోహ మొనరించినట్టు
లెన్నెద, రటుగాన విన్నవించితిని.
త్వరపడి పలుకంగఁ దగదు శంకించి
నిజము తేలిన మీఁదనే వచించితిని,
ఆయిద్దఱి గులాములందు నొక్కఁడు
అతని కౌఁగిటిలోననణఁగి యుండుటను
గనివచ్చి యదియెల్ల వినిచె సేవకుఁడు.
ఇపుడంతయుం దెల్పితింక మీయిష్ట,
మదిగాకనా యట్టులన్ని సంగతులు.
తమరుఁ బరీక్షింపఁ దధ్యంబు దెలియు
ననుచుఁ జెడ్డగఁదోఁచు నటుల వర్ణించె.
దుర్మార్గ వర్తియు ద్రోహ చింతనుఁడు
చూడకుండును గాక సుఖమైన దినము.
రవయంత నిపము చేఁదవిలిన యంత
చెడుగందు పెద్దల చిత్తంబు లేర్చు.
నలుసంత నిప్పుతో వెలిగింపవచ్చు
పెనుమంట, నవ్వాల పెద్దదౌ ప్రాఁత
తరువును బూదిగా దహియింపవచ్చు;
సచివోక్తులను విన్న షాహి మేనెల్ల
వడఁకుచు నుడుకెత్తె. భల్లపాతముగ

వేడి నిట్టూర్పులు వెడలించుచుండె,
నెరకిన్క దరిచేసి నెత్తురాసింపఁ
దాలిమి చెయిపట్టి తగదని యాపె;
పరిపోషితుని జంప పౌరుషంబగునె?
న్యాయంబు వెనుక దుర్నయము హేయంబు;
నీవు పెంచినవాని నెగులు పెట్టకుము,
అభయమిచ్చి మరల హతమార్పఁబోకు
దౌర్జన్యమున వాని తలఁ ద్రుంతువేని
పిలిచి యన్నము పెట్టి పెంచ న్యాయంబె?
అతని నైపుణి నీకు నధిగతంబౌటఁ
బ్రాణమిత్రుండయ్యె రాజసౌధమున;
నేఁడు సైతము తప్పు నిజమెఱుంగకయె
పగఱ మాటలు నమ్మి నొగిలించఁ దగునె?
పెద్దల హితబోధ విని యుంటఁ జేసి
యూరహస్యము దాచె నెడలోన నృపతి,
ఎఱుఁగుమోయి వివేకి, యెడఁద గుట్టునకు
చెఱసాలయగును, వాతెఱ దాటుమాట
మరల సంకెళ్ళకు మఱలింపలేవు.
సవ్యమంత్రి ప్రవర్తనంబు గూఢముగ
కనిపట్టి సుల్తానుగాంచె దోషమును;
అందాల కందహారానట్టి గులాము
మంత్రి చూచినయంత మందహాసంబు

గావించెఁ బెదవులు కదలెనో లేదో।
తనువులు వేఱయ్యు మానసైక్యమైన
నిద్దఱు ప్రియులు నోరెత్తకుండినను
భావ వినిమయంబు పచరింపఁ గలరు
నంజు రోగియు 'దిజ్జ' సదిని గ్రోలియును
దృష్టి చెందని రీతిఁ బ్రియుఁడు గూఢముగ
కడగంటి చూపులఁ గాంచియుంగాంచి
తనియఁబోఁడని నీవు గనియె యుండెదవు.
నృపతి సందేహంబు దృష్టాంతపడియె,
తనదు కోపోద్రేకమును చిక్కఁబట్టి
ముందువెన్కలు తలపోసి సైరించి
మెల్లగా నిట్లనె మేదినీ విభుఁడు,
ఓయి సజ్జనుఁడ. నీయుల్లంబుగంటి.
ప్రాజ్ఞుండవని యింతవఱకు భావించి
రాజ్య రహస్య తంత్రములు నీచేత
నుంచితి విశ్వాస యోగ్యుండవనుచు,
గొప్పవాఁడవు చాలనెప్పరివంచు
నెంచితిగాని నీవిట్టి దుర్బుద్ధి
గల యసభ్యుఁడవని దెలియలేనైతి.
తగవు నీవింతటి మొగదారి పదవి
కదియు నాపొరపాటె, యన నేల నిన్ను,
నీచజాతిని కాచి ప్రోదినందులకు

అంతఃపురద్రోహ మాందాయమయ్యె!
ననుఖుస్రుపల్కెన. ననరానిమాట
లాలించి సర్వజ్ఞుఁడైన వజీరు
తలయెత్తి పదరక పలికె నీపగిగి,
నిర్దోషవర్తన నేను జీవింప
నీర్ష్యాళువుల నిందకేల భీతిల్ల?
ఇటువంటి సందేహం మెప్పుడుగాని
యంకురింపకు నాదు నంతరంగమున,
ఎవ్వఁడిట్లాడెనో యెఱుఁగ, నాబుద్ధిఁ
బొటమరింపని యిట్టి కుటిలభావముల,
అనవిని సుల్తాను సదవదవడుచు,
చాలుచాలు వజీర, యేలవాదంబు?
ఆఱునా తీఱునా అగ్గువల్కెనను!
అనిషాహి మాటాడినంత, లేనవ్వు
విరబూయు వ్రేలిని పెదవిపై నాంచి
వవియించె సచివుఁడీ పగిది భూపతికి;
అధిపుఁడిట్లన్న నందాశ్చర్యమేమి?
తనపీర మాక్రమించిన నన్ను గాంచి
యీసు బూనిన నీచుఁడెవ్వఁడు నాపైని
యసనిందదప్ప నొప్పాడుట గలదె?
పాలకుఁడంచని పై పదవిం- నన్ను
నియమించినప్పుడే నేఁదలంచితిని

ప్రాఁత ప్రెగ్గడనాకుఁ బగఱ యౌనంచు
ప్రభువు నన్నున్నత పదవి నెక్కొల్పి
నపుడెఱుంగఁడె వెన్కరిపువృందు నంచు?
నా యున్నతిని దననాశమూహించు
వాఁడంత్య దివసంబు వఱకు శాత్రవుఁడె!
విననెంతువేని యీ వినతు విన్నపము,
ఈవిషయంబున కేదైనయట్టి
నిక్కంపు కథ మదికెక్కఁ జెప్పెదను.

## సాదృశ్యము.

కలలోన నైతాను గాంచె నొక్కండు;
సరళవృక్షము వంటి చక్కనిమేను.
సూర్యబింబము వంటి సొగసైనమోము,
నక్కజంబుగఁజూచి యాతఁడిట్లనియె,
అమృతాంశుముఖుఁడ, నీయంద చందములు
పరజ లెఱుంగరు, నిన్ను రాక్షసాకృతిగ
నూహించి తమస్నాన గేహకుడ్యములఁ
జిత్రించెదరు ఘోరచిత్రముల నిన్ను,
నావుడు నైతాను నవ్వియిట్లనియె,
అట్టిదిగాదు నాయంగ సౌష్టవము,
ఐనఁ నుంచె విరోధి హస్తవశ్యంబు;
నరులంఱకు మూలపురుషుఁ డాదాము

వానిస్వర్గమునుండి పాఱఁదోలితిని
ఆకసిఁ దీర్చుకో నతని సంతతులు
నన్నిపుడు లిఖంత్రు చెన్ను చెడంగ.
ఈవిధంబుగ నాకు నెసఁగె సద్యశము.
అయిన దుష్టాత్ముండు స్వార్థతత్పరత
ననుగూర్చి నిందలే యనయంబుఁబల్కు.
నా పెద్దపదవి క్రిందఁ గృశించు యశము
గల వజీరుని మోసములనుండి మూఁడు
మైళ్ళదూరంబున మఱలంగఁదగును.
నృపుని కోపంబున కెదభీతిగొనడు.
ధీరుఁడై నిర్దోషి తెలిసి మాటాడు;
వ్రాతచక్కగనున్న భయపడ నేల,
పలువిమర్శలకు దబ్బర నిందలకును,
ద్రోహంబుసేయని దొడ్డయుద్యోగి
లెక్కల తనికీకిఁ జిక్కి భీతిలఁడు,
ముహ్తాసీ బంగడి ముందు కేతెంచ
దొంగతూనిక గుండ్లఁ దూచువర్తకుఁడె
తనికి మినికి చాల తత్తరంబొందు.
షాహియామాటల సవ్వాడిదెలిసి
యెదలోన నదవదగొంద కొనఁజూచి
ఆజ్ఞా ప్రచండమా హస్తంబువిసరి
నవమంత్రితో నిట్లు కవిసి మాటాడె

దోషి వాచాలత దొంగవంచనల
దబ్బరాటలఁ దన తప్పిదంబులను
మాపఁజాలునె వెడమాటలింకేల?
నీవిరోధి యెవండు నిశ్చయంబుగను
నీదోషములు చెప్ప నే నమ్మలేను,
కాని నాకన్నులఁగంటి నీతప్పు.
ఆస్థానమున నున్న యందఱిలోన
లలిమించు నాగులాముల పైనిదప్పు
నొరులపై నీదృష్టి నెరయుటలేదు.
అనవిని యావాగ్మి చనవున నవ్వి,
ఔను. మీరన్నది యంతయు నిజమె
యున్నసత్యము దాపయోగ్యంబుగాదు,
వినవెంతురేని నేవిన్నవించెదను
చక్కని పలుకొండు, సతము మీయాజ్ఞ
ప్రసరించుగావుత, రాజ్యంబురమయు
చిరధృడంబై మిమ్ము సేవించుగాత!
త్రావగంజియులేని దరిబేసి గనఁడొ
భాగ్యవంతుల దుఃఖభారంబుతోడ?
యౌవన సౌభాగ్యమరిగె నవ్వీడి,
బ్రదిమి దాచెను నాటపాటల యదను
మోహన లావణ్య మూలధనంబు
గల గులాముల గాంచఁ దొలఁగునా యొప్పు.

తరళమౌక్తికముల సరముగుట్టంగ
బాదుషా హర్షించి వహ్వారె! యింత
కంటె మేలాయెట కరము దుర్లభము
ఎవరైన నిటువంటి దృష్టాంతములను
హేతువులంజూపి యెదదన్నునేని
దోసంబె ప్రణయపాత్రుల జూచినంత?
నేర్పు నోర్పుల తోడ నేనాలసింప
కున్న, విరోధి యీర్ష్యోక్తులవలఁ
పాపమీతనిబట్టి బంధించెయుందు.
దౌర్జన్యమునఁబొంగి త్వరపడి ఖడ్గ
మొఱనుండిలాగిన పురుషుండు వెనుకఁ
బరితప్తహృదయుఁడై కఱచుమీఁజేయి.
ఈర్ష్యాళువుని మాట లెన్నడువినకు:
వానిపల్కులు నమ్మి పనిసేయుదేని
కడకుఁ బశ్చాత్తాపపడుట నిక్కంబు
మంచిపేరు వహించు మంత్రివర్యునకు
పదవిభాగ్యము గౌరవంబు హెచ్చించె,
దబ్బరాడినవాని దండించె షాహి.
సరి విచారించి యాచారమెఱింగి
పనిబూను మంత్రి సత్పాలన వలన
మంచికిఁబేరల్లె మహిపుండెల్లెడల
న్యాయమౌదార్యంబు నడుమొప్పఁబ్రజలఁ

బలువత్సరంబులు పాలించి చనిరొ,
నయిన నాతనికీర్తి యలరు చిరంబు,
మతము పోషించిన మాన్యులౌ నృపులు
మతబాహువునకు సామ్రాజ్యకందుకము
కొంపోవుదురు తాము కోరిన గుఱికి.
ఇటువంటి నరపాలు నీకాలమందు
నొక్కని నేఁగాంచ, నుండెఁబో యొకఁడు
బూబకర్ సాదె యాభూపుఁడై యుండు.
తెలివి తేటలు గల దేశపాలకుఁడు,
పరమ ప్రసన్న స్వభావ నిర్మలుఁడు.
ఫలియించుగాత భూపతి కోర్కెకొమ్మ.
స్వర్గ భూజమవీవు షాహి. యొక్కఁడు
నడచినం దరుగని పుడమిపై నీడు
ఘన రక్షణచ్ఛాయ గప్పివైచితివి!
కాంక్షించితిని శుభగ్రహము నాపైని
నెఱపుహుమా ఱెక్కనీడ యటంచు;
'వరబుద్ధి' యిట్లనెఁ. బయిహుమానీడ
పడినంత నీకుఁ జేపడవు సంపదలు!
కొఱలేని భాగ్యంబు గోరెదవేని
ఈ రాజునీడఁగో నిలుగట్టుకొమ్ము.
ప్రభురక్షణచ్ఛాయ ప్రజలపై నెఱపి
దేవ, మమ్ములఁ గృపాదృష్టిగాంచితివి,

ఈ రాజ్యపుణ్ణ షేను మొద సంస్కరించి
ప్రార్థించెదను దానభావంబు తోడ.
శాశ్వతంబుగ దీని సలుపుమో దేవ.
తలద్రుంచుటకు మున్ను దండితుఁ జెఱకు
బెట్టమేలగు, దెగఁగొట్టిన శిరము
మరల జోడింప నెవ్వరివల్లగాదు,
ప్రభవ శాసన ప్రబలుఁడౌ నృపతి
కలత చెందఁడు ప్రజా కలకలంబునకు;
తలపోత సున్నైనఁ దలను గర్వంబు
నిండి తుంపెసలాడు నిర్విచారుండు
ధరణీశు మకుటంబు తలఁదాల్పఁదగఁడు.
అనిఁగోన వెనుదీక యడుగూనుమంచుఁ
జెప్పను, గోపంబు చిప్పిల్లినపుడు
బుద్ధి యథాస్థానమున నుంచుకొమ్ము.
తెలివియున్న యతండు తలఁచు నోరుపున,
కొరబుద్ధి వాఁడౌను గోపవశ్యుండు.
మాటువీడిన సేనమాడ్కిఁ గోపంబు
వెలికి విజృంభించు వేళ, న్యాయంబు
భక్తి మతంబను బాటింపు గలదె?
గగనంబు క్రింద నేఁగాంచ నెప్పుడును
కోపంబుఁ బోలిన ఘోర భూతమును.
సురలైన దానికి వెఱచి వెళ్ళెదరు.

# సాదీవచనము

ఆజ్ఞ కౌ. బ్రతికూల మగు నేని నీకు
తాంత్రిపుటయుం గూడ తప్పిదంబగును,
ఆజ్ఞానుసారంబు హత్యగావింప
అది న్యాయసమ్మతం బైనదే యగును.
తల త్రుంపుమని నీకు ధర్మాజ్ఞ యైన
వెలువక కార్యంబు నెఱవేర్చవలయు.
మృతుఁడైనవాని యాత్మీయులపైని
కరుణావహించి సౌఖ్యములొంద నిడుము;
దుర్మార్గునిదె యుందు దోషంబుగాని
దారపుత్రుల తప్పిదం బేమిగలదు?
కండమెత్తున్నను దండుమోపున్న
శత్రురాజ్యము బట్ట సైన్యమంపకుము,
పెనుదుర్గముండఁ గైకొని వైరి నృపుఁడు
తనుగాచి కొనును, నేతప్పు లేనట్టి
ప్రజలు సంకటముల పాల్పడు చుండ్రు.
బందీల స్థితిగతుల్ పరికించు. చెఱను
ఒక వేళ నిర్దోషియుండిన నుంచ,
పరదేశ వణిజుండు పట్టణంబందు
మరణింప నాతని సరకు సంపత్తు
కోశంబునకు జప్తుగొనుట నీచంబు!

అవ్వాల నతనికై యాత్మీయబంధు
వర్గంబు పలవించి పలువాట్లు గుడిచి
యన్యోన్యమీరీతి ననుకొనుచుండ్రి.
"దురదృష్టవంతుండు తుదకన్య రాజ్య
మందుఁ జచ్చెను, వాని యాస్తిపాస్తులను"
బలవంతముగ దుష్టభావుండు గొనియె.
తండ్రి లేని నిసుంగుఁ దలపోయుమయ్య,
ఆకందు పరివేదనావిల హృదయ
పిండమ్ము వెలికూర్చు వేడినిట్టూర్పు
జగము దహింపంగఁజాలుఁ జాగ్రత్త!
ఏబది యేండ్లపాటిలఁ గూర్చికొన్న
సద్యశంబొక్క దుశ్చరితమడంచు.
సత్కార్య నిరతుఁడౌ శాశ్వతకీర్తి
బలవంతముగ ప్రజాభాగ్యంబు గొనఁకు.
ఇంచుమించుగ ధరకెల్ల ఱేఁడయ్యు
ధనికుల ద్రవ్యంబుగొన. యాచకుండె.
ముక్తుండు దారిద్ర్యమునఁ జచ్చుగాని
నిఱుపేదలను వేడి నింపఁకు కడుపు

## దయగలరాజు

న్యాయతత్పరుఁడైన నరనాథుఁడొకఁడు
పైని లోపల నొక్కపాటి వస్త్రంబు

పెట్టికుట్టిన యంగి ప్రియముగఁ దాల్చు
అదిగాంచి మిత్రుఁ డిట్లనియె నోషాహి,
భాగ్యశాలివి, చీనిపట్టుటంగీని
కుట్టించుకొమ్మన నిట్టు మార్వలికె
తనువున కింతమాత్రపుఁ గప్పడంబు
కడు సుఖంబగు, నింతకంటె మించినను
సౌందర్య మొసఁగు భూషణమనం జెల్లు.
ప్రజల నొత్తిడిపెట్టి పన్నుగైకొనుట
నన్ను నాగద్దియ నాకిరీటంబు
నింపుగాఁగ నలంక రింపనుగాదు
స్త్రీవలె పట్టుకుడ్డిని దాల్తునేని
పౌరుషంబున నెట్లు పగఱ మార్కొందు?
నాకును నూఱువాంఛలు పుట్టుగాని.
నాయొక్క నిదెగాదు నగదు బొక్కసము;
దండుబత్తెము కొఱకుండు కోశంబు
ఇచ్ఛమైనగలకు వెచ్చింపఁగాదు
జననాథుచేఁ దృప్తిగనని సిపాయి
రాజ్యంపు టెల్లల రక్షింపఁబోఁడు.
పల్లెవాని ఖరంబుఁ బరుఁడాచికొన్న
వాఁడెట్లు చెల్లించుఁ బ్రభువు కప్పంబు?
చలపట్టి పగఱ రాసభము గొంపోయె!
విడువక సుల్తాను పిడిచె రక్తంబు.

ఇట్టి యేల్బడిలోన నేమి సౌఖ్యంబు!
రైతు సంపదయెట్లు రాజిల్లఁగలదు?
పతితునిపై నీదు బలమెల్లఁ జూపి
పౌరుషంబని గర్వపడఁ బోకుమోయి:
చీమ ముంగలనున్న చిరుతండులంబు
నపహరించును నొక్క యధమఖగంబు;
పోషింతువేని, కాఁపులు పండ్ల చెట్లు,
జెలుల యిష్టము మేర ఫలము భుజించు.
దయమాలి, ఫలియించు తరుల మూలములు
త్రవ్వ మాంధాత్ముండు తనకుఁ దానుగనె
గొనకొని యపకార మొనరించుకొనును,
అనదల నొప్పింప నట్టి సజ్జనులు
యౌవన భాగ్యంబు లనుభవించెదరు.
బలహీనుఁడొకవేళ పతితుఁడౌనేని
దైవంబుఁ దలఁచి యాతఁడు పెట్టు మొఱ్ఱ
హృద్దవానలమౌచు నేర్చు జాగ్రత్త!
సదుపాయమున గెల్పు సాధ్యమౌనేని
క్రూరాజి నొక్కసి రోమకూపమున
నెత్తురొల్కని రీతి నెఱవేర్చుకొమ్ము.
బాస చేసెద మానవత్వంబు పైని
సకల ప్రపంచ రాజ్యము నీకుగాదు
ధరణిపైఁ దొరఁగు నెత్తురు బొట్టుతోడ.

## జంషీదు శాసనము

పరమసంతోష స్వభావ ధన్యుండు
జంషీదు పాదుషా శాశ్వతంబుగను
ఊటడిగ్గియ గోడనున్న ఱాపలక
వ్రాయించె గుంటకురంబుల నిట్లు
ఈయూఁటదగ్గర నెందఱోమున్ను
మాతాత తండ్రులమాది రొక్కంత
విడిసి చల్లనినీడ విశ్రాంతినొంది
కనుఱెప్పపాటులోఁ గడ తెంచినారు,
బల పౌరుషములఁ బ్రపంచంబు గెలిచి
పోవునప్పుడు నొక్క పూరిపుల్లైన
గోరీల మిట్టకు గొంపోయినారె?
ప్రబలశత్రువు నీకు వశుఁడగునేని
కష్టపెట్టకుము, నీ కరుణకుఁ బాత్రుఁ
డైన దుఃఖమె వాని యాత్మపీడించు.
దాయరక్తము నీదు తలవ్రేలుకంటె
బ్రతికి పిచ్చెత్తి నీ పరిసరంబులను
దిమ్మరు శత్రువే ప్రియమగుఁగొంత.

## రాజు, మందకాఁపరి

ప్రథిత వంశీయ భూపాలుండు దార

వేట దినంబున బెడిసె వేటరుల;
పరుగెత్తుకొని వచ్చెఁ బ్రభువు ముందరకు
మందకాఁపరియైన మనుజు డొక్కండు.
ద్వారపాని శంకించి ద్రోనముండి తూఁపు
వెడలించి యురవడి విల్లెక్కు వెట్టె;
"నైరులంగూర్చి యెడారి జాగ్రత్త.
కంటక రహితమై యింటగులాబి
వఱలును" మంద కాఁపరియు భీతిల్లి
యఱచెః శత్రువుగాను పరిమార్పఁబోకు;
మీ గుఱ్ఱములమంద మేపు సేవకుఁడ,
పచ్చిక బీళ్ళలో పని సేయువాఁడ
ననవిని స్వస్థమయ్యెను రాజుమనసు.
నవ్వుచు నిట్లనె నరనాథుఁడోరి
చెనఁటి, నిక్కాపాడె జబీబ్రిలు దూత,
యటుగాక చెవినంట నల్లియలాగి
వేగ నారాచంబు విడిచియేయుందు.
అనవుడు నవ్వి యిట్లనియెఁ గాపరియు;
మిత్రులకడ దాప మేలౌనె హితవు?
పరుల స్నేహితులను గుఱుతింపలేని
నృపు వివేకము శంసనీయంబు గాదు.
క్రింది తాబేదారులందు నొక్కొకని
నెఱిగియుండుట విధి సరదారికెపుడు;

తమరిసన్నిధి నన్నుఁ దఱచు చూచితిరి
మందల బీళుల మంచి సెబ్బరలు
నడిగియుంటిరి, నేఁడు కడు ప్రీతిదాయ
శంకించితిరి నన్ను శతుృవటంచు,
విఖ్యాత భూపాల వినుము నేలకు
తత్త్వదుల నొకొక్క దాని గుర్తింతు;
తెలివి తేటలపైని నెలకొనియుండు
హాయపాలనము; మీరు నట్టులే ప్రజల
జెదరనీయక యేల స్థిరత చేకూఱు.
మందగా చెడువాని మహిత వివేక
మవనీశునందు రవంత దగ్గినను
రాజ్యంబు విప్లవారాజకంబగును.

## రాజు ప్రజలమొఱ వినుట

శనియుంత యెత్తున శయన మందిరము
నందుఁ బన్నున్న న్యాయార్థుల మొఱలు
చెవికెట్లు సోకు నీకవనీశ, వారి
విలపనంబులు కూయి వినబడునట్లు
కూఁత దూరంబునఁ గూర్కిన మేలు
నీ యేల్బడిని నొక్క నిర్బలుండైన
బలవంతు నిక్కచ్చి పలవించు నేని
యది నీవు చేసినయట్లు బాధ్యుఁడవు.

సార్థవాహుని కొంగు శ్వానంబు చింప
దాని సాకెడు పల్లెవానిదే తప్పు.
నిర్భయంబుగఁ బల్కు నేర్పువోసాది,
పలుకు వాలున్నపై గెలుపు గైకొనుము,
అరలేక వచియింపు మెఱఁగినదెల్ల!
సత్యమాడుట మేలు సంకటపడియు.
మొగమిచ్చకము లేను, ముట్టవు లంచ.
మర్థించు నాలుక యాడక కట్టి
విజ్ఞానమెల్లెడ వెదచల్లి కోర్కె
లెల్ల ఖండించి నీ యిష్టానుకూల
భావంబులను జంకుపడక బోధించు.

## బిచ్చగాని పలుకులు

మేడ తోరణ క్రింద మొయిసోల నిలిచి
కూటిపేద యొకండు గొణఁగు మాటలను
ఈరాజు నరపతి కెఱిగించిరిట్లు;
దేవుని వాకిట నీవు సైతంబు
ఆశాఫలార్థివై యంజలించెదవు;
కావున, విడక నీ దేహడీముందు
వేచియున్న యభాగ్య యాచక శ్రేణి
కాంక్షలీడేరంగఁ గరుణింపు మయ్య.
ఇక్కట్లు పడువారి హృదయ బంధముల

సడలింపు మెపుడు నీయెడఁద దుఃఖంబు
తొడరక నిత్య సంతోషంబు నలర.
న్యాయార్థులైన జనాళి చిత్తార్తి
సింహాసనచ్యుతుఁ జేయు భూపతి?
అంతఃపురంబున హాయిగా నీవు
మధ్యాన వేళ నెమ్మది నిద్రపోయి
బీదసాదుల బైటఁ బెటులు టెండలను
గాగుడంచని చెప్పఁ గారుణ్యమగునె?
అవనీశు వేడి న్యాయము గాంచ లేని
వానికి న్యాయంబు పాలింపఁ జేయ
దీనావనుండొక్క దేవుఁడే దిక్కు.

## కరవుకాలమున రత్నాంగుళీయక మమ్మి ప్రజలపోషించిన రాజు

అబ్దుల్లజీజుని యాత్మజుంగూర్చి
చెప్పెనిట్టుల నొక్క శేముషీ ఘనుఁడు;
భూపాలకుని వ్రేలభూరి రత్నంబు
పొదిపిన యుంగరంబు పొలుపొందుచుండె.
నేర్పరియయ్యు మాణిక్య వర్తకుఁడు
అద్దాని మూల్యమింతని తేల్చలేఁడు.
అదిశోభ వెదచల్లు నవని రేవేళ
వెల్గునఁ బగల్గు వెలుగు ముత్యంబు

గావచ్చు ననవచ్చుఁ బైవిచ్చు కాంతి.
విధివశంబున సంభవించె నొక్కఁడు
మల మల మాడ్చు నిట్టల మైకలవు.
జనముఖ పరిపూర్ణ చంద్రబింబములు
ప్రతిపత్తు శశిరేఖవలె సన్నగిల్లె.
ప్రజలలో సౌఖ్యంబు బలము నశింప,
తాను హాయిగనుంట మానవత్వంబు
గాదని యెఱిఁగి నా కరుణా మయుండు.
ప్రజలనోట విషంబు పడుట వీక్షించి
యెవని నోటను దేనె యెట్లు పెల్లూరు?
జేని కనాథ దరిద్రులపైని
స్వాంతంబు కరఁగి యాజ్ఞాపించెనిట్లు;
ఈయమూల్యపు టంగుళీయకమిమ్ము
తెండు రొక్కంబనఁ దెచ్చిరివారు.
కొల్లబెట్టెను రాజు కోట్లకుఁ ధనము
పేదవారికి దరిజేసి మూఁకలకు
నక్కఱ గలవారి కొక్కవారంబు.
ఇటువంటి యుంగర మెన్నాళ్ళకైన
మరలఁ జేపడునె యీనరపతి కంచు
నిందింపసాగిరి కొందఱందఱు;
కరఁగి మైనపువత్తి కారెడుభంగి
చెక్కులఁ గన్నీను చింది జాఱంగ

నని యె నిట్లని, మున్ను వినియుంటి నేను,
పురవాసు లిడుముల మొరపిల్లుచుండ
నరపతి కర్హంబె నగలు నాణెములు?
జనులు యెడంద కష్టము లొందుచుండ
ఱాయి చెక్కని యుంగరమె నాకు మేలు.
తన సౌఖ్యమునకన్న జనుల సౌఖ్యంబు
గోరువాఁడెప్పుడు గూరు సంతుష్టి.
గుణవంతుఁ డితరుల గోను హానులను
తనకు సంతోషంబు గనవాంఛ పడఁడు.
గద్దెపై స్వప్నంగ సుఖంబుగ గూర్క
వెలుపల బీదసాదలు నిమ్మళముగ
నిద్రపోవుదురంచు నేను దలంప.
నడిరేయి వఱకు భూపుఁడు మేలుకనిన
హాయిగా శయనింతు రందఱు ప్రజలు.
భగవంతుఁడు నుతింపఁబడుఁగాక! యిట్టి
ఋజుమార్గవర్తన మిట్టి సద్గుణము
లలవడె బాబర్ అవనీశ్వరునకు.
ప్రియుగాంధ్ర సౌందర్య విభవంబు వలని
బాధలొందుట దప్పఁ బారసీకమున
నిఁక జనోపద్రవ మెట్టిది లేదు.
గతరాత్రి సభలోన గాయకుండొకఁడు
పాడిన మైను ద్విపదలు నా చెవుల

నమృతధారల రీతి హాయిచేకూర్చె.

## మందలింపు

నిన్నటి రేయి నానిండు కౌఁగిటను
పరిపూర్ణ చంద్రాస్యఁబట్టి లాలింప
జీవితానందంబు చేఁజిక్కెనాకు,
నిద్రమత్తున నున్న నెలఁతనుగాంచి
తరుణి, నీకడ దేవదారు వృక్షంబు
మఱుగుజ్జుదనమునఁ బరిభూతమగును.
మధురమౌ స్వప్నంబు మాంద్యంబు దొలగి
కన్నునర్గను పూలఁ గడఁగు మొక్కెంతి.
పూచు గులాబి పూఁబోఁడ యుల్లునవ్వు
బులిబులిపోల్కి సొంపొలయు మాటాడు.
కాలవిప్లవమౌ యిం కేల నిద్రింప.
రమ్ము, తెమ్మెరటకునై శమ్ము కెంపారు
మధురాసవంబని మందలించితివి.
నిదుర మేల్కొనిచూచి ముదిత యుల్లసిలె,
విప్లవమని నన్ను వేరొక్కంతివీవు
కనుకూర్కవద్దని కినిసి పల్కితివి.
కాంతి మచ్ఛ్వేతంబు గల యబూబకరు
రాజ్యకాలంబునఁ బ్రజలలో నింత
కంటెను నిద్రమేల్కొని యుండవలసె
నట్టి విప్లవమొప్పు పట్టదన్యంబు.

# తక్లాప్రభువునకొక పుణ్యాత్ముఁడొసగిన హితోపదేశము

ప్రభువు తక్లా జంగిరాజ్య పీఠంబు
నధివసించిన నాఁటి యన్ని సంగతులు
పూర్వ రాజ చరిత్రమున వ్రాయఁబడియె
అతని యేల్బడి కాలమందు నెవ్వండు
ఎవ్వని బాధించి యెఱుఁగడన్మాట
పొల్ల సత్యంబేని, పూర్వులకంటె
నతఁడు శ్రేష్ఠుండగు, ఆపేరు చాలు
భూపాలుఁ డొకనాఁడు పుణ్యాత్మునితోడ
భాషించెనిట్లు, నాబ్రతుకు వ్యర్థముగఁ
గడదాఁకె, రాజ్యంబు గద్దెయుం బదవి
నొకనాఁడు విడిపోవ యుండముగాన
పక్కీరుదప్ప నెవ్వండు ప్రాభవంబు
గొనిపోవఁ డీలోకమున నుండి సుంత.
పరచింత భక్తిభావన నొక్కమూలఁ
గూర్చుండి పుచ్చెదఁ గొరవమూన్నాళ్లు.
అనవుడు కాంతి మన్మనుఁడు పండితుఁడు
కోపంబు తాపంబు దోఁపనిట్లనియె;
ఓయి తక్లా, యూరకుండుము, చాలు!
మానవ సేవయే మతమానుగాని,

చిఱుచాప జపమాల చినుగుళ్ళబొంత
యున్నంత మాత్రాన యోగ్యత రాదు.
దరి చేసివలె నీవు పరిశుద్ధచరిత
వడసి పెద్దలనీతి పాటింతు వేని
గద్దెయెక్కియు నేమి గలుగు లోపంబు?
సత్యేచ్ఛ నిరత నిష్కపట ప్రవృత్తి
గలిగి సత్కార్య దీక్షకు సిద్ధపడుము.
పొగడింపుమాటలు బోలు నటనలు
పలుకనీకుక నాల్కఁబట్టి బంధించు,
మతమన్నపని, యుత్తమాటలు గాదు
పనిపాటు పస లేని వదరు వాగుళ్లు
కడు సారహీనమై గాలికింబోవు.
పావనత్వంబను పసిఁడి రొక్కంబు
గల గొప్పవారు చీల్కల కుట్లబొంత
నగపడక ధరింతు రంగీలకింద.

## రూముసుల్తాను ఒక పండితునితో తన స్థితిని చెప్పుట

సజ్జనుండు సర్వశాస్త్ర తత్త్వజ్ఞ
మౌళిల విలాపించె రూము పాదుషహా
యనియిట్లు వినియుంటి, ననఘుఁ డీనాడు
శత్రుల నరికట్ట శక్తిహీనుండ.

ఈరాజధానియు ఈ కోటదప్ప
మిగులదెద్దియు, నేను మేను చాలించి
వెడలిన పిదప నాకొడుకు రాజ్యాంగ
సభకు నధ్యక్షుని సలుపు యత్నంబు
నొనరించితిని గాని, యొక్కదుర్జాతి
వైరికిప్పుడు లొంగవలసె, నాధైర్య
హస్తంబు మెలివెట్టె, యత్నంబునూడ్చె.
ఏమి ప్రతిక్రియ? ఎటు నిర్ణయింతు?
పొగిలె దేహ ప్రాణములు దుఃఖవహ్ని.
అనవిని పండితుండనియెఁ గోపమున,
ఇంత విజ్ఞానంబు సంతరించియును
ఇట్టుల పలవింప నేల యోషాహి?
ఇఁక రాజ్యమున్న నీకేమిలాభంబు?
నీ సొంత చింతలు నీవు భరించు.
వ్యయమయ్యె నెక్కువపాలు జీవితము.
ప్రాయంపుఁ బటిమ స్వప్నప్రాయమయ్యె
కడమ దినంబులు కడవెళ్ళఁబుచ్చ
నిప్పుడున్నంత సమృద్ధి గాఁజాలు.
నీవు చన్నంత నీనేల యంతయును
మఱియొక్క నరపాలు కరగతంబగును.
అతఁడు నేర్పరియైన నవివేకియైనఁ
దనకష్టములు దానె తలమోయఁగలఁడు.

నడుమ నీవేల యీకడగండ్లు గుడువ?
రాజ్యముండుట దాని రణమునం గొనుట,
త్యజియింప వలయుట దలపోసి చూడఁ
బడుపాట్ల కీడైన ఫలము చేపడదు.
ఇపుడు నీబుడ్డ నివెగదోసికొమ్ము,
నీవెన్క వచ్చెడి నెవ్వరికాఁడు
తన యిక్కటులు దానె తరియింపఁగలఁడు.
మూన్నాళ్ళ ముచ్చట మురియకీ బ్రతుకు,
పయనించు నేర్పాటు పరికించుకొనుము.
బలహీనులను బట్టి బాధించినట్టి
యజమీ కృపాలుర యందు నెవ్వని
ఎఱుఁగుదువీవు? మఱెవ్వని గద్దె
రాజ్యంబు రమయు జీర్ణము గాక యుండెఁ
బరమేశ్వరుని యేలుబడి యొండుదప్ప?
అసలీ ప్రపంచమే యస్థిరంబౌటఁ
జిరకాల మెవడిందు జీవింపఁగోరు?
వేని బంగారంబు వెండి బొక్కసము
అతఁడేఁగ గొన్నాళ్ళ కడుగంటకుండు?
శాశ్వతంబుగ నొక్క సత్కార్యమిలను
సలిపిపోయినవాని శాంతాత్మ పైని
నిరతంబు వర్షించు నిండు దీవెనలు!
మంచి పేరుండిన మాన్యుండె 'యుండె'

నని చెప్పవచ్చు పుణ్యాత్ములతోడ.
ఔదార్య వృక్షంబు ప్రోదియొనర్చి
యిష్టఫలంబు సంతృప్తిఁ భుజించు.
రిక్తులఁ గరుణింపు: రేపు నీ కనిలోఁ
బాపపుణ్యంబులు పరికించునపుడు
పదవి సత్కార్యంబు బట్టిలభించు.
మేలు సేయఁగ ముందు కాలిడు నతఁడు
దైవ సన్నిధిని పెద్దరికంబు గాంచు.
నీచుండు, వెనుక కొండెము సెప్పువాఁడు,
సిగ్గిఁడి, దొరపని సేయని యతఁడు
కూలిగాంచని రీతి మూలఁ గూర్చుండు,
వాని విసర్జించు వనట నీఁజేయి
మునిపంట నొక్కంగఁ, బెనము వేడెక్కి
నపుడు రొట్టెనుగాల్చ యత్నింపఁబోఁడు,
పంట యొబ్బిడి వేళఁ బరికింపఁగలవు
తఱిని విత్తకయున్న కొఱగాని తనము.

## జనకంటకుఁడు సన్న్యాసి యనుగ్రహము వేడుట

లోక సాంగత్య లోలుండు గాకెడసి
పాము దేశమునుండి సన్న్యాసి యొకఁడు
వచ్చి వసించెఁ బర్వత కందరమున.

కరమోడ్చు మొఱని చీఁకటి కోనలోన
నిత్య సంతృప్తి పెన్నిధిగాఁ గాంచె.
అతఁడన్య గృహముల నడుగు వెట్టండు.
కాని పెద్దలు వాని గడపఁ ద్రొక్కెదరు.
నిర్బంధ దారిద్ర్య నియమంబుఁ బూనె
సన్న్యాసి లోఁదృష్ణఁ జల్లార్పనెంచి
ప్రతిజాము ప్రాణంబు మెతుకు దెమ్మనుచు
దీవరింప నతండు తిరుగు గ్రామముల.
ఈ వృద్ధుఁడున్న నాఁడేలుచునుండె
జన కంటకుండైన సర్దారి యొకఁడు.
బలహీను లెదురైన బలవంతిపెట్టి
చేతులు మెలిత్రిప్పి చెడుగందు నోంచు.
లోక దాహకుఁడు, మేలున కడ్డగట్ట,
నెనరు నెమ్మది లేని నిష్ఠురకాఁడు,
వాని నిర్బంధంబు వలన లోకంబు
పడరాని యిడుములు కడగండ్లు గుడుచు.
వాని యొత్తిడి కాగలేని వారన్య
భూమికి వలసలు పోయి; రాదుష్టు
నపకీర్తి పల్లెలయందుఁ జాటుచును.
కసిగాట్ల యెడఁద తోఁగటిక పేదఱిమిఁ
బెను బాధలకు నోర్చుకొనియున్న ప్రజలు
రాటంబు త్రిప్పెడు రవళిలోఁగలయ

నన రాని దుర్భాషలాడు చుండెదరు.
ఏట బలాత్కృతి చేతి కెదురు లేకుండు
నట నెవ్వరి మొగాల హాసంబు గనము.
అప్పుడప్పుడు వచ్చు నాదుర్జనుండు
సన్న్యాసి దర్శించి సల్లాపమాడు.
కాని యా యనఘుండు కన్నెత్తి వాని
మొగము తెట్టుగనంత, వగచి యాతేఁడు
ఒక్కనాఁడిట్లనె. ఓపావ గాత్మ,
ద్వేషించి ననుగాంచి తిప్పకు మోము;
నీమైత్రి వాంఛించి నేను వచ్చితిని,
నాపైని నీ కేల కోపంబు పగయు?
పాదుపాగానను పలుకొప్ప కొంకు,
కాని దర్వోషులకంటె గౌరవము
నందుఁ దక్కువగాను, అందఱికన్న
నన్నెక్కుడుగఁ జూడమన్నది లేదు,
ఒరులతో పాటె నన్నరసి మన్నించు.
మనవుడు పుణ్యాత్ముఁడా గ్రహంబొంది
నీవల్లఁబ్రజలు పొందిరి బాధ వెల్ల,
జనకింటకునితోడ సరి కాదు మైత్రి.
సతమీవు మన్మిత్ర శత్రువుగాన
నిన్నెట్లుదలఁతు నానెయ్యుండవంచు?
ఒక వేళ నాకు నీకొనరియుం జెలిమి.

యేమి సేయుదువు సర్వేశ్వరుండలు గ?
నిలువున చర్మంబు నొలిచినఁగాని
మిత్రవిరోధిఁ ప్రేమింప సాధ్యంబె?
తనవల్ల లోకులు వనరుచు రేల
కంటినిండుగ నిద్ర గనలేకయుండ
ఆతఁడు సుఖసుప్తి నందుటబ్బురము.
తెలివితేటలు జ్ఞానదీప్తి నీకున్న
సంసిద్ధుఁడవు గమ్ము సాధుపోషణకు;
కనికరం బౌదార్యమును గల్గినునుము.

## అభిభాషణము

ఓ గొప్పవాఁడ, నీవొనరింపవలదు
తక్కువవారిపై దౌర్జన్యమెపుడు.
బలహీనులను బట్టి బాధింపఁబోకు
వారేకమై నిన్నుఁ బైకొందురేని
కొఱగాని వాఁడవై కూర్చుండవలయు.
ఒరునిఁ బదభ్రష్టునొనరింపఁబోకు
నిస్సహాయుండవై క్రుస్సిపోయెదవు.
నిధి చేర్చుకంటెను నీమిత్రవరుల
హృదయశాంతిని గూర్చుటది యెంతో మేలు.
ప్రజలఁ గష్టంబుల పాల్సేయుకంటె
జనికోశం బుత్తదైన శ్రేష్ఠంబె.

వేచి కార్యంబేని విఱుగఁ ద్రోయకుము.
ఒక వేళ నీస్థితియును విషమించి
వాని పాదఁబులఁ బడుటయుం గల్గు,
బలహీనుఁడా, నీవు బలవంతుపీడ
సహియించుకొమ్మొక్క సమయంబునందు
అతనికంటెను నీవె యధికుఁడవ్యైదవు;
దౌర్జన్య కష్టంబు తప్పించుకొనుము
ప్రార్థనాంజలి పెట్టి, బలిముష్టికంటె
ప్రార్థనాహస్తంబె పటుశక్తియుతము!
దౌర్జన్య బాధితు తప్రోష్ఠమునకు
నవ్వావద్దని చెప్పు, మవ్విధి వశత
జనకంటకుని పండ్లుచాలూడి పడును.
భేరి నినాదంబు విని భాగ్యశాలి
నిద్రమేల్కొనుగాని. నిసియెట్లుకడచెఁ
దలవరి కనుసుంత తలపోఁతగలదె?
సార్థవాహుఁడు తన సామానుగూర్చి
పలవరించునుగాని, భారంబుమోయు
గాడిద వీఁపుపైఁగల యెత్తుపుండు
ఎట్లున్నదను చింత యిసుమంతయున్నె?
దీనికి దృష్టాంతమైన చరిత్ర
తెల్పెద, నేనట్లు తెల్పకయున్న

అజ్ఞానమని కొందఱను కొందు కేమొ!

## దృష్టాంతము

నాణెమైన ఢిమిష్కునగరంబు నందు
కనిపించె నొకయేడు కటిక కాటకము
ప్రేయసుల్ మఱచిరి ప్రేగు చింతనము;
ఆకసం బవనిపై నతిలుబ్ధమాట
బైరులు ఖర్జూర పాదపంబులును.
పెదని దడుప నీటిబిందు వేఁ బడదు,
ప్రాఁతయూటలు నెండబాఱె నీరింకె,
కనలే మనాథల కన్నీరుదప్ప
నిఁకనన్య జలబిందు వెచ్చటనైన;
ప్రొయినుండి యొకవేళ పొగలేచునేని
అది బీదవిధవల హృదయానలంబు
వెలికూర్చు ధూమంబె, వేఱుగాదోయి;
కట్టఁగుడువలేని కటిక దర్బసి
విధమునఁ జెట్లెల్ల విగత పత్రములు,
బాహు బలాఢ్యులౌ ప్రజలు కృశించి
పెఱుకష్టములపాలు పడుచున్నవారు.
గిరులపైఁ బచ్చన తఱిగెఁ; దోఁటలను
కొమ్మలు పుట్టవు కుజములందిపుడు.
భక్షించె మిడుతలు పండతోఁటలను.

కడుపు కక్కుఱితిచే మిడుతలం దినిరి
కడియన్న మెఱుఁగక మిడుకుజనంబు.
అటువంటి యడవున నాప్తుఁ డొక్కండు
అరుదెంచె నాయొద్ద; కతని దేహమున
అస్థులపై చర్మమతికియుండె.
పూర్వమైశ్వర్యంబు పుష్టియుంబడసి
యుండిన మిత్రుఁ డిట్లుండుట గాంచి
ఆశ్చర్యమున నిట్టులంటి సజ్జనుఁడ,
యిటువంటి దురవస్థ యెటు సంభవించె?
అనవిని బొబ్బరించినయట్లు పలికె:
కనలేద లోకుల కష్టభారంబు
సహియింప రానిదై చదలంటుచుంట?
మేఁమీతెను వారి ఘోరదుఃఖంబు;
ఒడ దాకసమునుండి వానబోల్పైని,
మొఱపెట్టువారల గోఱచు నిట్టూర్పు
పోగ నభోవీధికి నెగురుటలేదు!
నెయ్యుఁడ! గవియుంటి నీకేమి భయము?
విషము చంపగవచ్చు విరుగుడుమందు
లేని పట్టులయందు; లేమిడి దెబ్బ
నొకఁడు చచ్చిననేమి? యున్నది నీకు,
వానగాలికి నేమిభయము బాకునకు?
అనవిని నిట్టూర్చి యాప్తుతో నొగిలి,

పండితుండొక మొద్దుబాయిని జూచు
వడువున ననుగాంచి, పల్కె తాత్వికుఁడు:
ఓయి మిత్రుఁడ, యొక్కఁడుదధితీరమున
నిరపాయముగ నుండి, నెచ్చెలికాండ్రు
కడలిలోఁ బడిపోవఁ గని సౌఖ్యపడునె?
పసపు బాఱదు మోము బత్తెంబులేక,
రైనఁ దిండికలేని యిఱుపేద చింత
గాటమై నాగుండెఁ గసిగాల్లగొంచు,
తన యంగమునఁబోలెఁ దదితరాంగముల
నజ్ఞాని గాయంబుఁ జూడఁగోరంచు.
దేవుని కృప నాదు దేహ మక్షతము.
అట్లయ్యుక్షతగాత్రుఁ డగపడునేని
వాని బాధకు నాదు మేను కంపించు,
ఆరోగ్యవంతుఁడు వ్యాధి పీడితుని
ప్రక్కన నుండినఁ బాడౌను సుఖము
నిఱుపేద యాఁకట నెరియంగఁజూచి
అన్నంబు విషమట్లు తౌను నానోట.
స్వస్నేహితుని చెఱసాల ద్రోయంగ
పండ్లతోఁటలనైన వాఁడూఱడిలునె?

## స్వార్థపరుఁడైన వర్తకుఁడు

ఒక రేయి ప్రజల నిట్టూర్పు ధూమంబు

పయి రేఁగి బాగ్దాదు పట్టణార్ధంబు
బూదిచేసెనటంచుఁ బూర్వంబువింటి.
"నా దుకాణమునకు నష్టంబురాదు,
తప్పెనాపద" యంచు దైవంబుగూర్చి
బహు కృతజ్ఞత దెల్ప వందనశతము
లొనరించె నొకఁడు కాలెడు బూదివిల్చి.
ఆమూర్ఖుగని యొక్క యనుభవశాలి
పెద్దమనుష్యుఁ డీవిధమునం బల్కె:
నీ సొంతచింతయె నీకు ముఖ్యంబు,
పరచింత లేదె? యీపట్టణంబెల్ల
కాలియు నీ యిల్లు కడమూలనుండి
కట్టుకదలకున్నఁ గడు సంతసంబె?
ఒక్కడాఁకటి పొట్టకొత్తుగా వ్రాళ్లు
బిగఁగట్టుకొనియుంట వీక్షించి యెవఁడు
కఠినచిత్తుఁడు తప్ప కడుపారఁదినును?
దరిజేసి నెత్తురు త్రావుట గాంచి
ధనికుఁ డెవ్వఁడు దిను దనయోగిరంబు?
రోగినిగాంచి యారోగ్యవంతుఁడవు
అని వచింపఁబోకు మతఁడు దుఃఖమున
మెలి త్రిప్పు దేహంబు బలురోగియట్లు.
మృదుల చిత్తుఁడు తన మిత్రులందఱును
విడిది చేరుటగాంచి. వెనుచిక్కియున్న

యితరుల తిరస్కృతి నెంచి విదిలించు.
కట్టలమ్మెడు వాని గాడిద రొంపఁ
బడిన కష్టముగాంచి పాదుషా యెడఁద
కరుణార్ద్రమగుచు దుఃఖము మోయుచు డు.
సౌఖ్య ప్రదంబైన సౌధ ంబునందు
హాయిగా నివసించు నాతని కైన
నాది సూక్తులనుండి చాలొక్కమాట.
వినుదేని యూఁకొద్దియును నీకుఁజాలు,
''మల్లెలు గొనలేవు ముళ్ళను విత్తి''

## అభిభాషణము

అ వేదజనుల నత్యంత దుర్జనత
సిలుగువెట్టిన పారసీక భూపతుల
వృత్తాంతములు నీవు వినియుండ లేదె?
వారల గౌరవ పార్థివ శ్రీలు
గడచిపోయెను, పల్లెకాఁపుల పైని
కటిక జూపిడిగూడఁ గడచిపోయినది.
జనకంటకుం డొనర్చిన బలాత్కృతిని
కనుమ, దుష్కర్మంబులను వెంటఁగొనుచు
చచ్చినాఁడు; ప్రపంచంబు జీవించు.
అంత్యదినంబున న్యాయాత్మ తనువు
విశ్వేశ్వరుని సింహాపీఠికా ఛాయ

స్థానంబుగాంచి సంతస మొందఁగలడు.
దైవంబు తనయిచ్చ దవిలి వర్తించు
జనసంఘముల నేల, సద్భావయుతుని
న్యాయైక పరతంత్రు నరపతింగూర్చు.
ధరణి పాడొనరింప దలపోయునేని
రాజ్యంబు నొకదుష్ట రాజుచేఁబెట్టు.
మెలకువ మెలగంగ వలయు సత్పురుషు
లట్టిభూపతికడ, నదియేలయన్న
దేవుని కోపంబు తీవ్రతందాల్చి
యన్యాయ నృపుఁడుగా నవతారమెత్తు.
దైవంబు నీకిచ్చె తగ గొప్పతనము
ఆమేలు మఱవక యంజలివెట్టు,
మిల కృతఘ్నుని సంపదలు సన్నగిల్లు,
తన కృతజ్ఞత దెల్పికొనుట చేభాగ్య
మభివృద్ధి చెందు "నంచన్న శ్రీసూక్తి
చదువలేదె ఖురాను శాస్త్రంబునందు?
ఈరాజ్య సంపద లెసగి నందులకు
తగున్యాయ పఱతయు దాతృత్వమున్న
తఱుగని రాజ్యంబు ధనము గాంచెదవు.
ప్రజల బలాత్కృతిఁ బాలింతువేని
విభుత వెన్వెనుకనే బిచ్చమెత్తెదవు.
బలియుండు పెట్టు నిర్బంధంబువలన

బలహీనులును దుఃఖభారంబు మోయ
సుఖనిద్రపోవ రాజునకుఁ బాడియౌనె?
ఆవగింతంత్రైన నార్తినొందకుము
సామాన్య జనులను, సాహిగొల్లందు
ప్రజలు గొర్రెలమంద, ప్రభువెన్న డేని
అన్యాయ మొనరించి యత్రాశవెట్ట
దొఱయ గాపరిగాఁడు తోఁడేలుగాని
వాని దుర్ణయములు ప్రకటించి చెప్ప,
"తనకన్న తక్కువ జనుల నిక్కచ్చి
పాలుచేసిన నీచభావుండు చచ్చెఁ
జెడ్డయాలోచన చేసియుంజేసి."
అని వెన్క శప్పఁడవగు రీతి గాక
మంచివాఁడపుగమ్ము; మనుజుఁడెవ్వఁడును
నినుగని వేలెత్తి నిందింపఁబోఁడు.

## కీర్తి సంపాదించిన యన్న, ధనము సంపాదించిన తమ్ముడు

పడమటి దేశంపుఁ బట్నమందొక్క
తండ్రికి నిద్దరు తనయులు గలరు,
ఆసోదరులతిపాయని పోరుకాండ్రు.
ఉన్నతికంఠులు, నుద్ధరతనులు,
జ్ఞానవంతులును చక్కనిమోమువారు;

కత్తిసామున నేర్పుగల పోటుమగలు
వారి కాట్లాటలు వార రౌద్రంబు
గాఢ సంగర లిప్స కనిపెట్టి తండ్రి
పొత్తు కుదురుటింక పొసగదటంచు
భూమిని రెండు తెంపులుగ భాగించి
చెఱియొక్క ఖండంబు చేముట్టఁజెప్పె,
నిఁకమీఁద నొకనితో నొకఁడు పోరాడి
దురమున కరవాలు దూయనియట్లు.
తదనంతరము తండ్రి తనదు కాలంబు
పరిసమాప్తంబౌటఁ బరమేశ్వరునకు
అర్పించె మధురమా నాత్మ సిశ్చింత.
మృత్యుదేవత వాని యిచ్ఛపగ్గముల
సడలించి, కార్యహస్తము కట్టివైచె.
ఆరాజ సుతులకు స్వాధీనమయ్యె
మితిలేని ద్రవ్యంబు మేలు సైన్యంబు.
తనదృష్టి కనువైన దారి నొక్కొకఁడు
అనుసరించెను, వారియందు జ్యేష్ఠుండు
సత్కీర్తి వాంఛించి సలిపె న్యాయంబు
మఱియు రెండవవాఁడు కఱకు టొత్తిడుల
ప్రజల హింసించి ద్రవ్యము సంతరించె,
ఒక్కండు కారుణ్య ముప్పతిలఁగ
దాన ధర్మము చేసె, దరిజేసి ప్రజకు

కట్టఁ గుడువగనిచ్చి కడగండ్లు వాపె,
మేలు చేసెను. సిపాయీల ప్రేమించె,
బీదబిక్కయు రేయి విడిసి నిద్రింప
చావిళ్లు సత్రాలు చాలనిర్మించె.
పండుగ పర్వాల ప్రజల విధాన
బొక్కస ముడివోవఁ బోషించె సేన.
బూబకర్ సాద్ జంగి భూపాలుఁడేలు
నపుడు షీరాజ్ పట్నమందునఁ బోలె
సంతోష నినదంబు జయజయారవము
మేఘగర్జల లీల మిన్నంటి మ్రోసె.
బుద్ధిమంతుఁడు నాదు భూపాలమౌళి
పరమ ప్రసన్న స్వభావ ధన్యుండు.
ఫలియించుగాత భూపతి కోర్కెకొమ్మ!
వినుఁడయ్య. సత్కీర్తిగనిన సోదరుని
కథ: మంచి నడవడి గలవాఁడతఁడు
సంతుష్ట హృదయుండు సౌజన్యధనుఁడు,
పిన్న పెద్దలను సేవించు నాదృతిని,
రేపు మాపులను బ్రార్థించు దైవమును.
ధరణీశ్వరుఁడు న్యాయ తత్పరుండౌట,
దరిబేసులకుఁ దృప్తి దైవాఱుచుంట.
ఆరాజ్యమున లోభి ఖారూనుగూడ
వెఱ సుంతయును లేక విహరింప వచ్చు.

అతఁడు రాజ్యంబేలు నదనునం బ్రజకు
నెదను ముల్లంటదు., తుదకు గులాబి
రేకైన నొంసిన రీతి గన్పడదు.
రాజ్యాధికార గౌరవము తోడ్పడఁగ
వశవర్తులను సల్పెఁ బరనృపాలురను.
తాను గీచినగీటు దాటనియట్లు
సర్దారు లాజ్ఞాను సరణి వర్తిలిరి.
ఇంక రెండవషాహి యిటులాజ్ఞవెట్టె
"అభివృద్ధి సేయుండు ప్రభుత కోశంబు.
పల్లెరైతుల నొక్కి పన్ను పెంచుండు."
కడులోభి యారాజు కఠినచిత్తుండు
వణిజుల ద్రవ్యంబుపై నాసగొనియె.
దిక్కులేని బికారి దీనులనేచె,
దరిబేసులకు చెడ్డ దలచె నటంచు
నేను జెప్పనుగాని, నిక్కమారసినఁ
దనకుదానె విరోధియని పల్కవచ్చు.
ధనము హెచ్చుగఁగూర్చు తలఁపుతో నతఁడు
దానంబు సేయఁడు, తాను దినండు,
పండితులీసేఁత బాగని యనరు.
ఇతరుల వంచించి యిటు డబ్బుచేర్చెఁ
'దినఁ దిండిలేక డస్సెను కాల్బలంబు.
అవివేక నృపుని రాజ్యమునందు నిట్టి

సిలుగు నిక్కచ్చియుఁ జలకేఁగెనంచు
వణిజులు విని సంతపట్టుల సరకు
కొనుట యమ్ముట చాల కుంచించుకొనిరి.
పాడిపంటలులేక పల్లె కర్షకులు
మనుగడ భారమై మసియు మాఁడైరి.
తన యదృష్టము మాఱువల చూపినపుడు
పరరాజు దండెత్తివచ్చి జయించె
ప్రతికూల దైవ మవ్వాని మూలముల
ఫలముల తుండించి పాడొనరించె,
ప్రబల విరోధి గుఱ్ఱపు గిట్టలొరసి
పల్లెపట్టులు త్రవ్వఁ బడినట్టులుండె.
వెనకెద వెవనిలో విశ్వాస, మీవె
సలిపిన వాగ్దానములు త్రోసిపుచ్చ?
పన్ను లెవ్వరివద్దఁ బడయఁగోరెదవు
పల్లెరైతులు పరప్రాంతంబుసేర?
వెనువెంట శాపముల్ వేటాడుచుండ
కల్మషాత్ముండెట్లు గాంచు శ్రేయంబు?
జనివేళ తన యదృష్టము బోర్లగిలుట
పెద్దల హితబోధ పెడచెవింబెట్టె.
సత్పూరుషులు నొక్క సౌమ్యునితోడ
నేమిచెప్పిరో వినుమిప్పు డామాట,
"అనుభవింపుము నీవె యన్యాయకారి

తినలేక వదలిన తియ్యని ఫలము''
న్యాయంబు వలన సమార్జింపఁ గలుగు
అర్థ మన్యాయమునందు వాంఛించు
వాని తలంపులు వ్యర్థంబు లగును

## కొమ్మనెక్కి దాని మొదలు నఱుకుమూర్ఖుఁడు

కొమ్మ కొసకునెక్కి కూర్చుండి యొకఁడు
దాని మూఢత మొదలాన ఖండించు.
ఆ తోట యజమాని యతని వీక్షించి
తనలోన నీరీతిఁదలపోసికొనియె
ఓడొనరించెను వీఁడు, నా ప్రాణ
మునకుఁ గాదైనను తన జీవమునకె.
విను దేని హితబోధ వినుమిది తగును
బలహస్తమున బక్క బడుగులఁ బట్టి
నేలఁగూల్పంబోకు, నీమోల పొక్క
యవగింజ కైనగాని యధమ యాచకుఁడు
చక్రవర్తినిగూడ సర్వేశుకడకు
గొనిపోవు ''రేపటిదినము'' ప్రాప్తింప.
పరమోన్నతిని రేపు వాంఛింతువేని
తక్కువవారితోఁ దగదు కయ్యంబు.
సిరియు రాజ్యము నీదు చేజాఱినపుడు

అక్కసు వెలిపుచ్చ నాబిచ్చగాఁడె
అంగి కొంగును బట్టి యదలించిలాగు.
బక్కవారలను జేబలిమి నొంపకుము
సిగ్గుచేటగు వారు చెనకుదురేని.
పతితులకుం జిక్కి పడఁద్రోయఁబడుట
ముక్తుల దృష్టిలో మూర్ఖత్వమగును.
దీప్తచేతస్కు లదృష్టజీవనులు
అను గొప్పవారు రాజ్యంబు గైకొనిరి
విజ్ఞానబలమున, విమలవర్తనుల
సత్యమార్గము నీకు సరియైన దగును,
అనుసరింపుము దాని నటునిటు చనకు
ఎపుడు సత్యముగోర నెంచెదవేని
సాదిమాటలు విను, సత్యంబులవియు.

## సంతృప్తి

క్ష్మాపాలకత్వంబు కంటె మేలైన
పదవి లేదని నీవు పలుకంగ, బోకు,
ఏలన, దరిచేసి తృప్తి రాజ్యంబు
నానికన్న సురక్షితంబు, తిరంబు.
బరువు తక్కువమోయు పథికులు వడిగ
నడచిపోదురు, పావనస్వాంతులిట్టి
సత్యసూక్తిని విని సంతసించెదరు.

రొట్టెచింతనె పొందు వట్టి రిక్తుండు,
రాజ్యమంతటి చింత రాజునకుండు,
రాత్రిపూటకు రొట్టె ప్రాప్తించునేని
నిదురించు భిక్షుకుం డెదచేయివైచి
శ్యామదేశము నేలు సమ్రాట్టు పగిది.
సమయును దుఃఖంబు సౌఖ్యంబు తుదకు,
మృతుఁడైన వేళ ఈ రెండును వెడలు.
తలకిరీటము దాల్చు ధాత్రీశుఁడైన,
పన్నుల నర్పించు బడుగు రైతైన,
ఉన్నతిచే శనియున్న చోటున్న,
నిరుపేదతనమున చెఱసాలనున్న
మృత్యుదేవత వారలిద్దర గదిసి
పాశబద్ధుల జేయఁ బైకొన్న యపుడు
ఎవఁడు రాజో మఱి యెవఁడు రిక్తుండో
అని వారి గుర్తింప మనకు సాధ్యంబె?

## పునుక సంభాషణము

దిజ్లా తరంగిణీ తీరంబు నందు
పుణ్యాత్ముఁగని యొక పుఱ్ఱె యిట్లనియె
ననివింటె రాజ్యశాసన వైభవంబు
దనరెనాకును, దలదాల్చితి మున్ను
సమ్రాట్టు మకుటంబు, సాయంబునల్పె

కాల, మదృష్టము కలసియేవచ్చె.
పట్టితి ఈరాకు బాహు విక్రాంతి,
మతినాసగొంటి కిర్మ్మాను సాధింప,
కాని హఠాత్తుగా గడువుదాకొనియె,
కిర్మ్మాను తుదకు భక్షించె నాతలను.
బయటికిం దీయు మవజ్ఞ తూలంబు
మతి వీనులందుండి, మృతులైన వారి
నీతివాక్యంబులు నీచెవిం బడగ.

## సత్కార్య ఫలము

సత్కార్య నిరతుండు సలుపు కార్యముల
దుష్టఫలంబులు సోదర వెన్నడును.
మంచినిగోరి యేమానవుండైన
చెడు కార్యముల నభ్యసింపఁ బూనండు.
కీడొనర్చెడువాని పాడు చిత్తమున
చెడ్డతలంపులే చెలరేగుచుండు,
నాత్మీయ వసతికి నరుడుగావచ్చు
వృచ్చికంబునకట్టు; లితరోపకార
భావము నీస్వభావమున లేకున్న
వజ్రంబు శిల యొక్క పాటిదే యగును.
తలఁపక వల్కితిఁ దప్పునోమిత్ర,
ఇనుమిత్తడిని జాయి దనరు లాభంబు,

వానికంటెను తాయి వరమనవచ్చు.
మనుజ జన్మంబు నెత్తిన యొక్కొకండు
పశువుకంటెను గొప్పవాఁడనరాదు,
క్రూరజంతువె మేలు కుటిలాత్మకంటె.
పశువుకంటెను జ్ఞానవంతు డుత్తముఁడు,
కాని క్రూరమృగంబు కైవడి ప్రజల
పైఁబడి భక్షించు వా డట్టిఁడగునె?
తిని పొట్టనింపుట, కనుగూర్కుచుంట
తప్ప వేఱొక్కటి తలఁపనివాఁడు
ప్రవరుఁడెట్లగుఁ జతుష్పాత్తులకంటె?
దురదృష్టవశమున సరిదారి దప్పి
భ్రమయుచున్నట్టి గుడ్డిపురాతుకంటె
కాల్నడ ముందేగెఁ కడకర్వగుండు.
సౌజన్య ధాన్యంబు చల్లినవారు
కోరిక పంటచేకొనని వారరుదు.
చెడ్డవానికి మంచి చేఁజిక్కెననుచు
మన జీవితమునందు వినమెన్నఁడైన.

## బావిలో పడిన జనకంటకుఁడు

ఎవ్వనిభీతిచే మృగరాజుకూడ
అఁడుసింగంబట్లు లడలునోయట్టి
దుష్టస్వభావుండు దోర్దండబలుఁడు

బావిలో నొకనాఁడు పడియందు జిక్కె
చెడుతలంపులవాఁడు చెడ్డనేగాంచు.
బావిలోఁబడివాఁడు భావించుకొనియె
తనకన్న దుర్బలతను డు లేడంచు.
ఆర్పు లేడ్పులతోడ నా రేయి నొక్క
క్షణమైన నిద్దురగని యెఱుంగఁడు.
ప్రజలలో నొక్కఁడు వాని యాందలను
జాతినిరుష్వో యీరీతి వచించె
ఆర్తుల మొఱలెప్డు డాలకించితివి
ఈనాడు నిన్నోన్ము హింతునిగోరెదవు?
చల్లినాఁడ వమానుషత్వబీజములు
పంటయెట్టిదినీకు ప్రాప్తించె జూడు!
నీచేతి కసిగాట్లు నెగులుఁతో జనుల
యెడఁదలల్లాడుచు నెలుగెత్తియార్వ
నీ గుండెగంటి మాన్పింప నెవ్వండు
పచ్చి పెళా స్తిరి పట్టించువాఁడు?
దారిలో బావిని త్రవ్వించినావు
మేమందు బడుటకు, మామాఱునీవె
అవసరంబుగ దానియందుఁగూలితివి.
అలబరిమూ కకు నర్థవంతులకు
ఉపయుక్తమగునట్టు లూటబావులను
త్రవ్వింతు రిద్దరు, నవ్వానిలోన

నొకడు సజ్జనుఁడు వేఱొకఁడు దుష్కీర్తి
ఒరులదప్పిన దీర్పనొకడు త్రివ్వించు,
ప్రజలందుబడి మెడబంటి కూర్కొనఁగ
త్రివ్వించు వేఱొక్క దగ్ధచిత్తుండు.
చెడుగొనరించి మంచికినాసపడకు,
తాంబూలవల్లి యత్నమునఁబెంచినను
అంగూరు ఫలముల నది యెట్లుకాయు?
యవలను శరదృతువందు మున్వి త్తి
పంటకారున నెల్లు పడయు గోదుమలు?
'నరకవృక్ష'మును ప్రాణపదంబుగాఁగ
పెంచిన నెవ్వఁడుంగాంచఁడు ఫలము.
ఖర్ జహార్ శాఖల ఖర్జూర ఫలము
లెటులుద్భవించు? నీవేమి వి త్తనము
మొలవేసితివో దాని ఫలమెయూహించు.

## హజ్జాజుయుసఫును ధిక్కరించిన సజ్జనుఁడు

హజ్జాజుయూసపునొద్ద మర్యాద
చూపని సత్పురుషునిగూర్చి ప్రజలు
కథచెప్పుకొనిరి ముష్కరుఁడుహజ్జాజు
చుఱచుఱ చూడ్కులజూచి, సైన్యాధి
కారికి నిట్టులాజ్ఞాపించె "నోయి"

చర్మంబుపఱచి కొంచక వానినెత్రు
తీయుఁడు పొండని,'' దీనకంటుఁడు
నిర్బంధశాలికే నెపము లేకున్న
ద్వేషంబువహియించి పెడమోము పెట్టె.
దైవభక్తుఁడునవ్వె తక్షణమేచ్చె
ఆశిలాహృదయుండు నంథబావుంషు
అప్పుడే హాసంబు నపుడె దుఃఖంబు
గాంచి యచ్చెరువంది 'కారణంబేమి'
హాసియించుటకు మఱియార్తిచెందుటకు
నని ప్రశ్నచేసె, పుణ్యాత్ముఁడిట్లనియె
పరమపావనుఁడైన పరమేశుకృపను
పరబాధకగ్గమై మరణింతుగాని
దుష్కంటకుండనై దుమ్ముగానంచు
నవ్వితినేను నానందంబువలన.
కాలదుర్గతికి దుఃఖమునొందినాఁడ,
నలుగురు బిడ్డలు నాకు నున్నారు,
ఆనాదరువులేని యర్భకుల్ వారు,
ఆమాటలాలించినంత యొక్కండు
అధిపుతోనని పేరందిన జేఁడ,
సహియింపు మావృద్ధు సజ్జనోత్తముని
ప్రాణహింసనొనర్ప నాజ్ఞవెట్టకుము
ఆధారపడువార లతని పైప్రజలు.

అట్టి దాతను జంపి యందఱ జనుల
కొక్క-పెట్టున నెగ్గు నొనరింపఁదగదు.
క్షమ గొప్పతన మనుకంప వహించు;
అతని నిసుంగుల గతులు దలంచు.
ఇచ్ఛగించెదవేని యితర కుటుంబ
ముల పైని దౌష్ట్యంబు, తెలియుమ నీవె
పరిపంథి వగుదువు స్వకుటుంబమునకె
నీ ప్రభుత్వము పెట్టు నిర్బంధములకు
పగిలిన గుండెల నెగులు దార్కొ-నఁగ,
దలఁపకు 'రేపు' నీకలరు మేలంచు,
నిర్బద్ధుఁడు నిశీథి నిద్రింపలేదు,
వాని నిట్టూర్పులకైన భీతిలుము
వేగు ప్రొద్దులవాఁడు వెడలించు దీర్ఘ
నిశ్వాస ధూమంబు నిన్ను దహించు.
పావనాత్ముఁడు రాత్రి "పరమేశ కావు"
మని యూర్చు హృత్తాపమునకు భీతిలవె?
అన విని నృపుఁడు కోపావేశమెసఁగ
విసుగుచుఁ దనచేయి విసరె, నాపైని
బద్ధమయ్యెను హేతువాద మార్గంబు.
నై తాను చెడ్డలే సలిపెనుగాదె
అతఁడేమి మంచి సమార్జించినాఁడు?
చెడువిత్తునాట మంచి ఫలంబు గనము.

పోరాటమున నెట్టి పురుషుని సిగ్గు
తెరను చింపకు, నీకు దెరవెన్క దాచ
వలసిన సిగ్గేడి వర్తనలుండు.
బాలుర ముష్టితోఁబడ మొత్తలేవు
సింహంబలుల పైకెఁ జెలరేఁగనేల?
ఆమిత్రుహితబోధ నాదరింపకయె
బడుగువృద్ధుని జంపఁ బనిచెహుజాజు.
దైవనిర్దేశంబు దాటశక్యంబె!
తలలోన నీతలంపులు సందడింప
నిదురించె రాత్రి నా నీతికోవిదుఁడు.
హంతుఁడైన దరిఁజేసి యాతనికలను
కనుపించి యిట్లనె క్షణమె బాధించె
వాని దండన నన్ను వాఁడు సతంబు
అనుభవించును బాధ లానాఁటి నఱకు.

## కుమారునకు తండ్రి హితబోధ

పుత్రున కిటు నీతిబోధించె నొకఁడు
ప్రాజ్ఞుల హితబోధ పాటింపు మెపుడు,
ఓయికుమార, నీవొక నాఁడుగాని
యలబరిమాఁకపై బలిమి చూపకుము.
ఏలన, బల్లిమండెపుడో నిన్ బట్టి
బాధించు సమయంబు వచ్చిన వచ్చు.

చిఱుత నిన్నొకనాఁడు చీలుచునంచు
భయమునొందవె ముద్దుబాయి కుట్టుండ?
చిన్ననాఁటను నాపు చేబలంబుండె,
బీదలు నావల్ల పీడితులైరి.
కాని నేనొకనాఁడు కడుబలశాలి
పిడికిటి సమ్మెట వ్రేటులందింటి.
ఆనాఁడు మొదలు నేనీనాఁటివఱకు
బక్కవారల నొంప బలవంతపెట్టి.

## నాయకుని నిర్నిద్రత

హెచ్చరించెద. నోడ లెఱుగని నిద్ర
తగదు, నిషిద్ధంబు తెగ నాయకునకు.
శక్తిహీనులఁ జింతసలుపు, జాగ్రత్త,
కాల దౌర్జన్యంబు గడవరెవ్వరును.
స్వార్థాంకితము గాని సర్వోధమంగు
మాదిరి చేవయ్యు మాన్పరోగమును.

## నారికురుపుతో బాధపడు సుల్తాను

నారికురుపువ్యాధి నవసితేఁడొకఁడు
కదురంత సన్నమై కనుపించెననుచు
కథ చెప్పుదురు, తేనికాయ దుర్బలత
యెంత హెచ్చినపన, నేనరాధముని

దృఢదేహమును గన్న నీర్ష్య వహించు.
చదరంగ పలకపై షాహి గొప్పయ్యు
బంటునకుఁ గొంగు బలము లేకున్న
అంత సచివుఁడు భూకాంతుని మ్రోల
వసుధ ముద్దిడుచు, దేవరవారి జీవి
తము శాశ్వతంబుగ దనరారుగాత!
ఈ పట్టణంబున గోపురంబుండు
దైవప్రియుండైన దరిబేసి యొకఁడు,
పుణ్యవంతుల నట్టి పుణ్యాత్ము డరిది,
ఆతనికడఁ దనయాస లర్థించి
భగ్నాశ మఱలిన వాఁడు లేడెవఁడు.
ఆభక్తుఁ బిలుపించు, మభ్రమ్మునుండి
భూమికి గారుణ్యపూరంబు దొరఁగ
ప్రార్థించు దేవుని వ్యాధి శమింప,
నని యిటువల్కిన, నాలించి నృపతి
ఆస్థాన సేవకులందు మొగుదారిఁ
బంపించె నాశుభపాదు రప్పింప.
వచ్చినయంత నాభక్తునిగాంచి,
సూత్రబద్ధంబైన సూదివిధాన
అడుగు తెమల్ప లేకార్తి చెందెదను
నారి కురుపువల్ల, నావ్యాధికుమర
ప్రాజ్ఞుఁడా, మనసిచ్చి ప్రార్థింపుమంచు

నధిపుండు పల్కిన, నాగూని వృద్ధుఁ
డాలించి యుగ్రుఁడై యఱచి యిట్లనియె,
దైవంబు న్యాయవర్తులఁ బ్రేమించు.
బీదల గరుణించి పిసప సర్వేశు
కరుణ నిరీక్షింప గలుగు శ్రేయంబు.
నీ బలాత్కృతి జిక్కి నిత్యమ్ము ప్రజలు
బండకొయ్యను గొయ్యిఁ బడియుమ్మలింప
నేను ప్రార్థించిన నీకేమి ఫలము?
ఎపుడైన జనులపైఁ గృపఁజూపి యెఱుఁగ
వెటునీకుఁ బ్రాభవంబిచ్చు సౌఖ్యమును?
మున్ను నీతప్పులు మన్నింపవేడు,
అటుపైని పుణ్యాత్మ ప్రార్థింపగోరు.
అనిశంబు దౌర్జన్యమునకు పాల్పడ్డ
జనుల ప్రార్థనము నీవెనువెంటనంట
అతఁడు వేడిన, నీకు నది సాయపడునె?
ఆపారసి నరేశుఁడా మాటలకును
కోపించి, లజ్జించి, కుందుచుఁ బిదప
తనలోన నిట్లని తలపోసికొనియె
మఱిపిల్లనేల? యూవరి శేసి చెప్పె
నట్టిమాటలు న్యాయమని నాకుఁదోఁచు.
ఆపైని చెఱసాలయందుఁ గృశించు
బద్ధుల నందఱ వదలుండటంచు

ఆజ్ఞ వెలె నృపాలుఁ, డనుభవజ్ఞుండు
దరిజేసి వీఁపును నిరుమాఱువంచి
ప్రీతి హస్తంబుల పరమేశు దెసకు
పైకెత్తి యిట్లనిప్రార్థించె నంబ
రమున కున్నతిగూర్చి రాజిల్లు దేవ,
పట్టుకొంటివి వాని పాపంబు కతన;
అనుతాపముంగూరె, నతని రక్షించు.
భక్తుఁడంజలిపుటి పట్టియుండఁగ నె
గం తేసి నిలుచుండెఁ గాళ్ళపైగోగి.
పదబంధమూడిన బర్హి చందమున
ఎగురు నాతఁడు హర్ష మెద సందడింప
ననినీవు చెప్పిన నత్యుక్తిగాదె.
తన బొక్కసమున నిండిన మౌక్తికములు
వజ్రంబులను భక్తపదముల ముందు
తలపైని వెదచల్లవలయు నటంచు
ఆజ్ఞ వెట్టె నృపాలుఁ "డ యదార్థతకును
సత్యంబు దాచుట సరిగాద" టంచు.
చొక్కాయి కొంగులోఁ జిక్కినమణుల
వెదచల్లి దరిజేసి మొదదాక బలికె.
నారికురుపు వెండినన లెత్తకుండు
నటు గోరు దేని నీవనదలపైని
దౌర్జన్యముం జూపఁ దగదిఁకమీఁద,

ఒకతూరిపడిన వేఱొకతూరి యడుగు
సరిమెట్టుమరల కాల్జాఱనియట్లు.
సాది చెప్పినవిను, సత్యమీమాట
"పతితుండు ప్రతితేప పైకిలేవండు."

## రాజ్యసంపదల చంచలత్వము

ఎఱుఁగుమోయికుమార, యిహమందురాజ్య
సంపదలెపుడు శాశ్వతములుగావు,
అవని విశ్వాసంబు నాశింపలేవు.
ప్రొద్దుటింతల సందె ప్రొద్దులగాలి
మలఁగదేమును సులేమానుని గద్దె?
కడకదిగాలిలోఁ గలయుట వినవె?

న్యాయంబు జ్ఞానంబు నార్జించివెడలు
వాఁడెసంతుష్టుఁ డవ్యర్థజీవితుఁడు.
ప్రజకుసౌఖ్యము గూర్పఁబని సేయువాఁడు
ఇందఱిలోన నదృష్ట కందుకము
బలిమి మైగైకొను, పరలోకమునకు
దనవెంటగొనునవే పనికి లాభించు,
కాని చుట్టనుజేర్చి కాచి యావెనుక
విడుచు సొత్తులవల్ల దొడరునే ఫలము?

# మిసరుదేశపురాజు మరణము

మిసరు దేశమున నమీరుని పైక
మృత్యుదేవత తన మేటిసైనికుల
బనిచె నాతని ప్రాణమును ముట్టడింప
హృదయ మోహనమైన తేనిచెక్కుళ్లు
సందెపసుపురంగు నొందినతరణి
పోల్కి సౌందర్యంబు వోనాడియుండె.
వైద్యశాస్త్రంబెల్లఁ బనివడివెదకి
మరణంబునకు నేమి మందులేదనుచు
కోవిదులార్తితో కొఱికిరివ్రేలు.
అన్ని దేశంబులు హారిపీరములును
ప్రక్షీణమగు, దైవ రాజ్యంబుతప్పు,
జీవిత దివసంబు చీఁకటిరాత్రి
యగువేళ డగ్గఱ, నాధరాధిపుఁడు
గొణుగుచుమాటాడు కొనుచుండవినిరి·
మిసరున నావంటి మేదినీశ్వరుఁడు
ఇంతకుఁబూర్వంబు నెవ్వండు లేఁడు,
అంత్యమిట్టిదియైన అంతయుఁ వృధయె!
ఇలను గడించితి, ఫలమునే నెఱుఁగ,
నిస్సహాయులపోల్కి నెలవు వీడెదను.
తోఁదిని పేదలఁ దనిపెడువాఁడు

సద్భావుఁడనఁజెల్లు, సకలసంపదలు
తనయిచ్చలీడేర్చుకొన సంతరించు.
దానధర్మము సేయఁబూను, మయ్యదియె
నీయొద్దఁదిరముగా నిల్చుభాగ్యంబు,
వెనుక నిల్చినదెల్ల వెఱపుదుఃఖంబె.
మరణశయ్య బరున్న మానసీయుండు
ఒకచేయిచాఁచు వేఱొకటి కుంచించు.
ఆతఁడత్తఱినీకుఁ జేతితోఁజూపు
మరణభీతిని నాల్క బద్ధమైయుంట,
ఔదార్యముంజూపు మనుసంజ్ఞదోఁప
నొకచేయిచాఁపె, వేఱొకటి కుంచించె
దౌర్జన్యమత్యాశ తగ్గించుమనుచు.
శక్తియున్నయిపుడె జనులకంటకము
పెరుఁవేయుము, శవపేటికనీదు
చేయిచిక్కనవెన్క చేయునదేమి?
రవిసుధాకరులు తారకలు చిరంబు
భాసిల్లుచుండు నంబరవీధి, నైనఁ
దలనిక్కఁబెట్టనీ తరమె గోరీని?

## అర్సలాన్నరపతి దుర్గగర్వము

ఖజలర్సలానునకు గట్టెదుర్గంబు
గల, దది యల్వాందుమలకీముకోడు

పరరాజుముట్టడి భయములేదందు,
కోరినసరకుకే కొఱఁత లేకుండు.
పెండ్లికూఁతురినొస్ట వ్రేలుముంగురులు
వలె గోటమార్గంబు మెలికలు దిరుగు,
నీలపుందబుకలో నిలిపెనగ్రుడ్డు
చందాన నది మనోజ్ఞముగఁ జూపట్టె
నుద్యానవనమున, నొకనాఁడు నృపుని
సన్నిధికే తెంచె సంతుష్టముఖుఁడు
అతిదూర యాత్రికుఁడన వినియుంటి.
అతఁడు సత్యాసత్య మరసినవాఁడు,
అనుభవజ్ఞుఁడు, నిపుణాత్ముండు, లోక
సంచారి, సుల్తాను సల్లాపగోష్ఠి
నతని బ్రశ్నించె మీరితరదేశముల
తిరిగి చూచితిరింత మురువైనకోట
నెందేనిగంటిరే యెఱిఁగింపుఁడనిన,
ఆమహాత్ముడు నవ్వి యనియె, నోరాజ,
యింపైనదేగాని దృఢమైనదంచు
నేఁవలంపనుకోట; నీకంటెమున్ను
ఎందఱుద్ధతులకో యిదిసొంతమయ్యె,
పదిక్షణంబులపాటు వసియించివార
లేఁగిరి, నీవెన్క నెందఱో నృపులు
వచ్చి నీకోరిక పంట భుజింత్రు.

పితృరాజ్యకాలంబు స్మృతినుంచుకొనము,
వెఱపు బంధమునుండి వెడలించుమెడఁద.
ఆతఁడుగోరికి నడు దెంచువేళఁ
చేతనుండెనె యొక్క చిల్లిగవ్వైన?
సర్వంబు నిష్ప్రయోజన మ్మైనతఱిని
దైవకారుణ్యంబు తలఁచెను, చాలు!
గడ్డిపోచగఁజూచు జ్ఞానిలోకమును,
ఏలన ప్రతిక్షణంబెవఁడో వేఱొకని
కది నెలవయ్యెండు ననుకారణమున.

## నౌషీరవానుతో వెట్టివాని ప్రసంగము

పారసీకమున నౌషీరవానితోడ
వెట్టివాఁడొక్కఁడీవిధమునఁబల్కెఁ
జంషీదు విస్తార సామ్రాజ్యమునకు
వారసువైనట్టి యోధారుణీశ,
జంషీదునృపతిదౌ సకలరాజ్యంబు
ఎటునీకుఁబ్రాప్తించె? యిలలోననీకు
ఖారునుపెన్నిధి కరగతంబయ్యె
నిలువదు, దానమే నీతోడవచ్చు.

# తండ్రిమరణము

## కుమారుని పట్టాభిషేకము

ప్రాణ ప్రదాతయా పరమేశ్వరునకు
అలపర్సలాన్ తన యసువు లర్పింప,
తయుండు ధరియించెఁ దలకిరీటంబు,
రాచగద్దియనుండి రాజు సమాధి
కంపిరి కూర్చుండునంత జోకైన
గుఱినభ్యసించు మందిరమైన లేదు!
రాజపుత్రుం డొక్క రోజు గుఱ్ఱంబు
స్వారిచేయుట గాంచి పలికెనీరీతి
బయటి కున్మత్తుని వలెనున్న యొకఁడు.
కాల వైషమ్యంబు గన నక్కజంబు!
జనకుండు చనినంతఁ దనయుని పాద
మంకవన్నియకెక్కె, ఆ కాల చక్ర
సంభ్రమణంబిట్లు సాగుచునుండు!
నమ్మరానిది. గమనంబు సత్వరము,
స్థిరముగా నుండదు దీనివర్తనము
ముదుకని కాలంబు తుది దాకుచుండ
ఉయ్యాల తొట్టిలోనుండి యదృష్ట
వంతుఁడౌ నొక పసిబాలుండు వెడలు.
ప్రతిదినంబును వేఱు వసతికి నేఁగు

గాయకునట్లు పరాయిదియైన
యైహిక ప్రాభవ మందునీమనసు
బద్ధంబుసేయకు; ప్రతిప్రొద్దుటింత
వేఱుభర్తనుగోరు వెలఁదితోసుఖము
ననుభవించుట నీకు నర్హంబుగాదు.
వీడునీదైన యీయేడె యాప్రజకు
మేలుసేయుట యొప్పు; మఱు వత్సరమున
ఆపట్నమింకొక్క యజమానిదగును.

## బలాత్కార పాలనము నిందలపాలు

ఘోరెడారికిఁ బొలిమేర గ్రామమున
మాటసాగిన పెద్దమనిషి దుర్జనుఁడు
పరులగాడిదలను బలిమిమై, బట్టి
తనపనిచేయించు కొనుచుండువాఁడు.
బరువుభారము మోసి పచ్చికలేక
డెసమాలిమూన్నాళ్లఁ దీఱుజంతువులు.
భాగ్యవశంబున బరమనీచుండు
ధనవంతుడైన బీదలయెడందలను
దుఃఖభారము మోపు దుశ్చేష్టితముల.
ఆగర్వికున్నంత హార్మ్యమ్ముండినను
మలమూత్ర కశ్మలములుపైనినుండి
క్రింది గేహములపైఁ జిందంగవిడుచు.

అన్యాయకారి ధరాధిపుఁడొకఁడు
వేటకై వెలువడె వీడనివింటి;
ఆతఁడుమృగము వెన్నంటివేటపల
నెడఁబాసెఁ; జీఁకటి పడియెదట్టముగ.
ఏదారిడొంకైన నెవరిమోమైన
నెఱుఁగ, డొంటరియయ్యె నీరేయి దాను;
ఏమిచేయఁదోఁప కిటునటు నూఁచి
పల్లెదారినిబడి ప్రభువుపోసాగె.
గాడిదయొక్కటి కాలుతేలికది,
పనిపాటులనోర్చు బటువైనమేను,
బలముశక్తియుగల్గి బరువాఁగఁగలది,
ప్రభువుకంటంబడెఁ బరిసరంబులను.
ఖుర్దువొక్కఁడు చేత గూటంబువంటి
యెమ్ముదాలిచి గార్దభమ్మునుమోదె,
ముక్కలై దానియెమ్ములు పట్టుదప్పె.
జనపతియాసేఁతఁ గనికుందికసిలి,
ఓయువకుండ, నీయుదుటు బలంబు
ఈమూఁగజీవంబునెడ మేరమీఱె,
బలమున్నయంతనే ప్రకటింప దగదు,
పేదలపై నిరూపింపకు బలము
అనిపాహింపలక్క నాయధమస్వభావు
నకు నింపితముగాక వికటనాదంబు

గావించి పాదుషా గని కోప్పరించె
"పనికివచ్చెడు గార్ధభంబు నేనంత
వృద్ధుండనై పడ బాద లేదోయి.
నీపని యెఱుఁగవు, నీదారిఁ బొమ్ము
యెందగో నీమది కెక్కనివారిఁ
బరికించి కనుదేని వారివర్తనము
ఔచితికిఁ దూరమయ్యుండ,బోదు."
అతని ప్రత్యుత్తర మధిపతికిష్ట
పడకుంట నెదఁగష్టపడుచు నిట్లనియె·
రమ్మచూతము, దాని యెమ్మెలు విఱుగఁ
జిమముట నేమి యౌచిత్యంబు గలదో!
తెలివితక్కువ నీకుఁ, దలఁతు నేనట్లు,
త్రాగియుండవుగాని, తలకెక్కె వెఱ్ఱి.
ఈ మాటలకు నవ్వి యిట్లనె నతఁడు,
ఓయి తుర్క సిపాయి, ఓయి యజ్ఞాని,
'యూరక వాగకు నోరున్నదనుచు.
ఎప్పుడైనఁ జెవిఁబడదేమొ యాఖిజిరు
వృత్తాంత మొకవేళ వినియుందువేమొ.
వానికి పిచ్చెత్తె, వాడు మత్తుండు
అని మున్నెవండేని యని యుండలేదు,
అయిన దోర్బల హీనులైన నావికుల
పడవల నతఁడేల పగులగొట్టించె?

యనవిని పాముపా యతని కిట్లనియె
ఖిజరట్లు చేసిన కీటుకు నీ కేమి
తెలియు దురాత్మ, యా జలనిధి యందు
జనభయంకరుఁ డుండె శక్తిమంతుండు;
వాని మూలమున నా ప్రజల బెందములు
దుఃఖసాగరమునఁ ద్రుళ్లింతలాడె,
ద్వీపవాసులు వాని వివిధ చేష్టలకు
గొంతు బొంగురువోవ కూయిడువారు.
లోకంబు వాని చేఢాకకు కాగిలి
కడలి యట్టుల క్షోభ పడుచుండె మిగుల.
అట్లౌట, పడవలు ఆదుష్ట బలువి
చేజిక్క కుంటకుఁ జెక్కలుచేసె
ఖిజరు న్యాయముగ, ఆకీలక మెఱుఁగు.
పడవ శత్రువుచేతఁ బడుదానికంటె
పగిలి నీ పెరటిలోఁ బడియుంట మేలు
పల్లీఁడు కడుపుబ్బ పడిపడి నవ్వె.
అట్లైన నాత్మకై న్యాయంబుగలదు
కరమజ్ఞతను నేను గాడిదకాలు
విఱుగఁ గొట్టనుగాని ధరణీశు చేతి
దౌర్జన్య మూహించి తగవుచేసితిని.
రాజు దగ్గఱను భారము మోయుకంటె
కాలు కుంటుచు కల్లు కట్టించుకొనుచు

యిచ్చోట ఖరముంట యెంతయో మేలు.
పలుకకు మాత డు పడవలేపట్టె
నని, దుర్యశముగూడ నార్జించినాడు
అటువంటి నరపతి యతని రాజ్యంబు
శస్త్రమౌగాక! దుశ్చరిత దుష్కీర్తి
పుడమిపై నిలుచుత కడరోజువఱకు!
దుర్జనుండొనరించు దుష్కార్యమెల్ల
తనపయినొనరించు కొనినదైయగును,
బలహీనులైనబీదల పైనిగాదు,
ఏలన, కీర్తికి నెల్లలజ్జలకు
నెలవైన సభలోన నిల్చిననాఁడు
అతఁడుగాంచిన యాదుర్బలుండు
మెడపట్ట గడ్డంబు నొడిసి జాడించు,
తనకష్టభారమాతని నెత్తికెత్తు,
సిగ్గుచిమిడివాఁడు శిరమెత్తలేఁడు.
అంగీకరింతునే నాగార్దభంబు
వానిభారము నేఁడు భరియించునంచు,
కడదినంబున నెట్లు గాడిదబరువు
వాఁడు మోయగలండు బలవంతుఁడయ్యు?
న్యాయమదుగుదేని, నామాటవినుము,
జనులదుఃఖముపైని తనదుసంతోష
మాధారపడియున్న యతఁడునిక్కముగ

దురదృష్టవంతుఁడు, పరికింపవాని
సంతసంబీఁగు సంవత్సరములె!
ఎవనిమూలంబున ఈప్రజాగణము
హృదయవేదనతోడ నిదురపోయెడినొ
అటువంటి మృతచిత్తుఁ డెటులైనఁగాని
మేల్కానకుండుట మేలు లోకులకు,
అని యిట్లుతనమతి వినిశ్చించెనతఁడు
పాదుషాయిదియంత పదరక వినియె,
పల్లెత్తుమాటైనఁ బలుకఁడాయెద.
చెట్టుకుగుఱ్ఱంబు కట్టితక్షణమె
జీని నందాపట్ట శిరమటు మోపి
శయనించెగాని నిశావేళయంత
మెలఁకువనుండి తారల లెక్కపెట్టు.
భయము మతిభ్రమ భావంబుకలఁచ
నిదురపట్టకయుండె, నింకువేకువను
కొక్కొరోయని కోడి కూఁతవిన్నంత
రాతిరి బడిన యాశ్రమమెల్ల మఱచె.
రేయెల్లవెదకిరి తేనినాశ్వికులు
పోబడిసుంతేని పొడకట్టకుండె
తెల్లవాఱెడువేళ తేజఖురాంక
ములుగోచరింప జాడలు పట్టిచనిరి
బయలులో షాహియు హయము కాన్పించె,

ఆశ్వికల్ పరిజన మంతయేకముకగ
పరుగులెత్తిరి భూమిపతియున్న దెసకు.
నేలపైఁదలలాంచి నెఱపిరి వినతి,
భటవీచికల బైలు వార్థియట్లుండె.
సచివులు మంత్రులాస్థానిక జనులు
పళ్లెంబుగోరిరి, పానంబుగొనిరి,
యువల వినోదించి రానందమెసఁగ.
పానమత్తతకొంత ప్రశమించినంత
నృపతిజ్ఞప్తికి వచ్చె నిన్నటిరోజు
తనతోడవాదించి చనినపల్లీఁడు.
ఆజ్ఞ పెట్టెను వాని హాజరుపెట్ట,
పల్లెల్లగాలించి పల్లీయుదెచ్చి
కాలుసేతులుకట్టి క్ష్మాపునిపాద
తలమునఁ ద్రోసిరి తగుశిక్షగొనగ.
వధకుండు మెఱసెడి వాదఱకత్తి
కై బూని యాజ్ఞకై కనిపెట్టియుఁడె,
తప్పించుకొనిపోవ దారి చూపడక
పాపమాపల్లీడు భావించె బ్రదిమి-
గడసారి కిఁగాఱుదే గాబోలునంచు,
మనసువచ్చినటెల్ల మాటాడెనతడు
కనవాకో ఖడ్గంబు గళముపైనుండ
కలమునాలుక శీఘ్రగతిచెంగలింప?

తన శత్రువులనుండి తప్పించుకొనుట
దుస్సాధ్యమనిలోనఁ దోచినయపుడు
దొనమండి నిర్భయంబునఁ దూఁపులాగి
ఆసచచ్చినవాని యవశత్వమంది
తలయెత్తి పల్లీఁడు పలికెనీరీతి
గోరికేగెడురాత్రి నూరనిద్రింప
వలనుగాదేరికి, కలకలమెత్తె
జనులలో నీరాజ్యమున దయలేమి
నేనొక్కఁడనెగాదు నీదుర్జనత్వ
మునుదూఱుచుంట, యీజనము సర్వంబు
నినుశపించెద, రొక్కనిని నన్నుచంప
నీకేమిలాభంబు? నేవింతపడెద
నాయుధార్థోక్తి నీయెద గాయపఱచె
నని, చంపునన్ను నీకానందమేని,
ననుజంప ప్రజలందఱును జంపపలదె?
నాదూషణమునీకు చేదయ్యెనేని
నిందనిర్మూలించు నీన్యాయబుద్ధి
దుర్జనత్వమునుండి తొలగుటేమందు,
కాని నిర్దోషుల ఖండింపఁగాదు,
యన్యాయమొనరించి యాసింపఁబోకు
మంచికినీపేరు నెంచెదరంచు,
నీవేళ్లుహాయిగా నిద్రపోయెదవా

నీచేత బాధలు నిత్యమ్ముఁగుడుచు
ప్రజలు నిద్దుర లేక పలవించుచుండ;
రాజునిజంబుగా ప్రస్తుతిగను నె
ప్రజలు దర్బారులోఁ బలుకు సన్నుతుల?
రాజసభాగోష్ఠి ప్రవచించునుతుల
వలన నేలాభంబు గలుగునో సాహి,
రాటంబుత్రిప్పుచు ప్రజలునిఁక దూఱ?
వానిమాటలు రాజు వీనులంబడగ
అశ్రద్ధమైకంబు హరియించె; నంత
సాహికదృష్టంబు సంప్రాప్తమైన
ఆయూరు పల్లెని కర్పించెఁబ్రీతి.
తెలివియు నడవడి తెలిసికోనీవు
పరమపావనులైన ప్రాజ్ఞులయొద్ద.
అంతకన్నను కొంత యాదాయమౌను
నెరసు లేరెడివాని దుడుసువిమర్శ.
మిత్రులకంటెను శత్రువే చెప్ప
వలయునీగుణములు; చెలికాండ్రదృష్టి
నీవొనర్చినదెల్ల నింపుగానుండు.
మొగమిచ్చకంబుగఁ బొగడెడువాఁడు
పరమమిత్రుఁడుగాఁడు పగతుండుగాని,
ఉన్నతప్పులను మోమోడక తెల్పు
నిర్భయహృదయుండె నీకు స్నేహితుఁడు

మధురస్వభావులౌ మాన్యులకన్న
దుర్భావుఁడే మేలు దోషవిమర్శ
ఇంతకంటెను మంచి హితవు నీకెవఁడు
చూపడు, తెలివున్న సూచనచాలు.

## మామూను కృతజ్ఞత

మామూను మున్ను సామ్రాజ్యపీఠంబు
నాక్రమించినయంత, నతిసుందరాంగి
చంద్రాస్యనొకతొత్తు సంతలో విలిచె.
ముఖకాంతి రవిబింబమున కీఁడుజోడు,
పోలుగులాబి పూఁబోదను దేహంబు;
తెలివి తేటల పండితులవాదుకీష్ప.
కాముకరక్తంబులో ముంచివ్రేళ్లు
గోళ్లకు పట్టించె గోరంట రంగు;
ముక్తసంగుల మది మ్రుచ్చిలంజాలు
కన్నుబొమ్మల నీలి కాఁటుకదిద్ద
నింద్ర ధనువుక్రింద నినుఁడట్టులుండె.
రాత్రిపడుకటింట రమణిమామూను
కౌఁగిటంజిక్కక గడపెఁ గాలంబు.
షాహికిఁ గోపాగ్ని జ్వలియించె లోన,
చెలిమెడ మిథునంబువలె రెండు ఖండ
ములు సేయఁగోరిన, బాలఁతి యిట్లనియె·

పాఱవేయుమువాలు, పడుకఁగూడకుము.
అనవిని రాజునిట్లులనియె, నోచెడిప,
ఎవడు నీహృదయంబు నిటుగాయపఱచె?
ఏదినాయందు నీ కిష్టంబుగాదు?
ఈ ప్రశ్నకుంగాంత యిటుమాఱుపల్కె.
ననుచంపు దండించు నఱకుమేమైన,
నీవు ముద్దిడబోవ నీనోటికంపు
భరియింపరానిదై బాధించునన్ను
గుఱికాని బాణంబు, క్రూరునివాలు
తగిలినవెంటనే యెగయుఁ బ్రాణంబు,
కాని నోటనుబుట్టు కంపట్లుగాక
దినములపేరట దినుజీవితంబు.
షాహియీప్రత్యుక్తి చక్కయోచించి
తనుదాను నిందించికొని చింతపడియె.
అప్పుడారమణిపై నాగ్రహించియును
చక్కబెట్టుకొనె నౌషధము సేవించి
వదనము పూఁగుత్తివలె తావినింప.
సుదతినాదోషంబు చూపించెగాన
ప్రాణప్రియ యటంచు భావించియామె
ప్రియురాలిగా స్వీకరించె సుల్తాను.
ముందునీదారిలో ముల్లున్నదంచు
హెచ్చరించెడువాఁడె హితుఁడనియెంతు,

సరిదారిదప్పిన తెఱువరిగాంచి
చనుమి దేఋజుమార్గమని నమ్మబల్కు
టత్యంతదౌర్జన్య మనిపించుకొనును.
ఎదుటనీతప్పుల నెఱిఁగింపుమన్న,
నజ్ఞ తదలపోతు వవిమెప్పులనుచు.
అలసఖుమోనియా యర్థ్యమైయున్న
వానితోఁజెప్పకు దేనెయుమంచి
చక్కెఱయని యెంత చక్కఁగాఁబలె
ఓషధ విక్రేతయొక్కఁడొక్కనాఁడు
ఆరోగ్యమ్మున్నబా ద నాసింతుఁజేసి
జ్ఞానముఁ జల్లెడఁ జక్కఁజల్లించి
భక్తియఁ దేనెతో పదునిచ్చినట్టి
తిక్తౌషధమును దినుటక్షేమంబు.

## సత్యవ్రతుండైన ఫకీరు పరమ దుర్మార్గుండైన పాదుషా.

సజ్జనుండౌనొక సాధువువలన,
పాదుషాహృదయంబు బహుబాధలొందె,
హేతువేమన, పాపహీనునినోట
షాకప్రియమైన సత్యంబువెడలె!
బాహుదౌర్జన్యంబు బలిమిపాచ్చావు
అంపించెనాతని న్నాస్థానినుండి
నేరుగా బంధనాగారంబుసేర.

ఆఫకీరునితోఁడ ననె రహస్యముగ
ఒక స్నేహితుండది యుచితమేనీకు
సంపతి మ్రోల నాలెఱుగునఁ బల్కె?
అనవిని యాసాధువనియె నోమిత్ర,
దైవాజ్ఞ నెఱపుటే తగుభక్తియనఁగ,
బంధనంబున కేను భయపడఁబోను,
అదియొక్క నిమిషమే యదలించునన్ను,
అని పల్కెనో లేదో యపుడె యావార్త
విభుని చెవింబడె వేగు మూలమున,
పాదుషా హాసియించిపల్కె, నాతండు
ఎంత తెలివిమాలి యిటులూహసల్పె!
ఎఱుఁగఁడేమొకో తాను చెఱసాలయందు
మరణపర్యంతంబు మురుగునటంచు,
ఆమాట వినిపోయి యచటి గులాము
సాధువునకుఁజెప్పె పాహి నిర్ణయము.
ఆపల్కులాలించి యనియె ఫకీరు
ఓయి గులాము, నీయుర్వీశ్వరునకు
తెలుపు నామాటగా తేటతెల్లముగ,
కనుమపాహి, ప్రపంచమున నొక్కక్షణమె!
దరిజేసి గొనఁడు సంతసము దుఃఖంబు,
చేయిచ్చి కాచిన చిత్తహర్షంబు,
తలద్రుంచినను చింత గలుగదు నాకు.

నీకధికారంబు నిధి సైన్యమున్న,
నే నిరాశయు దుఃఖమూని కుటుంబ
భరము లేమిడి వాకఁబడి మోయుచున్న
మన మిద్దఱము మృత్యుమందిర ద్వార
మును చొచ్చినపుడు నీవును నేను నొక్క-
సప్తాహమున సరిసముల మయ్యెదము
ఐదురోజుల సంతయౌ యిహలోక
మును నమ్మి నీదేహమును గాల్చికొనకు
పూర్వులు నీకన్న భోగభాగ్యములు
హెచ్చుగ నార్జించి యేగిరిగాదె?
వారి యన్యాయంబు వలన లోకంబు
బూది బుగ్గిగ మాడిపోయెను మున్ను.
నీవు చచ్చినవెన్క- నీగోరిపైని
ప్రజలు శాపోక్తులు వర్షింపకుండ,
మంచికి నీపేరు స్మరియించునటుల
కరుణామయుండవై గడుపు జీవితము.
చెడ్డయాచారంబు స్థిరమగునట్లు
శాసనంబు లొనర్చి చనమేలుగాదు,
ప్రజలు దూషింతురు రాజువాఁడెవడొ
యీ దురాచారంబు నిటు నిల్పెననుచు.
దౌర్జన్యవంతుడు తలయెత్తి రేగ
కడకు గోరీదుమ్ము కప్పదే వాని?

కాలదుర్గతులకై గాసిల్లి యెపుడు
ఎడఁద దుఃఖంబుతో నెంగిలిపడియె,
దేహంబుససివప్పి దినముజీర్ణించె.
భోగభాగ్యంబులఁ బొరలులోకంబు
గనియొకప్పుడు ద్వేషమును గ్రక్కుచుండు,
తనదుదృష్టంబు తలపోసి మోము
మటుమటలాడించు మతినొక్కనాఁడు,
జనులకమ్మనిసౌఖ్య సంపత్తిజూచి
చెక్కిళ్లదిగజారు చేమకన్నీళ్లు,
ఇంతకంటెను దుఃఖవంతమా బ్రతుకు
నెవఁడయినఁగాంచెనే యిలలోనయంచు
ఘోరకష్టములోర్చు కొనలేక యేడ్చు.
కొందఱుమధువాని కోడిమాంసంబు
మెక్కంగ, నారొట్టె ముక్క మొగంబు
ఆకుకూరయుఁజూడ దేకాలమైన!
తలకుమొలకులేక చలినేనుచావ
పిల్లికినిలువెల్ల వెచ్చనిబొచ్చు
అంగరకాయుండు టదిన్యాయమా నే?
కాలచక్రముదయ గల్గినొక్కసము
ప్రాప్తింపఁజేసిన బ్రతుకుకాలంబు
సంతోషముగఁబుత్తు సకలసౌఖ్యముల,
కాయకష్టపుదుమ్ము కడకుజిమ్మెదను..

ధరను వాఁడొకనాఁడు త్రవ్వుచుండంగ
అగపడెననివింటి నస్థులప్రోవు,
వానిలో గడ్డపువంక యెమ్ముండె,
పండ్లముత్యపుచాలు పరికీర్ణమయ్యె,
మాటలులేనియానోట గూఢముగ
వినవచ్చెనీతులు ఘనరహస్యములు.
"భగ్నవాంఛలునీవు భరియింపుమయ్య,
తననెత్తురానిన, దివినచక్కెరను
ఈనోటిస్థితిమట్టి నిట్టిదేగాదె?
కాలంపుగతికీవు కటకటం బడకు.
ప్రాణహీనంబైన యంత్రంబుపోల్కి
పలునాళులదియల్లె భ్రమియించుచుండు."
యీతలంపెద తలయెత్తినక్షణమె
దుఃఖసంతాపంబు తొలఁగె డెందమును.
అవివేకచిత్తమా, ఆర్తిభారంబు
వెడలించు, చంపకు ప్రియమైనయాత్మ.
బానిసతలపైని బరువుమోసినను,
ఔదలనాకసంబంట నెత్తినను,
తనస్థితిమాఱిన తక్షణమందె
మృత్యువువెడలించు హెచ్చులొచ్చులను.
సంతోషదుఃఖంబు లంతరించియును
నిలిచుఁజిరము కార్యఫలమునద్యశము.

రాజ్యాధికార గౌరవమునకంటె
స్థిరమయియుండు దాతృత్వంబు దయయు.
భాగ్యవంతుఁడ, యిమ్ము పసిఁడి నర్థులకు,
నీ కిది యొక్కటే నిలుచు లోకమున.
భాగ్యంబు దర్జాయు పరిజనగణము
పయిని నీవాధార పడియుండఁబోకు,
నీకంటె మున్నుండె నీవెన్కఁగూడ
అవియుండుఁగాన, ద్రవ్యము దరిద్రులకు
వెదచల్లు, నీవును విడుము పీనేల,
సాదియు వెదచల్లె సన్నుతిమహా కీర్తి
కముల, భాగ్యములేని కతన నోమిత్ర.

## దుర్జనుఁడైన నరపతి

దౌర్జన్యవంతుఁడౌ ధరణీశుఁగూర్చి
కథచెప్పుకొనిరి యక్కడి రైతులిట్లు
అతని కాలంబున నంధకారంబు
కప్పెన రేయటు కాన్పించె దినము,
నిశవాని భీతిచే నిద్దుర లేక
ప్రజలొక్క త్రుటియేని పడయరు శాంతి.
పగలెల్ల సజ్జనుల్ బాధలుపడిరి.
రాత్రి పుణ్యాత్ములు ప్రార్థనా హస్త
మెత్తివేడిరి దేవు నిక్కట్లువాప.

ఆ కాలమున నున్న యనఘుండు పేతురు
పదములపైఁబడి ప్రజలు వాకొనిరి
"బాధించు నృపతికి బోధించుమయ్యా,
పరమేశ్వరునికైన భయపడుమనుచు."
ఈమాటలను విని యిట్లనె పేతురు
బాధగల్గెను నాకు పరమేశుఁడనిన,
అందఱు నవ్వాలే యీవార్త వినగ?
దైవంబునకు దూరతరుఁడని నీకుఁ
దెలిసిన, వానితో దేవుని మాట
లాడకు నీతోడ నాడితి నిజము
సన్న్యాయ నిర్ణయ స్వాంత యోపాహి,
దైవభక్తునికడ తథ్యంబు చెప్ప
వచ్చును, మూఢాత్మువద్ద జ్ఞానంబు
విప్పిన, చవుటిలో విత్తు ధాన్యంబు
నిష్ఫలంబగునటు, నిరుపయుక్తంబు.
అమల తత్త్వంబాత్మ హత్తుకోకున్న
భావించు నను దన పగవానియట్లు,
నను గాసిపెట్టును, దనుగాసిబొందు.
పాహి, నీవు నిసర్గ సత్యమార్గుఁడవు,
సత్యసంధుని బుద్ధి చలియింపఁబోదు.
ముద్రాంగులీయకమును నొత్తమైన
మందు నేర్పడు ముద్ర, అది శిలంబడదు.

నావల్ల లోకకంటకుఁడు ప్రాణంబు
విసిగివేసారిన వింతలేదందు!
వాఁడుచోరుండు, కాపరి కాఁడ నేను.
న్యాయంబు ధర్మంబు నడుపుటయందు
మీఁద నైతము కాఁపుదారి చేసెదరు,
కావున దైవంబు గాచునుగాత,
యోఁచించి తత్త్వంబు చూఁచిననీకు
చెందవు లోకులు చేయు సన్నుతులు,
తెలుపు కృతజ్ఞత, దేవునింబొందు,
ఏలన అన్యుల పోలిక నిన్ను
త్యజియింపకుండ సత్కార్య సేవలను
పనివడినియమించె. పలువురు జనులు
యత్నించిరేగాని యాఁటబయలందు
కరుణాకంఠికమును గైకొన్నవాఁడు
ఎవఁడో యొక్కఁడె యగు నిందరలోన.
యత్నంబుచే నీకు నబ్బు స్వర్గంబు,
స్వర్గ సన్నిభమైన సత్స్వభావమును
నిర్మించె దైవంబు నీజన్మవేళ,
కాంతిమంతంబౌత స్వాంతంబునీకు
నిరాజ్య కాలంబు నెగడుత శాంతి.
మఱిలకుండును గాత మతమంచుపదము.
ఉచ్చస్థితినిబొందు యోగ్యతకీర్తి.

ని జీవితముగాంచు నిత్య సంతుష్టి.
కడపటి పైనంబు కడుసుఖంబౌత
స్వీకరించుత సేవ విశ్వేశ్వరుండు
అంగీకృతంబౌత ప్రార్థనలెల్ల!

## విరోధియెడ జాగరూకత

సదుపాయముల సాధుసాంత్వ వాక్యములను
పనిచక్కఁబడునేని పగతుని మీఁద
చివ్వకు గాల్దువ్వ శ్రేష్ఠంబుగాదు.
బలవైరి బలిమిచే గెలువలేవేని
ధనమిచ్చి విప్లవ ద్వారంబుకట్టు.
శత్రునిచే క్షతి శంకింతువేని
మున్ను దయామంత్ర ముగ్ధునిజేసి
వాకట్టుగట్టుము. వైరిమార్గమున
వాడిచీలలు మాఱు పైఁడి చల్లించు,
కారణమేమన, కఱువంగవచ్చు
పండ్లవాడిమి మొక్కపఱచు దానంబు
జాగరూకతయున్న సకల లోకంబు
ననుభవింపగవచ్చు నౌచితి యెఱిఁగి.
అరిహస్తమును నీవు కఱువలేకున్న
ముద్దుపెట్టుముదాని ముఖవికాసమున.
ఇస్ఫందియారు తానిచ్చుకమాడి

బంధించె హస్తము వాగురలందు
బయలు వెడలలేక బద్ధుఁడైయుండ
సహాయ మొసఁగిన వైరి చర్మంబు గొఱికెవు.
అందాక మిత్రుని యట్లు వర్తించు
స్వల్పునిఁగా నిను జగడంబుపడిన
దాని నుపేక్షింప దగదు, జాగ్రత్త
జలబిందువులు కొన్ని గలసి తర్వాత
పెద్దవెల్లువయౌట వేమఱుకంటి
చేతనైనంతకు చిట్లింప బోకు
కనుబొమ్మ లెవరిపైనను కోపగించి,
బలహీనుఁడైనను, పగఱగాకంటె
స్నేహితుఁడైయుంట శ్రేష్ఠంబునీకు.
మిత్రులకంటెను శత్రుకెక్కుడుగ
నున్నవాని విరోధి యుత్పన్నుఁ డగును,
స్నేహితులగువారు చింతించుచుంద్రు.
అలవిని నీకంటె బలియుఁడౌ వాని
కదిసిపోరాడకు, చిమ్మునతండు,
అంగుళంబున నెలా కదుమ సాధ్యంబౌ
పదునికంటెను నీవె బలివియయ్యున్న
మానవత్వముగాదు వాని బాధింప.
మృగరాజుగోళ్ళున్న ఏన్గులావున్న
రాజ మెలని యెంతు రణమునకన్న

సామదానవిభేద సముపాయగతులు
నిష్ప్రయోజనమైన నీవుఖడ్గంబు
చేఁబూన ధర్మవిచ్ఛిత్తి తార్కొనదు.
పగతుండు రాజీకిఁ బ్రార్థించుచుండ
తగదుగాదని నీవు తలత్రిప్పఁబోకు.
అటుగాక యుద్ధంబు నర్థించునేని
వెనుకకు త్రిప్పకు వెఱచి నీహయము.
తనకుఁదానే రణద్వారంబు మూయ,
నినుచూచి భయపాటు, నీశక్తిఘనత
వేయిమడుంగులు వృద్ధియౌచుండు.
వాఁడెమున్ముందు చివ్వకుగాలుదువ్వ
నిను 'రేపు' లెక్కయిమ్మని దేవుఁడనఁడు.
అతఁడు విప్లవకారియైన నీవెపుడు
సిద్ధంబుగానుండు యుద్ధంబుసేయ,
ఏలనదుష్టుని యిచ్ఛమన్నించి
దయచూపనది పెద్దతప్పిదంబగును.
ఉత్తనీచునితోడ మెత్తగాఁబల్క
అతనిగర్వమునిక్కు అభివృద్ధిచెందు.
వంగిశత్రువుఁడు నీపంచ కేతెంచ
విద్రోహమునుమాని విడువు కోపంబు.
మన్నించుగాని యేమఱకకన్నెట్టు
వాఁడొకవేళ నిన్వంచించునేమొ.

వృద్ధులహితబోధ పెడచెవినిడకు,
హెచ్చుఁగార్యజ్ఞత యేండ్లతోపాటు.
కోటపునాదులు కళ్లగించెదరు
యువకుఁడుకత్తితో, యుక్తివృద్ధుండు.
యుద్ధమధ్యంబున యోచించుకొనుము
తలదాచుకొనుచోటు, గెలుపెవ్వఁ డెఱుఁగు?
ఘాజుకలంగి హోవడిచెందియుండ
నట్టనడిదలనొంటరి కాఁడవౌచు
గాలికెత్తకుము నీకమ్మనిబ్రతుకు.
ఘాజునోరలనున్న పరుగెత్తిపొమ్ము,
నడుమనుండినవైరి యుడుపుధరించు.
శత్రునకిన్నూఱు సైనికులున్న
పదినూర్లసైనిక బలమునీకున్న
ప్రొద్దుక్రుంకనవైరి పొలమువర్జించు.
రాత్రిచీఁకటిదాగి రాతుదళంబు
ఏఁబదుగురెత్తైన ఏన్నూరుమంది
పగిదిచీల్తురునేల భయముజనింప.
చీఁకటిపయనంబు సేయుదువేని
పగఱమాటులుముందు పరికించులెస్స.
రెండుసేనలమధ్య రేపునుమాపు
పయనంబునెడముండఁ బైకింకఁజనకు,
పథపరిశ్రమతోడ పరసేన బడల

వారిపైఁబడి చెండాడుచున్న ప్రాంతీయులు
అజ్ఞాని తనకుఁదా నాపదఁదెచ్చుకొనును.
పగఱజయించి బెంపుకన్న కీర్తనంబు
క్షితిరోషమున వారు క్రమ్మఱఁ బాఱుచున్న
విజితసైన్యంబును వెన్నంటిదూర
మార్గంబుపట్టకు, మంచిదికాదు
స్వజనంబునకు వేఱుపడి పోవుచనుటయు,
తోయదమనఁ యుద్ధధూళినభంబు
వ్యాపించెచూడు, నీపార్శ్వరక్షకులు
కత్తికటారుల గలయఁ జుట్టుదురు.
కొల్లగొట్టగ సైనికుల బంపబోకు
వాహినికి వెనుక రక్షణపరుండెప్పుడు
యుద్ధంబునసిపాయి యురుకుటకంటె
రాజురక్షణము కర్తవ్యంబుసూవె.

## శాంతిసమయమున సేనాపోషణము

ఒకపరి యోధుండు యుద్ధరంగమున
బహుశౌర్యాదులు ప్రకటించునేని
వానిజీతము వృద్ధి పఱుప న్యాయంబు
మఱియొకతూరిసంగర మయ్యెనేని
చావుభీతికి గూడ సందేహపడక

యాయాజుతోనైన నతడుమార్కొనును.
శాంతికాలంబున సంగ్రామభటుల
కడుమోదపెట్టుము, కష్టకాలమున
వారు సంసిద్ధులై వత్తురక్కఱకు.
విద్వేషిరణభేరి విన్నప్పుగాక
యిప్పుడే యోధులయెడఁ బ్రేమచూపు.
తినదిండిలేనియా దేబె సిపాయి
మృత్యువుకడకొత్తి యెటుపోరుసల్పు?
దుశ్చింతకులనుండి తొలగించుకొనుము
సేనతోడ్పాటున చిన్నజిల్లాలు,
ధనమిచ్చి సేనను దనుపుచుండు.
పరరాజులోకవపడు షాహికెపుడు
సైన్యంబుహృచ్ఛాంతి సంతృప్తినుండ,
తనతలమూల్యంబు దినుచుసిపాయి,
అతనిబెద్దడిసెట్ట న్యాయంబుగాను.
సేనలజీతంబు చిక్కబట్టినను
కరముఖడ్గముదూయ కరముశంకించు.
రిక్తహస్తుఁడు కష్టయుక్తజీవితుఁడు
సంగరంబునలెట్లు శౌర్యంబుచూపు?

## లోకజ్ఞుడైన వృద్ధుల యుపదేశము వినుట మేలు

శత్రులపై ధైర్యశాలురఁబంపు,

సింహంబుతోఁ బోరసింహంబెతనను,
నియమించులోకజ్ఞు లయిన పెద్దలను
ముఖ్యకార్యములందు, ముసలితోఁడేలు
వేటనెప్పరియాట విదితంబుగాదె.
పిల్లి యోధులగాంచి భీతిచెందకుము,
వివిధకౌశలమున్న వద్ధసైనికుని
యొకకంటగనిపెట్టి యుండుయుద్ధమున.
పసియెన్నుపై కెత్తి విసరెడువారు
మృగరాజుతలపట్టి యీడ్చుయువకులు
ముసలినక్కయుపాయములు గాంచఁగలరె?
దేశదేశంబుల దిరిగినయతఁడు
కష్టసుఖంబులు కలిమిలేములును
కనివిశేషంబుగ జ్ఞానమార్జించు.
యోగ్యులదృష్ట సంయుక్తులౌయువలు
వృద్ధులవచనంబు పెడచెవినిడరు.
రాణింపవలెనన్న రాజ్యపాలనము,
ముఖ్యమౌనుద్యోగ ములయందుననుభ
వము లేనిక్రొంగ్రొత్త వారినిల్పకుము.
బహుయుద్ధములుగన్న బంటునుదప్ప
ఇతరునొనర్పకు పృతనాగ్రసరుని.
చిఱుతకువెఱవదు చుఱుకుజాగిలము,
పోరెఱుంగనిసింహమును నక్కచెనకు.

పిన్నవయసునుండి వేటకబ్బెసము
పడినకుమారుండు భండనంబున
వెఱవక లంఘించు వీరులమధ్య.
చెండాడ వేటయు చెడుగుడుకుస్తి
గుఱినంట వేయుట నెఱిఁగినవాఁడు
శత్రువిదారక శౌర్యాత్ముఁడగును.
స్నానగేహంబున శాంతశుద్ధాంత
మున సుఖంబుగ కాలమును పుచ్చుభోగి
కదనకవాటంబు గడెలూడ, బోఁగులు.
ఇద్దఱుగుఱ్ఱంబు నెక్కింత్రుగాని
బాలుఁడైనవాని బడఁద్రోయఁగలఁడు.
వెన్నిచ్చిరణభూమి వెడలినవాని
పైఁబడివైరులు వధియింపకున్న
నీవైనఖండించు నీచుని గళము.
అనిసేయకసిపాయి యాఁడుదెపోల్కి
వెనుచూప, వానికంటెను పేడిమేలు,

## గర్గీను కుమారునికొనర్చిన హితబోధ

ఎంతచక్కఁగఁబల్కె హితముగర్గీను
తనయునితో, విల్లు దొనయుగట్టుచును
ఆఁడువారలపోల్కి నాజినివీడి

క్రమ్మఱు దేని యాప్రక్క కేచనకు,
మహితయోధులకీర్తి మాయింపఁబోకు.
అరికివీఁపునుజూపి పఱగెత్తురాతు
తననుగాదు, సమీక దక్షులజంపు.
సమరాంగణంబునఁ జక్కఁబోరాడు
ఇరువురిమిత్రుల కరములఁదప్పు
భండనశౌర్యంబు ప్రకటంబుగాదు.
అటువంటియిద్ద రత్యంతసుహృదులు
ఒకపంక్తిదినువారు నొకభాషవారు
ఏకజాతీయత యెసఁగెడువారు
అసువుఁబువోనాట కైనజంకకయె
యుస్నమధ్యంబున కరికిపోరెదరు
తనతోడఁబుట్టువు తనయుద్ధసఖుఁడు
పరిపంథిచే జిక్కఁ, పఱవరిసిగ్గు
విడిపీ పుచూపడు వెఱఁబాణమునకు.
బవరంబునభటాళి పాల్గొనకున్న
కాందిశీకతయె భాగ్యముగాగనెంచు.

## రాజు పండితులను యోధులను పోషించుట

భూపాల, యిఱువుఱి, బోషించుమయ్య,
యొకఁడు పండితుఁడు వేఱొకఁడు యోధుండు.

పండితప్రవరుల బలశౌర్యయుతుల
అనయంబుపోషించు నట్టి వివేకి
పేరువహించిన పృథ్వీశునుండి
రాజ్యకందుకమును రాఁబట్టుకొనును.
కలము కత్తినిద్రిప్ప గలశక్తి లేని
వాఁడు వచ్చిన దుఃఖపడఁబోకు మీవు.
కలముపట్టెడువాని కరవాలధరుని
కాచిపోషించుము, గాణనువలసు,
భామినికెంద్రైన పౌరుషంబున్నె?
సమరసన్నద్ధుఁడై శత్రువువిడియ
సాఖియందిచ్చు నాసవవుమత్తునను
వీణానినాదంబు వినుచువివుంట
యదిపౌరుషంబని యన నుచితంబె?
పలువురుభాగ్యవంతులు నాటుమీద
కూరుచుండిరి, వారికోట్లధనంబు
కరఁగెనునాటలో, కానైన లేదు.

## ముందు జాగ్రత్తవేలు

విద్వేషితోఁబోర వెఱవకుగాని
జాగ్రత్తరాజీకి జనువైరిపట్ల
పగలురాజీమంత్ర పరనగావించి
పెద్దలుకొందఱు నిద్దురవోవు

సేనపైఁబడి చీల్చి చెండాడుచుండు.
పైబొందలముతోడ పడిపిడ్రివోవు
బలశాలి వీరుఁడు; పశుపులు దిండ్లు
అంతఃపురస్త్రీల కక్కఱయగును.
బయల డేరాలోన బంటు సిపాయి
కంచుక హీనంబుగాఁ బహుకింట
నెలఁత విధంబున నిద్దురపోఁడు.
సంగర యత్నంబు సలుపుగూఢముగ,
వైరిపై బడుగాదె వంచనాగతుల!
జాగరూకత విధి. సమరానుభూతి
గలయోధవరులకు. కంచుకద్వంబుఁ
బోలెఁ గాచును సేన, ముందేఁగుదళము

## శత్రువులయెడ యుక్తితో ప్రవర్తించుట

జతయానశక్తి దుర్జనుల మధ్యమున
ప్రాజ్ఞుండు నిశ్చింత బ్రతుకుట తగదు
వారిద్దరొకశైన వారి దుర్బలత
సబలత్వముగ మాఱి జనుల బాధించు.
వంచన నొకనికిఁ బనిని కల్పించు,
నింకొక్కనిని ప్రాణహీనునొనర్చు,
అతఁడు యుద్ధముకోరి యరుదెంచునేని

ఖడ్గలాఘవమున గళము ఖడించు.
పరునకు చొక్కాయె చెఱయగునట్లు
వాని శత్రులతోడ వర్తించు చెలిమి.
శత్రుసైన్యము పరస్పరము పోరాడ
ఒఱలోనఁ బెట్టు నీ కఱకు ఖడ్గంబు.
తోఁడేళ్ళు నొండొంటితో కాటులాడ
ఆలోన మేఁకలు హాయిగానుండు
వైరు లన్యోన్యంబు పగదీర్చుకొనగ
నీవు నెయ్యురతోడ నెమ్మదినుండు.

## ముందుదృష్టితో విరోధులకు మర్యాద చూపుట

శత్రులతో నీకు సమరంబు గలిగి
కత్తి యెత్తెదవేని. కడురహస్యముగ
నరయుము రాజీకి ననువైనదారి.
నరశిరస్త్రాణంబు భగ్నంబుసేయు
మేటిపోటరులైన మేలచ్చుపడగ
బయటికియుద్ధంబు పచరించుచుండి
లోలోనశాంతి కాలోచించుచుండుము.
సమరభూమిని శత్రుసైన్యాధినాథు
భావంబు నెఱుఁగుము బహువిగూఢముగ,
ఒకవేళ నాతఁడు నూహించునేమొ

బంతియట్టులనిదు పదములవ్రాల.
ప్రతిపక్షముఖ్యుండు బద్ధుఁడౌనేని
వానిచంపకయాల మూనుటవెరవు,
ఏలన, మిగత సాఁబాలుసైన్యంబు
ఖైదీలగుంపులో గలసిపోయెదరు.
క్షతగాత్రుఁడై చిక్కు సైనికునెపుడు
చంపకు, మఱుగాక చంపెదవేని
గాయంబుదిన్న నీకాల్బంటుఁగూడ
మరలగాంచవటన్న మాటనిక్కంబు
బహిరంబులోఁబెట్టు బడినఖైదీల
కష్టపెట్టినవాఁడు కాలదుర్గతిని
తానుబద్ధుండైన తఱిఁజాలవెఱచు.
బందీలకుసహాయపడు మానవుండు
తానొకప్పుడు ఖైదిగానుండియుండు.
నీవుగీచినగీఱ నిల్చుసర్దారిఁ
గరుణతోమన్నించు, పరులుసైతంబు
నీమాటదాఁటక నిత్యమ్ము మెలగ
రేయిహత్యలునూఱు చేయుటకంటె
పదిమందిమొదలకు పరమసంతుష్టి
పొనరించుటేమేలు బుద్ధిమంతులకు.

# స్నేహముచూపివచ్చు
# విరోధియెడ మెలకువ

వినతుఁడై పగతుండు నినుజేరరాగ
వంచితుండవుగాక వానిఁగనిపెట్టు,
తనబంధుల ప్రేమ మనముననుండ
నీపయింగసిగొని నెంజెలింగొగులు.
రిపునిమాటలుతీపి నెపుడునమ్మకుము,
విషబిందులాతేనె విరివిగానుండు
పరమమిత్రులనైనఁ బరులట్లుచూచు
వాఁడెకాపాడుకోవలఁతిప్రాణంబు
దండిశత్రులబాఱి నుండిభద్రముగ.
తిరుగుమానవులెల్ల తిత్తిదొంగలుగ
సంశయించెడు లోభి సంచిలోఁబెట్టి
మంచిముత్యముదాచు, మాటికెంజూచు.
స్వామినిఎదిరించి చనినసిపాయి
చేత్రైనవఱకు నీసేవజేర్పకుము
యజమానికి కృతజ్ఞుఁడై యుండవేని
బంటునీకైనను పనివినఁబోఁడు
మాటయిచ్చినగాని మఱిమోట్టువిడిన
వానిపల్కులునమ్మవలదు, బూటకము.
చనిన వెంటనెగూఢ చారినిబంపి

యతని ప్రవర్తన మరయంగవలయు.
క్రొత్తగా నిసేవ గోరి దర్శింప
పొడిగించి దారంబు కడకు ద్రెంపకుము,
అటుగాక విన్నాతఁ డరయ డెన్నఁడును.
పగవాని రాజ్యంబు పట్టెద వేని
దానిని జెఱఁబడ్డ దీనులకెడుము
కారణమేమన, కైదీల దంత
ములు రక్తమున ముంపఁ దలఁచెదరేని
యన్యాయకారియౌ నవనీశు గళము
కొఱికి నెత్తురులూటఁ గోరుచుండెదరు.
పరరాజ్యమును గెల్చి పాలింతువేని
ముందుకంటెను రైతు కొందలంబూడ్చి
యభివృద్ధియొనరింపు మఖిలసంపదలు.
ఒకవేళ నావైరి యున్నట్టులుండి
సమరేచ్ఛఁ బాసిన సామాన్యజనమె
వానిపైఁ దలపడి వ్రచ్చు శిరంబు.
ఇటుగాక రైతుల హింసింతువేని,
పరుఁడెత్తివచ్చినఁ బురికవాటములు
బంధింపనీకేమి ఫలము లభించు?
''వాలుదాల్చిన వైరి వాకిటన్నిలిచె''
నని ప్రబోధించిన వినుమరే జనులు
అందఱు పురిలోన నరిమిత్రులౌట?

పరిపంథితోఁ బోరవలసిన యెడల
తగువివేకమున యత్నంబు గావించు,
ముచితంబు గమనించు, మొక్కనికైన
నీమనో నిర్ణయ మేమి దెల్పకుము.
ఎడఁదలోని రహస్య మెవ్వానికైనఁ
బ్రకటింప బోకుము, ప్రతిపత్తి గూఢ
చారులు మధుపాత్ర సఖులుగానుండి
మఱపించి లోగుట్టు మాటలనెల్ల
వెలికిలాగుటఁ గంటి పలుమారు నేను.
అల్ సికందరుఁడు ప్రాచ్యావనీపతుల
పైదాడి వెడలుట భావించెనేని
పటకుటీరము దారి పడమటి దెసను
పెట్టించునని చెప్ప వింటి పూర్వమున.
జావలిస్తానుకుఁ జననిచ్చుగల్గు
బహామను కుడిప్రక్క పయనించుచుండె
నెడమదిక్కుకటంచు నిల వార్త వింపి.
లాఁతి యొక్కఁడు నీతలం పెఱింగినను
అంగలార్పనె యాశయంబు నీ తెలివి?
కసిదీర్చుకొనుటయు కలను సేయుటయు
తగవైన పనిగాదు, దయచూపు దేని
యవనియెల్లను నీదు నాజ్ఞలోనుండు.
మంచితనంబున మర్యాదతోడ

కార్యంబుసాధింపఁ గలుగుదువేని
దార్జన్యమునకెట్టి స్థానంబుగలదు?
గర్వంబునీకునక్కఱ యుండబోదు.
నీవు నీహృదయంబు నెవ్వంగబాగుల
కోరుకొనవుగాన, కారలోఁజిక్కి
విలపించుబీదల విడిపించుమయ్య
వారిచిత్తంబులు ప్రమదంబునొందు.
బంటుసిపాయి, నీ బాహుబలంబె,
యుత్తారకంబని యూహింపబోవు,
బలహీనులొనరించు ప్రార్థనంబులును
ఆశీస్సులునునీకు నక్కఱయగును.
ఆశాప్రపూర్ణలౌ నా బీదవారి
ప్రార్థన బలవంతు బాహులకంటె
కార్యసాధనమందు కరముత్తమంబు.
దరిజేసిసాహాయ్య దర్పంబుగలుగు
వాఁడుఫరీదూనుగూడ జయించు.



# అనుగ్రహము

జ్ఞానవంతుఁడవైన సత్యంబు వంక
భావంబుత్రిప్పు, మాభాసంబుకంటె
శాశ్వతంబై యుండు సత్యభాసంబు.
పుణ్యంబు జ్ఞానంబు భూతకారుణ్య
మెఱుఁగని నరమూర్తి మఱుఁగు సత్యంబు.
ప్రజలకు సుఖనిద్ర పట్టెడునట్లు
మంచిచేసినవాఁడు మరణంబు వెనుక
భూగర్భశాయియై పొందు సౌఖ్యంబు
ప్రాణమున్నపుడె నీపనులఁ జింతించు,
సరకుసేయరు లోభపరులు బంధువులు
మృతుల యిష్టానిష్టమేమాత్రమైన,
బంగారు భాగ్యంబు బ్రతికున్నయిపుడె
దానంబుసేయుము; తదనంతరంబు
నీయాజ్ఞ మేరకు నెరవేర గాదియు.
అంత్యదినంబున నాత్మాభిఘాత
మొందగోరవయేని మందభాగ్యులను
నిఱుపేద జనులను మఱచిపోవలదు.

ఆటనీవు బొక్కసంబెంతయుండినను
వెవచల్లు బీదకు బిక్కకీనాఁడె,
అటుగాక రేపు నీ హస్తంబునందుఁ
దాళంపు జెవియుండు దశదప్పవచ్చు.
నీదారిబత్తెంబు నీతోడఁ గొనుము,
భార్య బిడ్డలు జాలిపడుట హుళక్కి.
పరచింతతోఁ గొంత భాగంబుగొనెడు
నొకఁడు ప్రాభవపుఁ గందుకము గొంపోవు
నీలోకముననుండి యాలోకమునకు.
వీఁపున జిలపుట్ట వేగ నాగోళ్ళు
గాక మఱెవ్వరు గోక రక్కఱగ
ధర్మమార్గంబున ధనమున్నయంత
వ్యయముసేయుము 'రేపు' అనుతాపమొంది
గట్టిగా మీఁజేయి కఱవనియట్లు.
దరిజేసి దోషంబు దయఁగప్పిపుచ్చు
కరుణించి నీతప్పు గప్పుదైవంబు.
రిత్తఁడౌ పాంథుని భుక్తిజేయకయె
వాకిలి వెడలింప వలదు, నీకట్టి
కడప త్రిమ్మరిపాటు గలుగకయుండ.
అక్కఱగలవారి కందఁజేసెదరు
బత్తెంబు బోనంబు భాగ్యవర్ధనులు
అట్టి దుఃస్థితి తమ్ముఁబట్టకయుండ.

దగ్ధచిత్తుల స్థితి దలపోయుమయ్య,
యుమ్మలికయు నీకు నొకనాఁడువచ్చు.
అంత్యదినముననీవసహాయు డవుగ
నుండుటమఱవకు మోాయిమిత్రుండ.
పరులవాఁకిటనిల్చి బత్తెంబువేడు
దశపట్టనందుకు దైవంబువేడు
నీవుకృతజ్ఞత నెరపెడునట్లు
తరుమకునర్థి నీద్వారంబునుండి.

## అనాథబాలురపై కనికరము

తండ్రిలేనినిసుంగు తలనీడనిల్పు,
దుమ్ముధూళివిదుల్చు, తొలగించుముంగ్లు.
నీవెఱుంగుదెవాని నిస్సహాయతయు
కఠినదీనావస్థ కష్టజీవితము?
వేరుత్రెంపినచెట్టు వెలవెలఁబోక
పచ్చగించునె నవ్యపల్లవస్ఫూర్తి?
దీనాననుండయి తిరుగునాథ
బాలుడునీముందు వచ్చినిల్చినను
వానికన్నెదుట నీపసిపాపనెత్తి
మురిసిముద్దాడకు మెరియుచిత్తంబు.
తల్లిదండ్రులులేని తనయునియార్తి
నూఱడింపగనెవ్వ రున్నారు చెపుమ?

ఒకవేళఁదనకోప ముత్తలపెట్ట
జెలిమితో శమియింపఁజేయువా రెవరు?
వాఁడేడ్వకుండ గావలయు, జాగ్రత్త!
దైవపీఠంబైన దడదడలాడు
పనియనాథుని దుఃఖపవనంబువీవ.
కనికరంబువాని కన్నీరుతుడువు,
మురికి దుమ్మోడలించు ముఖబింబమలర.
తనయాశ్రియచ్ఛాయ దలగిపోవంగ
ని నీడవానిని నిల్పిపోషించు.
తండ్రిపేరెదపైని తలమోపినపుడు
ముకుటార్హుఁడనటంచు మురిసిపోయితిని
ఈగనాపయివ్రాల నెంత యాపదయో
యనికొందఱాత్మలు నలజడిపడియె.
ఇపుడన్న, కైదిగా నేఁగింపనన్ను
చెఱనుండి తప్పించు చెలికాఁ డెవండు?
పిన్ననాటనెమమ్ము విడనాడితండ్రి
స్వర్గమేగె, ననాథబాలురబాధ
ఆర్తినాహృద్గతమయ్యె నెన్నండో.

## సత్కార్య ఫలము

భోజందు బ్రముఖుండు కూర్కి—, స్వప్నమున

గాంచె ననాథుని కాలిలోముల్లు
చల్లగా, బెకలించు సజ్జనుఁడొకని.
నందనోద్యానమునందు వయాళి
సలుపుచు నాదయా శాలియిట్లనియె
"ఆ కంటకమునుండి యావిర్భవించె
నెంతమంచి గులాబి యిందునాకొఱకు?"
విడకు కారుణ్యంబు వీ వైనవఱకు,
దయఁజూతు వేనినిఁ దయజూతురొరులు.
ఎవరికేఁ బహుమతియిచ్చినయపుడు.
"వాఁడు లుబ్ధుఁడు నేను పరిముఖుండనంచు
ఆత్మస్తుతినొనర్ప నదినీచమగును
కసి వానిగూర్చిన కాలఖడ్గంబు
మఱవకు, మిపుడైననొఱ బైటనుంచుము.
నీ భాగ్యమెప్పుడు నిండిపొంగార
ప్రార్థించు జనులను పరికించినపుడు
దైవ కృతజ్ఞత తగఁజూపవలయు.
ప్రజలేదిరైన నీవద్ద కాంక్షింతు,
రెవరివద్దకు నీవు నేమి గైకొనవు.
మున్ను నేఁబలికితి భూపాలవరులె
పరమదాతృత్వ స్వభావులటంచు,
తప్పు బల్కితి, దానిఁదలపోయఁబోకు,
పైగంబరులకె యా ప్రకృతి చెల్వొందు.

## పైగంబరుల స్వభావ మర్యాదలు

అబ్రహాము ప్రవక్త యతిథిమందిరము
వారంబు దినముల వఱకెవ్వఁడైన
తెఱువరిసొచ్చి యాతిథ్యంబుగొనఁడు
ఆఁకటిసొదతోడ నధ్వగుండెవఁడో
రావచ్చునని యెంచి ప్రాభాత వేళ
నాహార మొకముక్కయైన ముట్టండు.
బయటికి చనుదెంచి పలుదిక్కులరసి
లోయబయలున నాలోకించుచుండ

ఒంటిగాతుంగట్టు లోక శతవృద్ధుఁ
డరుగుదెంచె నెడారి సరిహద్దునుండి.
అతనిగడ్డముతల యంతయున్నెరసె
వార్థక్యహిమరాశి పైబ్రాలినట్లు.
అబ్రహామాతని యాగతిగాంచి
స్వాంతంబునిండార స్వాగతంబొసఁగి,
యౌదార్యచిత్తుల యాచారమట్లు
"నాకసీనిక. రమ్ము, నాయుప్పుపులుసు
గ్రహియించినను ధన్యుగావించు" మనుచు
వృద్ధపాంథుని వేడ, వినిసమ్మతించి
ముందుపాదముపెట్టె, మున్నెఖలీలు
సౌజన్యమతనికి జ్ఞాతమైయుంట.

అతిథిశాలాసేవ కావలిబీద
బాటసారిని గౌరవంబుపాటించి
కొనిపోయిలోనికిఁ గూర్చుండఁజేసి
ఆజ్ఞమేరకు పెట్టి రఖిలభోజ్యములు.
అందఱునాపంక్తి నాసీనులైరి.
'బిస్మిల్ల' యనివారు ప్రీతితోఁబల్క
వృద్ధునిమాటలు వీనులంబడవు.
అబ్రహామిట్లనె ''నయ్యవృద్ధుండ,
అందఱపెద్దల యందుగాన్పించు
వైరాగ్యదైవ విశ్వాసముల్ గనను
మీయందు! నియమంబు మీఱుటగాదె
భుజియించునపుడు, మీభుక్తినొసంగు
సర్వేశ్వరునిపేరు స్మరియింపకుంట?''
''మీపద్ధతులనేను మేకొనంగోను,
మాపెద్దలాగ్నేయ మతవిశారదులు
ఎపుడైనబోధింప రీనియమంబు''
ననివిని పైగంబ రంతభావించె
''నగ్నిపూజకుఁడౌను హతభాగ్యుఁడితఁడు,
పావనాత్ములకుని పాపిమ్లేచ్ఛుఁడు
వర్జనీయుఁడ'' టంచు వానినిఁ దఱిమె
నతినిష్ఠురంబుగ మతివైరివట్లు.
అంతదివ్యజ్యోతి ప్రైఁన సర్వేశు

కడనుండిదిగివచ్చె వడిదేవమాత.
"ఓయిఖిలీల, నేనొకవంపయేండ్లు
ప్రాణంబు బత్తెంబు వానికిచ్చితిన్,
ఒకక్షణంబైన నోర్చుకోలేక
విసిమాలి నీవునా మసలిమానిసిని
కరుణాసుంతయు లేక తరిమివుచ్చితివి.
అతఁడగ్నిపూజారి యైననీవేల
వెనుదీసితివి దాన వీరహస్తంబున్
అదియునౌదార్యంబెన్ యనిమందలించె.

## ఉత్తమాధమ విభేదముఁలేక దయచూపుట

ఒకఁడువంచకుఁడు వేఱొకఁడుదుష్టుండు
అనినిముదాతృత్వ మాపిపెట్టకుము.
శాస్త్రవేత్తలుమత జ్ఞానంబు నీతి
పొట్టకూటికెనమ్మ పొచ్చెంబెయగును
ఎచటవివేకంపుస్మృతి నిర్ణయించె
మంత్రవేత్తలకువిధి మతబోధయంచున్
అయినగైకొను ప్రాజ్ఞుడమ్మెడిదాని,
వెలతక్కువగనిచ్చు వేత్తదగ్గఱనె
కోరినయంతకు గొనును వివేకి.

# పుణ్యాత్ముఁడు వంచకుఁడు

వంచకుండొకనాఁడు పావనచిత్తు
దగ్గఱికేతెంచి తనసొదచెప్పె
మెడబంటిబురదలోఁ బడికూరుకొంటి,
పరమనీచునియొద్ద పదిదేరములకుఁ
దలతాకటులుపెట్టి పలవించువాఁడ,
అందులోనొక ♦దాంగి పైననామెడఁదఁ
బదిమణుంగులమోత పడినట్టులుండు.
రాత్రియంతయువాని రాయిడివలన
దుర్భరంబై నాదు దుఃస్థితియుండు,
పగలెల్లనానీడ వలెవెంటఁదిరుగు.
మనసునొప్పించెడి మాటతూఁపులను
తలుపంత పెనుగంటి తొలఁచెనామెదను.
తల్లిగర్భమునుండి తరలినదాది
పదిదేరములదప్ప భగవంతుఁడతని
కియ్యడువేరాస్తి యెట్టిదిగాని.
'కర్చుచేయకుమ'ను కాండంబుదప్ప
నెఱుఁగఁడోనామాలు నేపురాణమున.
ప్రొద్దుతూరుపుఁగొండఁ బుట్టనిదినము
తలుపుకొండినివాఁడు తట్టనిదినము
లేదుపుణ్యాత్ముఁడా, లేదులేదయ్యా.

♦దేరములో నాలుగవ భాగము.

ధనమిచ్చి యేదాన ధర్మపరుండు
ఆశిలాహృదయుని యప్పు చెల్లింప
తోడ్పడునోయని తోరంపుటాస
నెదురుచూచుచునుందు నెల్లవేళలను.
అని చెప్పవిని కరుణాత్ముండు రెండు
బంగారు నాణెముల్ వానికొసంగె.
అవి చేతఁబడినంత నాకల్లరీఁడు
భాస్వన్ముఖంబుతో బయటికివచ్చె.
ఒకఁడిట్లుపశ్నించె ఓపావనాత్మ,
ఎఱుఁగరామీరు వాఁడెవ్వఁడైనదియు?
వానిచావునకు నెవ్వఁడు నేడ్వరాదు.
అతఁడెట్టి బిచ్చగాఁడనఁగ, సింహమును
పట్టిజీనీపట్ట బంధించఁగలఁడు
చదరంగమునవాఁడు 'జైదు' తోనాడి
యరికట్టగలఁడు హయంబును రాణి.
ఆమాటలకు షేకు ఆశ్చర్యమొంది
చాలుప్రసంగంబు, సరికాదునీకు.
మాటాడలేవు, నామాటలువినుము.
నేఁదలంచినయట్లు నిజమయ్యెనేని
ప్రజలలోవాని గౌరవముగాచితిని.
ఒకవేళతనాతగాఁ దుక్కివు డగుచు
సిగ్గటిమోసంబు చేసియుండినను

ఎడఁదఁ బశ్చాత్తాప పడుదునటంచు
నెంచఁబోకుము, నిన్ను హెచ్చరించెదను.
చెడుగుటక్కరి చేత చిన్నబోకుండ
కాపాడు కొంటినాగౌరవంబిపుడు.
చెడ్డవారికి, మంచి చేయువారలకు,
సమముగాదానంబు సలుపంగవలయు,
అంచితాత్మలకది వ్యాపారమండ్రు,
చెడ్డలునశియింప జేయుసాధనము,
పావనాత్మల సత్ప్రవర్తలందు
ప్రాజ్ఞులకడ శిక్ష పడినవారు
ధన్యాత్ములనఁ జెల్లుఁ, దగువివేకంబు
న్యాయనిర్ణయము సత్యప్రీతి తెలివి
నీకున్న వీనులు నిండారవినుము
సాదిచెప్పిననీతి సదుపదేశములు
చాలమట్టుకుప్రాత జాల్యాదనీతి,
చన్నులపొంకంబు, చిఱుతిలకంబు
నెఱిగించువర్ణన మిందుండ బోదు.

# పిసినిగొట్టు తండ్రి, త్యాగశీలుఁడైన కుమారుఁడు

సకలభాగ్యంబులు స్మరణచిహ్నముగ
నింటభద్రముచేసి యేఁగె నొకండు.
పుణ్యాత్ముఁడును చాలబుద్ధిమంతుండు
నగుకుమారుఁడు తండ్రియాస్తికివచ్చె;
పిసినిగొట్టువిధాన పసిఁడి చేకొనఁడు,
ముక్తునిపోలిక ముట్టండు ధనము.
దరిచేసిజనులు మందిరము క్రిక్కిఱిసి
సుంత కాళీపడ్డ చోటుండ దెపుడు,
అతిథిశాలను పాంథులల్లిమూగెదరు.
బంధువులపరాయి వారిని వేఱు
సేయకనందఱ సమముగాఁదనిపె.
పిసిఁడి తండ్రివిధాన పసిఁడియు వెండి
పెట్టెలనింపక పెట్టునందఱకు.
ఒకమిత్రుఁడది గని యొకరుచ్చ కాడ,
యున్న భాగ్యంబంత యొక్కసారిగను
వ్యయపెట్టుయత్నంబు వ్యసనంబుదెచ్చు.
ఏడుఁగాలపు పంట యింటికిరాఁగ
ఒక్క పెట్టునదాని నూడ్చుట యేమి
మానవత్వంబని మతినెంచినావు?

సతముదారిద్ర్యంబు సహియింపవేని
లెక్కలఁబరికించు మెక్కువున్నపుడె.

## సాదృశ్యము

"ఎత్తిపెట్టుము యభివృద్ధి నాళ్లందె
కఱవుకాలమున నక్కఱకుఁ జాలంగ"
నని యెంత చక్కగాఁ దనయకుం జెప్పె
పల్లెయిల్లాలోర్తు పరమసంతుష్టి!
నింపుమెల్లప్పుడు నీటిబుంగలను
తోలుతిత్తులనింట, ప్రోలికాలువలు
ప్రవహించుచుండవు ప్రతిదినంబునను.
ఎక్కవచ్చునుస్వర్గ మిహమునుండి,
ధనమున్నసైతాను దఁడింపవచ్చు.
భాగ్యహీనునికోర్కె ఫలియింపబోదు.
పెల్లుబంగారున్న తెల్లదయ్యంబు
కన్నులుపెకలింపఁ గలుగుమానవుడు.
నిఱుపేదవైయున్న స్నేహితునెడకు
పోకుము. డబ్బున్న పోపొమ్ము, తెమ్ము.
రిక్తహస్తుఁడవయి ప్రియురాలిగనకు,
కొఱగాకయుండు బంగరులేనివాడు.
ఉన్నదంతయుఁజేత నుంచుకోనున్న

అక్కఱపడినప్పు డరచేత సున్న.
బిచ్చగాండ్రును నీదు పెట్టిపోతలకు
లావెక్కరెన్న డు, నీవె క్రుంగెదవు.

## పిసినిగొట్టువాని కుమారుని కథకు అనుబంధము

దానంబునకు నడ్డు దవిలిన సఖుఁడు
ఈ కథ చెప్పంగ నీర్ష్యలో మెఱయు
యువకుని ధమనుల కుండదు నిద్ర.
ఆ మాటలకు చిత్త మటమటలాడి
యుడుకెత్తి యిట్లనె ఓ కష్ట వచన,
ఇపుడు నాకబ్బిన యీ భాగ్యమెల్ల
తాతలదని మున్ను తండ్రి వచించె.
అవ్వారు లోభులై యాస్తి కాపాడి
దుఃఖభాజనులయి తుద కొక్కనాఁడు
సర్వంబు విడనాడి చచ్చిరిగాదె?
నాకుఁ బ్రాప్తించెను నాయన యాస్తి.
నావెన్కనది వచ్చు నాకుమారునకు.
యిపుడునేనున్నట్టి యీయాస్తి జనులు
అనుభవించుట మంచి దట్లుగాదేని
రేఁపు నా ప్రాణంబు రూపఱు వెనుక

కొల్లగొట్టెదరు మా కోశంబునెల్ల
తినుమిమ్ము కట్టుము సిరి పెంబుపెట్టు,
ఇతరులకొఱకేల యింత కాపాడ?
పరమునకుం దెచ్చు పరమ వివేకి
తనతోడ మంచి సేఁతల ఫలంబులను.
మఱినికృష్టుండు తా దురపిల్లు నిచట.
ధనధాన్యములనిమ్ము జనుల యక్కఱకు
అవినీవివిడియున్న యా దినమందె.
ఏలన, నీవెన్క నేదియుఁగాని
నీవుకోరినయట్లు నెర వేరఁబోదు.
విలువవచ్చును స్వర్గమిలనుండి నీవు
ప్రాణమా, యిటుగాక వనట చెందెదవు.

## ఇరుగుపొరుగువారికి సౌకర్యము కూర్చుట

“అలవీధివర్తకుఁ డమ్మరొట్టెలను
నిఁకఁగొనవద్దని యేడ్చె యిల్లాలు
భర్తనొక్కదినంబు బతిమాలెనిట్లు
“గోదుమంగడివీధిఁ గొనఁబొమ్ము మేలు,
యాదరి బాదర యవలుకొల్చెదరు.
జేరసారములాడు వారిగగ్గోలు
వలననీతడ బాటు కలుగుటగాదు.

జుమ్మని మోమెల్ల సుడియుచు ముసరు
ఈఁగ రాణువబాధ కిటులోచునుండు,
వారంబుదినముల వఱ కెవ్వఁడైన
వాని మోమునుగన్న పాపానఁబోఁడు."
ప్రేమతో సతి కస్తరించి మగండు
నిట్లనె రమ్మ నాయింటి దీపంబ,
యూఱడిల్లుము నీదు నుమ్మలంబెడసి,
మన బేర మాసించు కొని వర్తకుండు
చిన్నయంగడి పెట్టె నిన్నెలవందు.
అతని లాభంబును హరియించు చేఁత
మానవత్వముగాదు, మర్యాదగాదు,
అనుసరింపు ముదారులైన సజ్జనుల.
నీవు నిలచియున్న, నెనరువహించి
క్రిందకూలిన వాని కేలూని యెత్తు
దైవభక్తులపైని దయగల్గి యిమ్ము.
బీదయంగడివారు విల్తురు సరకు
నిజమెటింగెడుకోర్కె నీకున్న వినుము
'వలి' యను నౌదార్యవంతుడౌ సుగుఁణి.
దానశీలత 'ఆలి' మానవాధికుఁడు.

# మక్కాయాత్రికుని విపరీత భక్తి

ఒకఁడు మక్కాయాత్ర యొనరించుచుండి
మాటిమాటికి రెండుమార్లు నమాజు
చేయుచుండె నటంచుఁ జెప్పంగవింటి.
దైవమార్గమునందుఁ దనకు నుత్సాహ
మెంత తీవ్రతరంబొ యెఱుఁగంగవచ్చు,
అతికాలులో ముల్లు విఱిగి బాధింప
దానిని వెలిపుచ్చఁ దలపోయఁడతఁడు.
కడకుఁ జాపల్యంబు ఎడఁదఁ బీడింపఁ
దాకొనర్చినదెల్లఁ దనకింపుగొలిపె.
"ఎవఁడు నాకంటెను నింతటి శ్రద్ధ
యాత్రగావించె నీ యధ్వంబునందు"
అని గర్వ కూపంబునందు పాంథుండు
పడియె సైతాను ప్రభావంబు వలన.
దైవకారుణ్యంబు తలపట్టి యీడ్చి
గట్టుచేర్పకయున్న గర్వమాతనిని
తప్పించియేయుండు ధర్మమార్గంబు.
ఆకాశవాణి యిట్లని యుపదేశించె
ఓ సుస్వభావుండ, ఒకవేళ నీవు
భక్తియొనర్చిన, భగవంతు నెడక

గొప్పగా కానుక గొనిపోతినంచు
తలపోసి నీలోనఁదలచిక్కఁగొనకు
ప్రతి యంచలో వేయి ప్రార్థనల్ సుఖపు
దానికంటెను మేలు దానధర్మముల
పరుని చిత్తము సౌఖ్యపడఁజేయుటెల్ల.

## భార్యాభర్తల సంభాషణము

ప్రభుసేవకుండగు భర్తనుగాంచి
యింతి యిట్లనె ఓయదృష్టవంతుండ,
లెమ్మ, తిండికి నేదో దెమ్మ, సుల్తాను
భుక్తశేషము కొంత పుడికి పుచ్చెదరు.
ఇంట బిల్లాజెల్ల కంట నీర్వెట్టి
యాకటిమంటతో నంగలార్చెదరు.
అనవిని మగఁడిట్టులనియె నీనాఁడు
రాజు బానసమున రగులదు నిప్పు,
ఈ నాడు పస్తుండు నిచ్చవచించె
నిన్నరాతిరిషాహి నిశ్చయంబుగను.
అని భర్త పలుకంగ నతివ నిరాశ
వెచ్చనూర్పుచుఁ దల ప్రేలాడవైచి
ఆకటి చిచ్చుచే నాదగ్ధమైన
తనయెదలో నిట్లు తలపోసికొనియె
"ఏమి మంచి గడించె నీనాఁడు షాహి

పస్తుండి? యుపవాసభంగంబెమాకు
పసిపిల్లలకు పెద్దపండుగయగును.'
ప్రతిదినంబును పస్తుపడు లోభికంటె
తిని మంచియొనరించు మనుజుండె మేలు.
పొద్దుటింతలఁ దనరొట్టెక్షుధార్తుఁ
డగుబీదకిడుదాత యర్హుండుగాని
పరుఁడు పస్తుండి యేపలము నార్జించు?
కాదేని, యంతయక్కఱయేమివచ్చె
కడుపుమాడిచికొని కష్టంబు పడఁగ?
ఒకనాఁడుమాని యింకొకనాఁడుగుడువ?
ఒకమూలఁగూర్చుండి యున్న అతండు
తెలివితక్కువ యూహాఁదికమకల్ సేయు
కడకుముసల్మాని, కాఫరుమతము.
అద్దంబునను నీట నమలత్వ మమరు
కాని వివేచించు వాని భేదంబు.

## ధనము లేని త్యాగి

ఒకనికిదాతృత్వ ముండెనుగాని
తన ఈవికిజాలు ద్రవ్యంబులేదు.
అధముడు ధనికుండు, త్యాగినిర్ధనుడు
గాకుండుగావుత కలకాలమీశ!
మహితాశయంబులు మదినున్న వాని

యిచ్ఛలు నరుడుగా నీడేరుచుండు.
గిరితలంబుననుండి దొరఁగు నిర్ఝరము
ఎత్తున స్థిమితమై యెపుడుండఁబోదు,
తన శక్తికినిమించి దానంబుసేయ
నిశ్చయంబుగఁజేయి నిర్ధనంబయ్యె
రెండుమాటలు వ్రాసె రిక్తుఁడాతనికి,
నిట్లని "సంతుష్ట హృదయుఁడా, నన్ను
తెప్పదేల్చుము కొన్ని దేరంబులిచ్చి,
జరిగె కాలము కొంత చెఱ బెట్టినన్ను
తప్పించుకొనిపోవ దారిచూపడదు."
దాత కన్నులముందు తత్ప్రార్థనంబు
నిష్ప్రయోజనమయ్యె నిర్ధనుండౌట,
చిన్నడబ్బైనను చేతిలేదిపుడు.
స్విన్నచేతసు డిట్లు చెప్పిపంపించె
నొక్కని చెఱసాల యుద్యోగి యెడకు
"మంచి పేరు గలాఁడ, మాన్యవర్తనుఁడ,
వాని చొక్కా చెంగుపై చేయివిడుము,
అతఁడు పరారియై యగపడకున్న
వానికి నేనె జామీనుగానుందు."
తరువాత నాత్యాగి చెఱసాలకేగి
లెమ్మోయి, యీ పట్టణమ్మునుదాటి
కదలిపొమ్మెటకైన కాళ్ళున్న యపుడె.

అని చెప్పవిని ఖైది యటునిటు చూచి
వాకిలి తెఱచిన పంజరంబందు
క్షణమైన నిలువని చటకంబుపోల్కి-
ప్రబల వేగంబునఁ బయనించె, గాలి
రైన కాల్దుమ్ము డాయంగ లేనట్లు.
కారాధికారు ల కాపట్యమెఱిఁగి
యాదయాశాలిని నరికట్టి తెచ్చి
"ఖైదీని చూపుము, కాకున్న ధనము
నిమ్మని పీడించి, యెది తేఁకున్న
ఆ నిస్సహాయుని నంపిరి చెఱను.
బంధమూడిన పిట్ట బట్ట శక్యంబె?
కొంతకాలము చెఱఁ గ్రుళ్లినతండు,
సాహాయ్యమున కయి జాబు వ్రాయండు,
ఫిర్యాదు చేయడు పీడితుండయ్యు
తినఁదిండి కొఱఁతతో దినములు పుచ్చె,
రాత్రులు క్షణమైన రాదుపో నిద్ర
అతట్టు పోవుచు ననె నొక్క భక్తు
డయ్య, పరార్థంబు నపహరించితివి
అని నేను తలపోయ, నైన నీకట్టి
కారానివాసంబు గలిగెన దేమొ!
అనవిని యాఖైది యనియె సజ్జనుడ,
"పరుల ధనంబును వంచించి తినను;

నిస్సహాయుండై న నిజుపేదనొకఁడు
కారలోఁ దుఃఖింప గనివానిఁగాన
మద్బంధమునకంటె మాఱొండు లేమి
ఈదురవస్థలో నిట్లున్నవాఁడ.
ఒక్కఁడు చెఱఁబడి యమ్మలింపంగ
నేను సుఖంబుంట నీతికోఁ బిసుల
కిష్టంబుగాదని యెంచితి మిత్ర.''
తెఁదకాతఁడట్లుండి తొలఁగ దేహంబు
మంచిపేరువహించి మాన్యతఁగాంచి
పేరుఁజావనివాని ప్రియజీవితంబు
సన్నుతంబగుఁగాక సర్వకాలంబు!
మృతచిత్తుఁడయి మేను బ్రతుకుటకంటె
బ్రతుకుటెడందతో మృతినొందు మేలె.
బ్రతికున్న హృదయంబు పాడుగాదెపుడు,
ఒక వేళ నీ దేహ ముర్విఁ గూలినను
హృదయంబు బ్రతికున్న నేమిభయంబు?

## దైవసృష్టిలోని ప్రాణికోటులపై దయ చూపుట

నీరువట్టి యెడారి నీరంబుగనక
కొసయూర్పుతోనున్న కుక్కనుగాంచి
మతతత్పరుండగు మాన్యుఁడొక్కండు

దానిగావదలంచి, తద్యత్నమునను
తనలోపిపాత్రగా, తలపైనిపాగ
చేత్రాడుగాగట్టి, చేదిజలంబు,
నవసిన శునకంబు నాలుక తడిపె,
'భగవంతుడా మంచిపనికి హర్షించి
క్షమియించె నాదయాశాలి పాపములు'
అని నాటి గంబరావార్త దెలిపె,
నీవు క్రూరుడవైన నిలిచి యోచించు
మౌదార్యముంబూను మలవియా కొలది,
విశ్వాస పాత్రత విడక యార్జించు,
శునకంబునకు దయ చూపుటకూడ
వ్యర్థంబుగాదన, పావనాత్ములకు
నొనరించు మేలెట్టు లూరకపోవు?
నీచేత నైనంత నెనరు వహించు,
సర్వేశు డెపుడు విశ్రాణన ద్వార
మును నేరికైనను మూసి పెట్టండు,
బావి నీరు నెడారి బయల లేకున్న
దీపంబుపెట్టు యాత్రికు లేగుచోట.
ఇక్కట్లు పడు పేద యొక్క దీనార
మిచ్చుట దలపోయ నెంతయో గొప్ప,
భాగ్యవంతు డొసంగు బంగారు కంటె!
తన శక్తి కొలది మోతను మోయుచుండు

ప్రతి మనుష్యుడు, చీమ బలశౌర్యములకు
మిడుత కాలును మోయ మిక్కుటంబగును;
భాగ్యవంతుడ, రేపు భగవంతుడు నిను
కష్టపెట్టనియట్లు కరుణించు ప్రజల,
కాలుజారిననాడు కై దిగాబోడు
పతితుల జేయిచ్చి పైకెత్తునతడు,
అతి కఠినంబుగా నాజ్ఞపెట్టకుము
శానిసపయి, కాలవశమున వాడు
అధికార ధూర్వహుండైన గావచ్చు,
వైభవంబును గౌరవంబు చిరంబు
నిలిచియున్నప్పుడు నీవు సామాన్య
జనుల బలాత్కృతి సలుపంగ దగదు,
ఏలన, చతురంగకేళి పియాద
తటుకున రాణియై తగ గౌరవంబు
గనునట్లు దరిజేసి గనవచ్చు ఘనత,
సత్య దృక్కు వచించు సదుపదేశంబు
వినుమ, యెవ్వరి చిత్తమున నేని ద్వేష
బీజముల్ సుజనుండు వెదచల్లబోడు,
పరిగ యేరెడువారి పలుపాట్లు పెట్టి
పంటకామందు దాబడయు నష్టంబు,
బీదకు దైవంబు విత్తంబు నిచ్చు
ననుచు భీతిల్లి యాయధమ కర్షకుడు

పరగ యేరెడివారి భావంబులందు
కరిన దుఃఖము మోపి కసిదీర్చుకొనుచు,
బలవంతు లెందరో పడిరి కష్టములు,
పతితులెందరినో చేపట్టె భాగ్యంబు!
ఒకవేళ నీవును నొకనాడు దీన
జనుడవుగాకుండ మననెంచువేని
దీనుల హృదయంబు తెగగోయబోకు.

## కలిమిలేముల మార్పు

### దరిద్రుడైన ధనికుడు. ధనికుడైన దరిబేసి

తన దుఃస్థితినిగూర్చి దరిజేసి యొకడు
చిటమటమని మాడు చిన్నెలమోము
గల భాగ్యవంతుని కడ మొరపెట్టె,
ఆయంధ చేతస్కు డక్కరదీర్ప
నియ్యడు దీనారమేని పావేని,
పైపెచ్చుగా వాని పైని కోపించి
యరచి చిత్తభరంబు విరివి నొందించె,
వాని దౌర్జన్యంబు వలన యాచకుని
యుల్లంబు నెత్తురు లొలుకుచునుండె
తన దుఃఖముననుండి తలయెత్తిచూచి
బిచ్చగాడిట్లనె వింతయాగాదె!
భాగ్యశాలి ప్రసన్న వదనుండుగాక

మోముమాడ్చగ తన పుట్టేమి మునిగెఁ
యాచనానైచ్యంబు నందలిచేదు
అడలింపదోయేమొ యతని డెందంబు!
‘‘అదలించి బెదలించి యాబిచ్చగాని
తరిమివేయుడ’’ టంచు తన గులామునకు
నాజ్ఞ వెట్టె గరోడుడా హ్రస్వదృక్కు,
తనకింత మంచిచేసిన సృష్టికర్త
భక్తికృతజ్ఞుడై ప్రార్థింపకుంట
హారియించెనని వింటి నతని సంపదలు,
కొల్లబోయెను వాని గొప్పతనంము,
బుధుడు మషీపాత్ర ముంచెకలంబు,
పక్కదీసిచ తెల్లబాయ విధాన
నగ్నంబుగా వాడు నడకుచునుండ,
కూటి పేదతనంబు కూర్చుండబెట్టె,
బరువులేమియులేవు, భరవాహి లేడు,
విధివానితలపైని వెదచల్ల దొడగ
దారిద్ర్యమను దుమ్ము, తలపోతువేని
యింద్రజాలికునకు నెటు సంచి చేయి
యుత్తదా, నట్టులేయుండె నాతనికి,
ఆద్యంతములు మారె నతని యవస్థ,
కాలమిట్టులె కొంత గడచిపోయినది,
భాగ్యవశంబున వాని గులాము

కరుణామయాత్ముని కడకొల్వు గొనియె,
ఆక్రొత్త యజమాని యౌదార్య ఘనుడు
కాంతిమచ్చేతుండు కరుణాన్వితుండు
నిష్ఠురస్థితి నున్న నిరుపేదగాంచ
పేదపెన్నిధిగన్న విధము హర్షించు,
ఒకనాటి మునిమాపు నొక బిచ్చగాడు
కష్టంబుతో తన కాళ్లీడ్చుకొనుచు
కడపముంగల నిల్చి కబళంబువేడె,
అంతట కరుణాత్ముడా గృహమేధి
"అక్కర గలవాని యాత్మసుఖంప
జేయుమ" యని బానిసీనికి జెప్పె!
పళ్ళెరంబున నున్న వంటకంబులను
అతనియొద్దకు తెచ్చి యప్పుడ కాంక్షి
తముగ బానిసనోట ధ్వనియించె నరపు,
మరలకామందు దగ్గర కేగినపుడు
కన్నీరు చెక్కుల గారినజాడ.
ఆగులాముని రహస్యము వెల్లడించె!
సంతుష్ట వదనుండు సజ్జనప్రియుడు
అడిగె "నీకన్నీటి కగు హేతువేది?
యెవ్వని దౌర్జన్య మిట్లింతచేసె?"
అనవిని బానిస మనవి యొనర్చె
"ఈవృద్ధ దౌర్భాగ్య హీనత్వమరసి

యంతరంగంబెంతొ యదవద యయ్యె,
ఉంటి మున్నాతని యొద్దబానిసగ,
ధనధాన్య సామగ్రి తరుగకయుండె;
గౌరవహస్తంబు కడు వెన్కబడగ
ద్వారాలకడ జూపె యాజ్ఞాకరంబు
అందుకు కామందు హసియించి పల్కె:
"అన్యాయమని దీని ననకు కుమార,
భ్రమియించు కాలచక్రంబు మూలమున
దౌర్జన్య ఘర్షణ తగుల దెవ్వరికి,
గర్వించి తలయెత్తి గగనంబు గన్న
వణిజుడీ దురదృష్టవంతుడు గాడె?
ఆనాడు ద్వారంబు నందుండి వెడల
నెట్టించిన బికారి నేనౌదునోయి,
నాకన్నులెదుటనే యీ కాలచక్ర
మతని గొప్పతనంబు పతితంబుచేసె,
తరువాత గగనంబు దయజూచి నన్ను
మొగమున ఫెతదుమ్ము మొదలంట గడిగె;
సకల సద్గుణమూర్తి సర్వేశ్వరుండు
తనజ్ఞానమున నొక్క ద్వారంబు మూయ
దయతోడ వేరొక్క ద్వారంబు తెరచు,
బత్తెంబు దొరకక పలవించు జనులు
చాలమట్టుకు తాము సంతృప్తి గనిరి,

ధనికుల పనిపాట్లు తలక్రిందులయ్యె,

## షిబ్లీ భూతదయ

సత్ప్రవర్తనము సౌజన్యంబు గలుగు
మనుజుడవగు దేని వినుము సజ్జనుల
కుండెడు గుణముల నొకగొప్ప గుణము,
గోదుమంగడి, గోనె గోదుమల్వొలిచి
భుజముపై నిడికొని పోయెను 'షిబ్లి',
గ్రామంబునకు, నింటరాశి బోయంగ,
కనిపెట్టె నాతడు, కడగండ్లు పడుచు
ఆశ్చర్య ముగ్ధమై యన్నిదిక్కులకు
చిడిముడి పరుగెత్తు చీమనొక్కటిని
దాని యిక్కటులపై దయగల్గి యతడు
నెమ్మదిగా రేయి నిద్రపోకుండె,
దానిని మరల స్వస్థానంబు చేర్చి
యిటుల వచించె నా హితకారి 'షిబ్లి'
''పాప! మీచీమ స్వస్థలినుండి వేరు
పరచుట యది మానవత్వంబెనాకు?''
శాంతి చేకూర్చు భగ్నాంత రంగులకు
కాలచక్రము నిన్ను కనికరింపంగ,
మున్ను పవిత్ర జన్మండు ఫిర్దౌసి
అతని గోరీపైని యలరును గాత.

శాంతి కారుణ్యంబు సర్వకాలంబు.
ఎంత చక్కగ బల్కె నీ సత్యసూక్తి
గొనకొని ధాన్యంబు గొనిపోవు చీమ
కస్తి పెట్టకు, దానగలదు ప్రాణంబు,
మరి ప్రాణమెంతయు మధురంబు గాదె!
చీమ డెందంబైన చెడగోరు నతడు
చెడుగందు పాషాణ చిత్తుడై యుండు,
బలహీనుల శిరంబు పయిమొత్త బోకు
వశుడవై యొకనాడు వారి పాదముల
క్రింద చీమవిధాన క్రమందెద వేమొ!
తలపదు దయతోడ శలభంపు స్థితిని
జ్వైనపు దీపంబు, మరిదాని గనుము!
సభమధ్య నిలుచుండి, శ్రమలను నోర్చి,
కన్నీరు గార్చుచు గడకు నశించె,
అంగీకరింతు నోయాప్త, నీకన్న
నెందరో దుర్బలు లుందురన్ మాట,
కాని నీకంటెను ఘనులైనవారు
చివర కుండెదరని చెప్పెదనేను.

## ఔదార్య ఫలితము

దయచూపి పోషింప దగును కుమార,
మానవుండౌదార్య మహిమకు జిక్కు,

పలుమృగంబులు కట్లబడి లొంగిపోవు,
దాతృత్వ సూత్రబంధమున నీశత్రు
కంఠంబు బిగియించు, కరవాలకైన
ఆయుచ్చు దెగగోయ నలవియేగాదు,
నీయందుపగవాడు నెనరు పేరీవి
గన, వానియెదమల్లి జనియింప దీర్ష్య,
చెడ్డచేయకు, మంచి స్నేహితుండైన
ఎగ్గుసేయగవచ్చు నెపుడేని నీకు,
చెడ్డవిత్తిన, మంచి చేకొనంగలదె!
కఠినంబుగా మిత్రు గర్హింతువేని
నీమొగంబునుజూడ నేరడాతండు!
కామందు పగరపై కరుణవహింప
అచిరకాలములోన నతడాప్తుడగును.

## కారుణ్యమువలన హృదయములను బందిచేయుట.

ఒకనాడు నాదారి, యువకుడొక్కండు,
వెనువెంటనొక గొఱ్ఱెపిల్ల దాడెత్త
వచ్చెనాముందుకు, వానితోనంటి
"ఈతాడుమెడబంద మీరీతిదీవి
పడుగెత్త జేసెనీ పదములవెంట,"
అనవిని వాడప్పుడా మెడపట్టు
గొలుసును వదలించె, గొఱ్ఱెయట్టిటుల

గంతులు వేయుచు కదలె మున్నట్లు
వానిచేతులలోని పచ్చియాకులును
యవలు మెక్కిన చనవలరుట కతన,
ఆటలు చాలించి యాగొర్రె, వాని
వెనుక చేరిన యప్పు ననుగాంచి పలికె,
యువకుండు "ఓపండితోత్తమా, వినుము
నావెంట దానిని నడిపించు సాధ
నము త్రాడుగాదని నమ్ము కామంచు,
కరుణయేదానికి కంఠపాశంబు,
దయచూప దుర్దమ దంతావళంబు
మావటి వానితో మారొకనబోదు,
పెద్దవారలనైన పేదలనైన
ఆదరింపు, మకేల యన్న కుక్కరము
కబళంబు పడవేయ కావలికాచు.
రెన్నాళ్ళు నాల్కపై వెన్నను చరుము
వానిని పండ్లతో పట్టదు చిఱుత

## కాలుసేతులు లేని నక్క, దరి జేసి

కాలుసేతులులేని కరిన దుర్దశను
ఉన్న నక్కనుగాంచె నొక దరిజేసి ,
సర్వేశ్వరుని కృప, సకల సృష్టియును
అతని నాశ్చర్య మగ్నాత్మని జేయ

తనలోన నీరీతి దలపోసికొనియె
"ఎట్టుల కడముట్ట నీదు జీవితము!
పాణిపాద విహీనమైన సృగాల
మాహార మే యుపాయమున నార్జించు?
అని పిచ్చిపట్టిన యట్టుల చీకాకు
పడుచుండ నప్పుడే వ్యాఘ్ర మొక్కండు
నక్కను చంపి యా ప్రక్కకు దెచ్చె,
పులియా సృగాలపు బొలయారగింప,
భుక్త శేషము నిది భుజియించి తనిసె,
మరునాడు నిట్టులే జరిగె నంతయును,
సకల పోషకుడైన సర్వేశ్వరుండు
తడయక చేకూర్చె దాని బత్తెంబు,
కడకు సత్యము వాని కన్నుల దెరచె,
చనియె నింటికి, రక్షకుని ఈవి యందు
నతడు విశ్వాసంబు నత్యంత మిడియె,
"ఒక మూల గూర్చుండు నికమీద నేను
చీమయట్లు, గజంబు సేయు భోజనము.
బలముపై నాధారపడియుండబోదు,"
గడ్డంబు మెడపట్ట కడుపి యోచించె
దీనపోషకుడా యదృశ్య భాండార
మునునుండి పంపించు దినబత్తెమంచు,
అన్యుడైనను నెయ్యుడైన నవ్వాని
గతియేమియని శ్రద్ధగన్నవారరుదు,

బడుగు వారిన వాని యొడల చర్మంబు
ధమను లెమ్ములు దప్ప తరిగె నన్నియును,
తనువు దుర్బలమయి తాల్మి నశింప
వినవచ్చెను మసీదు ఘనతోరణంబు
కుడ్యంబు కడనుండి కొన్ని వాక్యములు
''వంచితుడా, లెమ్ము, బయలేగ బొమ్ము,
భీకర వ్యాఘ్రంబు విధముగా గమ్ము,
కాలుసేతులు చచ్చి కదల మెదలక
యుండునక్కవటంచు నూహాసల్పకుము,
పులికట్లు నీకును భుక్తశేషంబు
మిగులు చందంబున దగు పాటుపడుము,
ఏల యశక్త సృగాలము పులికి
ఋణవడ్డయట్లు నీవును వంగి బ్రతుక?
పులికట్లు కంఠంబు బలిసినవాడు
వంచకంబు విధాన పరభృతుడైన,
వానికంటెను కుక్క వరమనవచ్చు,
ఇంత సంపాదించు, మితరులగూడి
పరువుగా భుజియింపు, పరుల యెంగిలికి
ఆరుమూడైనను నాసచేయకుము,
చేతనైనంత నీ చేతుల కష్ట
ఫలమును మెసవుట పరమసమ్మతము,
ఫలితంబు యత్నంబు కొలది ప్రాప్తించు,

ఇలలోన ధీమంతు లిక్కట్లు పడియు
పరుల సౌఖ్యమునకై పనిసేయుచుంద్రు,
ఆడంగి రేకుల యంబేద యన్న
పరుల సంపాద్యంబు ప్రాపుగా బ్రతుక,
నీతిమంతుడవేని నీవుపోపొమ్ము,
పతితుని చేబట్టి పైకెత్తగడగు,
నీవె ముందుకు బడి, లేవనెత్తంగ
పరులను పిలువకు పరిహాసమగును,
ఎవ్వని యునికిచే నీప్రజాగణము
సౌఖ్యంబు నొందునో సతమట్టివాని
కీశ్వరుడు ననుగ్రహించు లాభములు
తలలోన మెదడున్న ధన్యమానవులు
ఔదార్య మెవ్వేళ నభ్యసించెదరు.
అధమాశయులు డొల్లయా విత్తనములు,
దైవప్రజకు మంచి గావించువారి
కిహపరంబుల రెంట నెసగు సౌఖ్యంబు.

## లోభియైన దరివేసి

పరమ సుజ్ఞాని సద్వంశ సంభవుడు,
ధర్మమార్గచరుండు దనరు తుర్కీని
అని జనులనుకోగ వినియుంటి మున్ను,
ఆ ప్రాంతమున బోవునప్పుడు బాట
సారులు కొందరె డారి త్రిమ్మరులు

నేనునుంగలసి యవ్వాని దర్శింప
నేగితి మాతని యిల్లువెల్లరసి,
ఆతడు మారాక కతెగ హర్షించి
ప్రతియొక్కనిని పాల ఫలకంబు కనుల
చేతులు ముద్దిడి ప్రీతిచూపించి.
గురుభావమున మమ్ము కూర్చుండబెట్టె,
యవ్వాల నాతండు నాసీనుడయ్యె,
ధనము పంటపొలాలు తగిన సామగ్రి
గలదాతనికి, సేవకులు చాలమంది,
ఇట్లయ్యు ఫలహీన వృక్షంబుపోల్కి
నౌదార్య మేమూలనైన లేకుండె,
మంచి మాటలయందు మర్యాదయందు
మొగమున నుత్సాహమును జూపుగాని
తక్కసంగతులందు దరిగె నుష్ణంబు,
వంటచేయించిన పాపానబోడు,
సర్వేశు ప్రార్థించి జపమాలద్రిప్ప
నతనికి మాకన్న నాకటిమంట
కడుపుగాల్చుచునుంట కన్నులకొక్క
నిమిషమైనను రేయి నిద్దురరాదు;
ప్రత్యూషంబున లేచి ద్వారంబు తెరచి
నడుము బిగించి, నిన్నటి చందముగనె
మర్యాద వినయంబు మంచితనంబు

మరల ప్రారంభించె మాకు కామందు.
మాలోన నొకడుండె మధురస్వభావు
డతి చమత్కార హాస్య ప్రవీణుండు
బాటసారి యతండు పలికెనీరీతి
తీసి చుక్కలు చేర్చి ♦ "బూసా" ను నిడుము,
ఉత్తబూసాకంటె నుచితంబు * "తూష"
దరి జేసి జనుల క్షుత్తాపంబు దీర్ప.
సేవించుకొరకు నాచెప్పులంటకుము
తినబెట్టుదొట్టె, నావెనుక నొదలను
చెప్పుతో గొట్టుము, చెడుపేమి లేదు,
జనులన్న దానంబు నొనరించి యధికు
లగుదురు, మృతచిత్తులయి రాత్రి నిద్ర
మేల్కని నంతనే మేలు లభించు?
అలతారతారి కావలికానిగూర్చి
యనుభవమున్నది యంతింతొ నాకు,
ఎడదచచ్చియు వాని కేరాత్రియైన
అక్షులు నిర్నిద్రమైచూచుచుండు,
ఆకటిమంట చల్లార్చుటకంటె
మానవత్వము నీవి మరియొండు లేదు,
పనికమాలినమాట భాషించువాడు
తనలోన శూన్యమా తబలాను బోలు!
తాను సత్యాన్వేషియైన నరుండె

♦ బూసా — ముద్దు * తూష —ఆహారము

నాకంబునకుబోవు నంత్యదినాన,
యాథార్థ్యమున్న నీహాక్కు ఫలించు
మరియు, చేతలులేని మాటలుచూడ
పుచ్చిన గుంజను పోటియిడ్డట్లు.

## హాతీము త్యాగమును
## తుర్కి సుల్తాను పరీక్షించుట

హాతీముతాయి రాజ్యంబేలునపుడు
రాజు గుఱ్ఱపుమంద రాణించుచుండె
వాయువేగము ధూమవర్ణంబు గలిగి
యురుమట్లు సకలించు నొక్క వాహనము,
అది మున్ను వినియుంటి నద్దానిశక్తి,
కొండలం గోనల గురిపించుచుండె
వడిగండ్ల జడిస్వారి వెడలిన యపుడు,
వాసంత జలదంబు వచ్చెనో యనగ,
గాఢ ప్రవాహ వేగమున హయంబు
బయలెల్ల గ్రుమ్మర పవనంబు, దుమ్ము
వలె వెన్కబడియుండు పరుగింటలేక
అవని వార్త లెఱుంగు నాస్థాన జనులు
వినిచిరి హాతీము వృత్తాంతమిట్లు
తురికి సుల్తాను కచ్చెరువు జనింప
ఈవిలో నాతని కీడులేదెవడు,

జవమున వాని యశ్వము మించుదాని
గాలించి వెదకిన గనజాలమెందు,
కడలి నోడ విధాన కడుశీఘ్రగతిని
బయలలో దాడెత్తు పైపక్షిగూడ
దానిపై నెగురు సత్వము లేకయుండు,
ననిచెప్ప మంత్రినిగని షాహియనియె
సాక్ష్యంబులేని యీ సన్నుతియెల్ల
సిగ్గుచేటగుగాన, చేసెదనిట్లు
హాతీముతాయిని నడుగ పుత్తెంతు
ఆయుత్తమాశ్వంబు నర్పింపుమంచు,
నాతడునాకోర్కె నటులాదరించి
గౌరవంబుగ ఘోటకము పంపునేని
అతనియౌదార్య మత్యధికమంచెంతు,
అటుగాక హయమునియ్యక యడ్డుచెప్ప
వానికీరితి డోలువలె లోనరిత్తు!
దూతనుపంపించె తురికీసవాబు
మతిమంతుబదిమంది మనుజులతోడ
తనకోర్కెతాయికి వినిపించుకొరకు,
అవనియెల్లను చచ్చినటు వెండియుండె
కందములందుకై కన్నీరునించె,
చల్లగా వీచెడు పిల్లతెమ్మెరలు
మరలపూరించెను మహికిప్రాణంబు,

అనుచరుల్ దూతయు హాతీముతాయి
వసతినిప్రాపించి వారూరడిలిరి
'జిందా' తరంగిణి యందునీరాని
హాయినొందు తృషార్తుడౌ పాంథునట్లు;
వాజిని వధియించి వండించిపెట్టి,
పల్లెరంబులనిడి, పలుమిరాయీల
వడ్డించి, చేతుల బంగారునిడియె
నతిథిసత్కృతి మించుహాతీముతాయి;
ఆరేయినచ్చోట నతిథులైయుండి
మరునాడు దూతండు మనవియొనర్చి
దనకుదెలిసినయంత తనసాహికోర్కె,
ఆమాటవినితాయి యార్తితోనొగిలి,
మత్తెక్కినవిధాన చిత్తంబుసడలి,
కటకటపడివ్రేలు కరచియిట్లనియె
"ఓబుద్ధిమంతుడా, యొకమాటయేని
యేలచెప్పవునాకు నింతకుమున్ను?
గాలిజవంబును గలిగి 'దుల్దులు' ను
బోలిన యాయశ్వమును మీకునిన్న
వధముచేసికబాబు వండించినాడ,
వర్షించివెల్లువ పారుచుండుటను
ఇంకెట్టిమార్గంబు మృగ్యంబుగాము
అదిదప్పనాయింట హయమొండులేమి

ఆతిథ్యమొనరక యతిథినావసతి
హృదయతాపంబున నిదురపోవంగ
నామానవత్వంబునకు మచ్చయౌట,
ఈప్రపంచమున నాకెసగుప్రఖ్యాతి
వలితికానివిధాన దలచి, మామంద
నంతపేరెల్లిన యశ్వమింకొకటె
గన నసాధ్యంబని వినియుండికూడ,
ఆవశ్యకంబయ్యె హాయముగోల్పోవ,
కొందరకు ధనంబు కోరినట్లిచ్చె,
వారువంబులు గౌరవములు చేకూర్చె,
పుట్టుకతోవచ్చు పుణ్యావర్తనము
వ్యాపారమటుమధ్య నార్జింపలేము.
హాతీముతాయి సత్త్యాగవృత్తాంత
మంతతుర్కీయందు నందరువినగ,
వానిపై వేయి దీవనలువర్షించె,
హాతీము కథను శతాంశంబె వినియు
తృప్తిచెందకుము నీకీకథకంటె
వరమైన కథయొండు వచియింతు వినుము.

## హాతీముతాయిని "యమను" పాదుషా పరీక్షించుట

ఎవరుచెప్పిరోగాని యీకథనాకు

మరచితి, యమనులో నరపాలుడొకడు
రాజ్యమేలుచునుండె ప్రజసంతసింప,
దానమిచ్చుటలోన తనతోసముండు
గానరాడని పేరు గాంచియుండుటను
గొప్పవారలనుండి గొనె భాగ్యకందు
కము, వానినౌదార్య ఘనమని నుడువు,
హేతువేమన వాని చేతిలోనుండి
పసిడి, దేరంబులు వర్షించుచుండు,
ఎవ్వడైనను వాని యెదుట హాతీము
మాట యెత్తిండీర్ష్య మట్లాడునంచు,
"ఎంతదాక ప్రలాప మిటువానిగూర్చి?
గాలితిత్తి యతండు, కాసుశూన్యంబు,
క్ష్మాపాలనము నధికారంబు సున్న,
అట్లయ్యువాడు రాజార్హమావిందు
పెట్టియందరకు సంప్రీతిగావించె
అనినేను వినియుంటి, నచ్చెరువయ్యె,
హాతీమువర్ణనా ద్వారంబు దెరచె
నొకడు, వేరొక్కడు నుత్సాహ మొదవ,
వాని ప్రశంసింప బూనెనగ్గలిక,
వారి పొగడ్తల వలనరాజునకు
నెదలోన జెలరేగె నీర్ష్యానలంబు,
"హాతీము నాకాలమందు జీవింప

నా ప్రతిష్ఠకు పెల్లు నష్టంబువచ్చు,
అని యొక్క యువకుని, నతని చంపింప
పదిగ నియోగించి పంపించె నృపుడు,
ఆ దుష్టు డంతట హాతీముతాయి
వసియించు చోటి త్రోవను పోవుచుండె,
తత్త్యాగధనుని రక్తము తీయుకొరకు,
దారిలో నొక్కఁడు తరుణుండువచ్చి
నెయ్యంపు నెత్తావి నింపుచు వాని
సంధించె, నవ్వుండు సర్వ ప్రియుండు,
మధురభాషి, ప్రసన్న మంజుల ముఖుడు,
పండితు డవ్వాని ప్రార్థించి, రాత్రి
తనయింట నాతిథ్యమును నీయదొడగె,
దయయు సహానుభూతియు గ్రుమ్మరించె,
మఱియు లోపంబులు మన్నింప వేడె,
దుష్టచింతను మతి దురితంబులెల్ల
మంచిసేవ యొనర్చి మారిచివైచె,
వేగుప్రొద్దున నిద్రవిడిచి, చుంబించె
నతిథి కాల్ సేతుల నతిగౌరవముగ,
ఇట్లనె మిత్రమా, యిట కొన్నినాళ్ళు
హాయిగానుండుమ యరవాయిలేక,
అనవిని దుష్టచింతనుడు వచించె

ఇపుడు నావల్లగాదిచట వచింప,
ముఖ్యకార్యము నాకు ముందున్న దింక,
అన విని యువకుండు ననియె నీరీతి
"అంతస్థమగు నీ రహస్యంబు తెలుపు,
ఏకహృదయులౌ సుహృదుల చందమున
సప్రయత్నంబుగ సాధింతు పనిని,
"ఓ యుగారుడ, చెవియొగ్గుము నాకు,
గొప్పవారికి నెట్టి గోపనీయంబు
తెలిపిన నావార్త వెలిపుచ్చబోరు
ఈ ప్రాంతముల నీవు నెరిగియేయుందు
వొక నీతిమంతుని నకలంక కీర్తి
హాతీము నాముని నర్థికల్పకుని,
యమను నృపాలకుండాతని శిరము
కొనిరమ్మనియని నన్ను పనిచె నియ్యెడకు;
ఎట్టె ద్వేషము వాని హృదయంబునందు
కళవళ పెట్టెనో కనుగొనలేను,
హాతీముతాయి గృహంబు దగ్గఱకు
దారిచూపుదువేని, తత్సహాయత్వ
మాశింతు నీ దయ కానవాలట్లు,
హాతిము నవ్వి యిట్లనియె "నోమిత్ర,
అరరె! నేనేనోయి హాతీముతాయి!
వెదుకవచ్చినతీవ ప్రేళ్లంటుకొనియె!

ఖండించు నామెడ కరవాలుపూని,
పగటికై వేచుట భావ్యంబుగాదు,
అంతరాయములెన్నో యడ్డంబువచ్చు,
నీమనోరథమును నెరవేర్చుకొమ్ము,
హాతీము నిశ్చింత నరుతజాపంగ
దుష్టచింతను డార్తితో లోననుండి
వేడినిట్టూరుపు వెడలించి మూర్ఛ,
దుమ్ములో పొరలాడె, క్రమ్మర లేచె,
నొకతూరిభూమి, వేరొకమారు తాయి
పాణిపాదంబుల పడి ముద్దుపెట్టె,
కరముననున్న ఖడ్గము నేలవిసరె,
అమ్ములపొది విప్పి యల్లంతవైచె,
బానిసవలె రొమ్ము పయిచేతులుంచి,
"అలతి గులాబితో నైననీమేను
నంట, ధీరులభావమందు నేపురుష
తుల్యుడుగా నొక్క తొయ్యలిగాసి,
అని యిట్లువచియించి, హాతీముతాయి
కన్నుల ముద్దిడి, కౌగిటంబొదవి
యవ్వలపయనించె యమును మార్గమున,
పాదుషా వచ్చినవాని మొగంబు
పరికించి, తనపని పాడాయెనంచు
తక్షణమ్మె ఘొరింగి తానిట్లు పలికె

‘‘రమ్మ చెప్పుము యుదంతమ్మ, నేమాయె?
హాతీము శిరమేది? అదిగానరాదు!
ఒకవేళ ప్రథితుండు యుద్ధంబుసేయ.
బలము క్షీణించుట పారివచ్చితివా?’’
భూమిని ముద్దిడి బుద్ధిమంతుండు
షాహి ప్రశంసించి సమ్మానమొసగి,
వచియించె నిట్లు ‘‘భూపాల సత్తముడ.
న్యాయతత్పరుడవౌ నరనాథమౌళి,
వినుము హాతీంతాయి వృత్తాంతమెల్ల,
ఆతని కనుగొంటె, నతియశోధనుడు,
సూక్ష్మబుద్ధి, హితుండు, సుఖదర్శనుండు,
రమణీయమూర్తి, త్యాగమునందు మిన్న
బుద్ధిమంతుడు, నిజభుజ శౌర్యమందు
ఘనుడు నాకంటెను, కరుణామయుండు,
వాని కారుణ్యంబు వంచెనావీపు,
ఔదార్యకరవాల మసువులంగొనియె,
అనివాడు చూచిన యతని కృత్యములు
వర్ణింప, పాదుషా పరమసంతుష్టి
తాయివంశమువారి తగప్రస్తుతించె,
దాతయన్ విఖ్యాతి తాయికేచెల్లు
నని నిర్ణయించి వానిని తృప్తిపరుప
పసిడి దేరంబులు బహుమానమిచ్చె:

అతడు చెప్పినదెల్ల హాతీముతాయి
కృత్యంబులకు సాక్ష్యమిచ్చుటం జేసి
జనుల నానుడియును సత్యమియ్యెడల
నేకమాటయు న్యాయమేననవచ్చు.

## హాతీముతాయి పుత్రి

వింటె, ప్రవక్త జీవించుకాలమున
తాయివంశమువారు 'ధర్మశాసనము
నంగీకరింపక వ్యతిరేకులగుట,
అంత ప్రవక్త సైన్యము సిద్ధపరచి
వారి నిర్బంధించి పట్ట పంపించె,
వారిలో కొందర బలవంతపరచి
గుదికట్లు కట్టించి కొనివచ్చిరటకు,
"దైవభీతి యొకింత తనరదు వారి
మతమన్న కల్మష పతితంబ"టంచు
నాజ్ఞవెట్టె ప్రవక్త "యా తెగవారి
ద్వేషఖడ్గముపూని తెగవేయు"డంచు,
ఆసంఘముననున్న యతివ యొకర్తు
ఇట్టుల మొరపెట్టె "ఏను హాతీము
తాయి కూతురను, నా ధర్మపాలకుని
మిగుల నర్థించుచు మీరు నాకొరకు,
కారుణ్యమునుచూపి కాచి రక్షించు

డీ యనాధకుమారి, నేలందు రేని
మాతండ్రి హాతీము మహితవదాన్యు
డనికీర్తిగడియించె", ఆప్రార్థనంబు
పైగంబరాలించి, పైదలికాలు
సేతులందొడిగ శృంఖలంబులను
విప్పనల్లుగనాజ్ఞ పెట్టెతక్షణమె,
మిగిలిన కొందర తగరులపోల్కి
నిర్దయంబుగ కంఠ నిర్దళనంబు
పొనరింప, రక్తంబు పూరమైపారె,
ఈవధగనుచున్న యింతి దుఃఖమున
కటికవానినిగాంచి యిటువేడికొనియె
"ననుగూడ వారితోడనె సంహరింపు,
బంధుమిత్రులునింక బద్ధులైయుండ
ఏనొక్క తెనుమాత్ర మిట్లువిముక్తి
మనగోరనదియేమి మానవత్వంబు?"
తా తాయివంశసంతానంబుగూర్చి
ఆర్తినాదముసేయ నాయంగలార్పు
వినబడియె ప్రవక్త వీనులకపుడు,
"అసలునిర్మలమైన, నటతప్పరాదు"
అనితక్కువారల కనికరంబెసగ
బంధముక్తుల సల్పి పంపె ప్రవక్త

# హాతీముతాయి చక్కెర మూటను దానమిచ్చుట

హాతీము కొట్టడి నర్థించె నొకడు
పదిదేరములయెత్తు పటిక బెల్లంబు,
కథకుడు చెప్పిన కథయిట్టులుండె
నని జ్ఞప్తియున్నది హాతీముతాయి
వాని వెంటను పంపె గోనె చక్కెరను,
ఇల్లాలు నిటుపల్కె నింటిలోనుండి
ఏమి నీ తాత్పర్య మిట్లిచ్చిపంప ?
పదిదేరముల యెత్తె వాడుకోరినది!
ఆ మాట విని తాయి యతివనుగాంచి
యిటులు ప్రత్యుత్తరమిచ్చె నవ్వుచును
అక్కరకొలది వాడర్థించెనన్న,
నిజవదాన్యతకొద్ది నేనిచ్చినాడ,
హాతీము బోలిన త్యాగతత్పరుని
కాలచంక్రమణంబు గన నింతవరకు
పుడమి వేఱొక్కని పుట్టింపలేను ,
అబుబకర్ సాదు భూవాగ్రణి నేడు
దానహస్తము చాపి త్యాగంబుచూపి
మొనసి యర్థులనోళ్ళు మూయించినాడు,
రైతు రక్షకుడ, నీ రాజ్యంబు హృదయ

మెపుడు సంతుష్టనై యెసగునుగాత!
ముస్లీముమతము నీ మొనపునంజేసి
అభివృద్ధినొందుత యరవాయి లేక!
తలయెత్తె నీన్యాయ ధర్మంబు కలిమి
భాగ్యవంతంబైన పారసిభూళి
తిరిగి యూనాన్ రూము దేశమ్ములందు;
తలయెత్తకుండిన దానయశంబు
తాయి పేరెవ్వరు తలపోయబోరు,
అతని సత్కీర్తి యలరె గ్రంధముల,
మీ ప్రశంసయుగూడ మించె కావ్యముల
హాతీము లౌకిక యశము వాంఛించె,
మీరు దైవప్రీతి కారణంబుగను
ఉత్తమ కార్యంబు లొనరించినారు,
దరిచేసికిని లేదు తా దెచ్చుకొన్న
తలభారమేదియు, సలహానుగోర
ఈవాక్యమునకంటె నితరంబు లేదు;
నీశక్తి యున్నంత నెరవేర్పు మేలు,
నీవెన్క నిలుచును నీమంచిపనులు,
పాదియవ్వాలనిల్పు సదుప దేశములు.

## పాదుషాల క్షమ

ఒక్కని గాడిద యూబిలోకుప్రింగె,

కోపంబు శోకంబు గూడి యవ్వాని
యుల్లంబు నెత్తురు లోలికించుచుండె,
ముందుచూడ నెడారి, మొగులు వర్షించె,
చలిపుట్టి వెల్లువ సమకొనిపారె,
తిమిరంబు కొంగును దిక్కులంగప్పె,
రాత్రియంతయు ప్రొద్దు రాజిల్లువరకు
పడరాని బాధలుపడి, కోపభరము
వెలిపుచ్చ శపియించు. వెడమాటలాడు
నోటికివచ్చిన నుడులు దుర్భాష
లడ్డమాకయు లేక యతడు సడించు,
తనవారు పగవారలను మాటలేక
కడకు రాజ్యంబేలు పుడమిరేడైన
యతని నాల్కకు గురియైరి యందరును,
విధివశంబున లోక విదితయశుండు
ఆప్రాంతముల నేలు నధిపతి వేట
పట్టున బసచేసి బంతికోలాట
యాడుచుండెను, వాని యహిత భాషణము
వినునంత సహనంబు, విని జవాబిచ్చు
దారిదోపకయుండె తడవు నృపుండు.
దగ్గరి భృత్యుల సిగ్గునంగాంచి
"నాపయి వానికిం గోపమింతేల?
అని రాజు ప్రశ్నింప, నచ్చటనొకడు

"పాహి ఖండింపు మీ జాల్మ్ముని శిరము,
అమ్మనాలిని జోకె నతడెల్ల జనుల,"
నిండు నెనరు వహించి నికటంబు చేరి,
వాని యిక్కట్టులు, వాని గార్దభము
పంకనిమగ్నమై పడియుంటచూచి
ధారాళ హృదయుండు ధరణీ ధవుండు
వాని దుర్భాషల వలని రోషంబు
దిగ్రమింగి లోలోన, దీను క్షమించె,
ఉన్న చొక్కాయిని నొక్క యశ్వంబు
నంచి బంగారిచ్చి సంతృప్తి పరచె,
ఒక్కడిట్లు వచించె ఓ మందబుద్ధి
వృద్ధుడా, నీవధ వింతగా దప్పె?
ఆమాట విని యాతడనియె "ఖమూషు"
నా దురదృష్టంబునకు నంగలార్ప
భూమీశు దాతృత్వమునకు నీడట్లు
నను బహుమానించి యంపియేయుండు,
కీడునకు కీడు క్రమ్మర
సూడున నొనరించుటెల్ల సులభంబెయగుఁ,
కీడునకు మేలు చేసెడు
వాడే యుత్తముడు, దాత, వచియింతునిటుఁ.

# పుణ్యాత్ముడైన దరిబేసి, నీచుడైన భాగ్యవంతుడు

గర్వితు డొక్కం డు గరువంపు మత్తు
తలకెక్క, యాచకు ద్వారంబుమూసి
వెడలించె నిల్లని వినియుంటి మున్ను,
బడలి వాడొకమూల భగ్నాశుడగుచు
కూర్చుండి యుల్లంబు కుమిలి పోవంగ
వేడినిట్టూర్పుల వెడలించుచుండె,
మూతకన్నుల గ్రుడ్డి ముదుక యొకండు
ఆ దారి వచ్చుచు నతని నిట్టూర్పు
టలికిడి విని యిట్టులనియె "నోమిత్ర,
ద్వేషతాపం బింత వెలిచిమ్మనేల?"
అనవిని భిక్షుకుండాలించి వాని,
దుమ్ములో పడియుండి క్రమ్మ కన్నీరు,
తన యెడందను వాని దౌర్జన్యమెట్లు
కసిగాట్లుపెట్టె, నా కథయెల్ల చెప్పె,
"దుఃఖంబు నోర్పుతో తొలగించుమోయి,
యీరాత్రి మాయింటి కేగి నాతోడ
పొనరినంతకు నీవు భుజియించి పొమ్ము"
అని యూరడించి, వానిని మెడపట్టి
యొడిసిపట్టి గృహంబు నెడకు కొంపోయి

పళ్లెరంబును పెట్టె వాని ముంగలను,
దరిచేసిదీప్త చేతస్కుండు తనివి
దీర భుజించి సంతృప్తిని గాంచె,
"దృష్టినీకిచ్చుత దేవుండు మరల"
ననుచు నాపుణ్యాత్ము డాశీర్వదించె;
ఆరాత్రియే కొన్ని యశ్రుబిందువులు
కన్నురెప్పల సందు కారె, ప్రొద్దునను
కనులెత్తి లోకంబు గనెవింత దోప;
"అంధుడొక్కడు నిన్న యక్షులంగెరచె"
నను కింవదంతులు వ్యాపించె వీట,
ఆభిక్షుకుని నెవ్వ డతినిష్ఠురముగ
వనటగుందగ బల్కి పంపించినాడో
అట్టి పాషాణాత్ము డావార్త వినియె,
కనులువచ్చిన వాని గని యొక్కనాడు
ఇట్లనె వర్తకుం "డెంతయచ్చెరువు,
ఈకష్టసాధ్యమౌ కృత్యంబు నీకు
నెట్లు సులభమయ్యె? ఎవ్వరీ రీతి
విశ్వదీపకవర్తి వెలిగించినారు?
వచియింపుమ యదృష్ట వంతుడా", యనిన,
"హతభాగ్య, దార్జన్య తావిష్టహృదయ,
హ్రస్వదృష్టివి, తీక్ష్ణమౌ బుద్ధిసున్న,
దాన, హుమాపక్షి దరిజేరనీక

గూబ సాంగత్యంబు కోరియున్నావు,
ఎవని మోమున నీవు నెదకుంచునట్లు
తలుపు మూసితివో యాదరి బేసినాదు
మొగమునందలుపులు ముదమార దీసె,
దురిత దూరుల కాలి ధూళి ముద్దిడిన,
(వచియింతునే మానవత్వంబు పైని
శపథంబు గావించి) జ్ఞాన దీపంబు
వెలుగొందు నీచిత్తవీధి, నిశ్చయము,
భావనేత్రము మూత పడియుండువారు
ఈయంజనము మాట నెత్తరవజ్ఞ
మంద భాగ్యండైన మన వర్తకుండు
ఆతని చీవాట్లు నాలించి దుఃఖ
భరమున మునిగ్రేళ్లు పండ్లతో నొక్కె;
"నాడేగ నీయుచ్చు త్రాడులం జిక్కె
నాకు నదృష్టంబు చేకూరె గాని
దైన నీపేరునే యది యాశ్రయించె,
మూషికంబట్టుల ముని పండ్లనొక్కి
పరమలోభిత్వంబు పట్టి యున్నతని
కెట్లు కైవసమౌను నెపుడేని యణువు?

## పుణ్యాత్ముల నన్వేషించుట

విమలాత్ము కొరకీవు వెదకెదవేని
క్షణమైన మరవకు సజ్జనసేవ,
మేతవేయుచునుండు మీ బిళ్ళగువ్వ
పారావతము కైజువంటి పులులకు
నొకనాడు నీవల నురుకంగ గలదు
అల హుమాపక్షి, యీ పలుకు సత్యంబు,
కోర్కె బాణంబుల గురిపెట్టి విడువు
మన్ని దిక్కుల, నందునమ్మొక్కటైన
నేపిట్టనో తాకి హింసింపవచ్చు,
నని యాసపడవచ్చు, నంబుధిలోని
మూర్ల శుక్తులు తెచ్చి నోళ్ళు విప్పంగ
నందెందో యొకముత్య మగపడవచ్చు,
బాణంబు లొకనూరు పరపినగాని
యందొక్కటేగ గురినంటు నిక్కముగ

## బిడారులో పుత్రుని వెదకిన తండ్రి

ఒక్కని పుత్రకుం డొంటె యంబారి
పైనెను దిగివచ్చి వెడలె నెచ్చటికొ,
రాత్రియయ్యెను వాడు రాడంచు వెదకె

కంటవత్తిడుకొని కలబిడారెల్ల
ఆ కుమారుని తండ్రి యాతురంబునను,
ప్రతి గుడారంబున ప్రశ్నించుచుండె,
బాలు నన్వేషించె ప్రతి దిక్కునందు,
తన కన్ను చీకటి తలగించు దివ్వె
చిన్ని కుమారుండు చిక్కె చీకటని,
సార్థవాహుల, తండ్రి సంధించి నపుడు
ఇట్లన వినియుంటి ఎట్టుల నేను
వీనిని గనుగొన్న విధము మీకెరుకె?
ముందువచ్చెడువాని మొగము చూడక యె
వాడె నాకొడుకని వచియించుచుంటి,
హృదయపూర్వకముగ వెదకుచునుండు
భక్తుండు ప్రతివాని, వాడొక వేళ
నిజమైన పుణ్యాత్మ నెనుకెడు నాశ,
ఒక్క హృదయముకోస మోర్తురిక్కటులు,
మొనసి గులాబికై ముండ్లు సహింత్రు

## ఒంటెలశాలలో ఊడిపడిన రత్నము

రాలురప్పల నేల, రాత్రి చీకటిని,
భూపాల పుత్రుని ముకుటంబునుండి
యొక కెంపు పడిపోయె నొంటెలశాల

తనయుని ప్రశ్నించె తండ్రియీరీతి:
ఇంత చీకటిరాత్రి నెటు లెఱిఁగెదవు
రత్న మియ్యది గుల్కరాయియిదంచు?
అచ్చటి గులకరాళ్లన్నియు జవిరి
రత్నంబు పోకుండ రాశి చేయించు;
నీచ మానవులలో, నిర్మలాత్ములును
దీనాస్యు లుందురు, తిమిరంబు నందు
రాళ్లలో పడియుండు రత్నాల పోల్కి,
ప్రతి జ్ఞానహీనుని భరము వహించు
సహనంబుతో నొక్క సారి నీచేత
పడుట తటస్థించు పావనాత్ముండు,
మిత్రుని చాల ప్రేమించెడు వాడు
వైరి భారము కూడ వహియించు చుండు;
ననుమాట యెరుగవా, విని యుండలేద?
ముద్దు గులాబి తాముండ్ల హస్తముల
రేకుల నట్టుల, ప్రేయసుం డంగి
చించి చీలిక సేయు, చిత్తంబు రక్త
సిక్తమయ్యును నవ్వు సెలవులనిండ
దాడిమీఫలము బ్రద్దలు కొట్టినట్లు;
ఒక్కని ప్రేమకై తక్కుమానవుల
చింత ననుభవింపు చిత్తంబునందు.
జనుల నూర్గుర నైన సరిగ మన్నించు

మొక్కని కోఱికనై యోర్పువహించి,
హీనగర్వాలును నపేత కిల్బిషులు
దైవచింతన యందె తలపుంచువారు
వేదనా భరితులౌ వీరు నీదృష్టి
అధమ ఫకీరుల యట్లు తోచినను
అంగీకరింపకు మవ్వారి ఘనత,
దైవ దృష్టిని వారు ధన్యమానవులు,
ఎట్లు నీవు తలంప నేమి లోపంబు?
నీబుద్ధి నెవడైన నీచాత్ముడంచు
తలపోతువేని నీతరమౌనె తెలియ
అతడెంత మహనీయుడను లోతుపాతు?
ఎవనిని గని ప్రజ లింటి వాకిళ్లు
మూయుదురో యట్టి ముక్తసంగునకు
దివ్య విజ్ఞాన మందిర కవాటములు
తమయంత విడిపోవు తలపు జ్వలింప
బందిగ మౌని ప్రపంచంబు నందు,
రిక్త జీవనులు నియుక్త చేతసులు
దైవార్తి పరులు నీతలుపు నెట్టెదరు;
జ్ఞానంబు భావంబు గలదేని నీకు
అట్టి భక్తులచేయి పట్టి ముద్దిడుము,
పట్టణ బంధంబు పట్టు భేదించి
మెప్పుడో యొకనాడు నేతెంచు నిటకు

భక్తుండు, తన మహాత్వంబుచే నొరుల
తుహితులయ్యెడునట్లు మార్చగలండు;
పూలచెట్లనుగాల్చబోకు శరత్తు
నందు, వసంతంబునందు నా తరులె
పూవులాకులు పుట్టి పొలుపొందగలవు.

## పిసినారి తండ్రి, దూబరదిండి కొడుకు

ఒకడుండె పిసినారి, యొక్కప్పుడైన
కర్చుసేయను తెంపు గలుగకయుండె,
పైడికోరినయంత పడియుండె గాని
దాని ననుభవింప దగు శక్తిలేమ,
హృదయంబునకు హాయి యొదవునటంచు
తిన, డెట్టి వారికి ధనమీయ దలప
డక్కర రేపుండునని యూహసల్పి,
పవలు రేయు నతండు బంగారు వెండి
చేకూర్చు నాశకు జిక్కి దాసుడుగ,
బంగారు వెండియు పరమ లుబ్ధునకు
సంకెళ్లవలెనుండు చచ్చెడువరకు,
గూఢంబుగా దాగి కొడుకొక్కనాడు
పిసినిగొట్టు పసిండి పెట్టినచోటు
కనిపెట్టి, బంగారమును త్రవ్వితీసి,

గాలికెత్తిన యట్లు కద్బు గావించె,
పైడి యుండినచోట వాడొక్క-రాయి
పెట్టిపోయెనటంచు విని యుంటిమున్న;
యువకుని చేతిలో నున్న ధనంబు
అచిరకాలము నందె యంతయుంజెల్లె,
ఒక చేతవచ్చె, వేరొక చేత పోయె,
దుష్ప్రవర్తనుడును దూబర దిండి
వాడౌటచే తలపాగ పరాయి
తాకట్టు పెట్టె వర్తకుని యంగడిని,
తండ్రి నిరాశతో తన గొంతు క్రోవి
హస్త ద్వయంబున నటు నిటు నొక్కు-,
మెత్తకైన ముట్టడు వెతల బెగ్గిలుచు
కొమరుండు పిల్లనగ్రోవి మ్రోగించు;
జనకు డేడ్చుచు రాత్రి కనుల మూయండు,
సుతుడు రాతిరియెల్ల సుఖనిద్రగాంచి
ప్రత్యూషంబున లేచి పక పక నవ్వి
యిటు వచించెను తండ్రి, హితము చెప్పెదను,
మనకున్న బంగార మనుభవించుటకె,
లోభిత్వమున భూమిలో దాచువేని
పసిడైన రాయైన ఫలితమొక్క-టియె,
రాతిలోనుండి స్వర్ణంబు తీయుదురు,
దాని మూలంబున ధన్య మానవులు

కుడుతు రిత్తురు సుఖపడుదు రియ్యలను,
లోక సక్తుండైన లోభిహస్తమున
బద్ధమైయుండిన పసిడి, చత్రాంతి
నుండిన యదిపోలె నుపయోగపడదు;
ఆలు బిడ్డలకింట నక్కరకీక
పిసిడిపై బ్రదిమిని పెచ్చింతువేని
వారు నీచావుకు ప్రార్థించి నపుడు
కుయ్యో మొర్రోయంచు కూపెట్టబోకు,
ఏబది యడుగుల నెత్తైన యింటి
కప్పు నుండియునీవు కాల్జారి క్రింద
పడి చత్తువేని నీవారు సంతృప్తి
నాస్తి పాస్తులనెల్ల ననుభవించెదరు,
వెండి, దీనారము లుండిన లోభి
భాగ్యవంతుడు నిధి పైని నంటించు
రక్షరేఖ విధాన రాణించుచుండు,
ఆకారణమున నాయధముని డబ్బు
ఏమి తరుగకుండు నేండ్లు పూండ్లయిన,
విధియను పెనురాయి వీనియాదలను
పగులగొట్టిన యంత, వారు శాంతముగ
నాస్తిని భాగించి యనుభవించెదరు,
చీమపోలిక నీవు చేర్చిన ధనము
తినుము, గోరీయందు తిండికై వెదకు

పురవులు నీమేను బొక్క-క మున్నె,
పాది మాటలయందు సాదృశ్యములును
సమపదేశంబులు సంపాద్యమగును,
అక్క-ర కొలదినీ వభ్యసింపంగ
పనికి వచ్చును నీకు పలు కార్యములను,
ఇవి ప్రాభవమునకు హేతువులౌట
అవగణించెదవేని యతి శోచ్యమగును.

## చిన్నదానమునకు పెద్ద యుపకారము

పావులాతో పనిపడిన వృద్ధుండు
యువకుని యాచించె, నొసగె నతండు,
ముదుక కోరిక దీర ముదమానం జనియె,
ఒకనాడు యువకుండు నొప్పమి సేయ
దైవ వశంబున దండి తుండయ్యె,
వధ్యభూమికి వాని పంపె సుల్తాను,
ఆవినోదము చూడ నచ్చోటికేగి
కడ పళ్లె కడ నింటి కప్పులపైని
గస్తాలనిండుగ ప్రజ గుంపుగూడె,
రాచబంటు లొనద్చ రాక పోకలును
జనుల కోలాహలంబును హెచ్చుచుండె
ఆప్రజాసమ్మర్ద మందు వృద్ధుండు

కనుగొనె యువకుని, జనులచే చిక్కి
బద్ధుడై విలపింప బలుదీనదశను,
దుర దృష్టవంతుని దుఃస్థితిగాంచి
దరిజేసి హృదయంబు పరితప్తమయ్యె
తన పైని యువకుండు దయచూపి యుంట,
"పాదుషా మడిసె, ప్రపంచంబు నిలిచె,
తన సుస్వభావంబు తనతోడ గొనియె,"
నని తన హస్తంబులను నల్పుకొనుచు
నంగలార్చె నతండు నందరు వినగ,
విచ్చుకత్తులబంట్లు వినిరి యావార్త,
మొగము మూపుశిరంబు వగమొత్తుకొనుచు
భటులు శోకరవంబు పరపిరొక్కటిగ,
సరగ పదాజులు పాహియాస్థాని
కతిరయంబున నేగి యాసింహాపీఠి
నిండుకొలు వుండిన నృపుని గన్గొనిరి,
నందడి సమయంబు నందు బద్ధుండు
తప్పించుకొనె కనుల్ గప్పి యందరను,
యందుకై వృద్ధుని నరసి, గొంతుకను
పట్టి గద్దియముందు బంధించినారు,
తర్జించి భర్జించి దండడిపెట్టి
ప్రశ్నించె పాదుషా వాని నీరీతి

"ఏమి కారణము నామృతిని వాంఛింప?
చక్కని మార్గంబు సజ్జనత్వంబు
నాస్వభావంబున నయమొప్పుచుండు,
చెడుగేల కోరెదు చివరకు ప్రజకు?"
ధీరత్వమున నోరు తెరచి యామురుక
దరిచేసి వచియించె తడబాటు లేక
"ఓలోకశాసక" యుద్దామచరిత,
తరలె షాహియటన్న దబ్బరమాట
పలికితినే, నైన బ్రతికి యున్నారు
తమరు క్షేమముగ, నాదగ్ధచిత్తుండు
రక్షించుకొనె తన ప్రాణంబు దాన;
ఆకథవిని షాహి యాశ్చర్య మొంది
యితనికి బహుమాన మిండని చెప్పి
మరియేమి తదుపరి మాటాడకుండె,
ఇంతలో యువకుండు నెల్లదిక్కులకు
ప్రబల నిరాశా విభగ్నచిత్తమున,
పడుచు లేచుచువేగ పరుగెత్తుచుండె
నలు రాచబాటలు కలియు వద్యోర్వి
ఒకడిట్లు ప్రశ్నించె యువకుడా నీవు
ఏమి చేసితివి నీహింస తప్పింప?
చిన్న చిన్నగ వాని చెవిలోన వినిచె
యువకుండు నిట్టూర్చి, యోయివివేకి

ధైర్యవంతుండైన దరిజేసి సాయ
మొక పావులాదాన మొకటి సంధించి
బంధనంబున నుండి ప్రాణంబు కాచె,
క్షేత్రంబునను విత్తు కృషికుండు బీజ
ములు కష్టదినముల ఫలియించుకొరకు,
యవగింజ యొక్కప్పు డడచునాపదల,
పావనమూసా ప్రవక్త దండంబు
"జాజు" చంపినకథ నంతయువినవె?
మరిహదీసున నుండు మహామద్ ప్రవక్త
"దానంబు చేసిన తప్పనుకీడు"
అనిబోధ చేసిన యంశంబులెల్ల
ఎప్పుడైన నడుగిడరే నేలయందు
శత్రు, లబూబకర్ సాని పాలింప,
మురువుచిల్కెడు నీదు ముఖకాంతివలన
సంతుష్టమయ్యెను సకలలోకంబు,
జనసమూహంబును చక్క పాలించు
నీకు సంతోషంబు నిత్యమైయుండు,
ఒకరు డొక్కనినుండి యొప్పమిం గనడు
పథముతప్పక మీరు పాలించువేళ,
ముండ్లదౌర్జన్యంబు ముద్దు గులాబి
యెరుగ దెప్పుడు, మీర లిహలోకమందు
సర్వేశునకు ప్రతిచ్ఛాయలైయుంద్రు,

పైగంబరునిపోల్కి పగిమ కారుణ్య
వర్షంబు గురిపించుతు వసుధనెల్లెడల,
తమరి యోగ్యతశక్తి విమతుడొక్కండు
ఎఱుగక యుండిన నేమి దుఃఖంబు?
అట్టివాడెఱుగ బోడల "శక్తిమంత
మైనరాత్రి" ని గూడ, అజ్ఞుడతండు,

## మంచిపనికి మించిన ఫలము

కలలోన నొక్కండు గనె "సంత్యదినము"
నాటిమైదానంబు, నలు దిక్కులందు
ప్రళయ మార్తాండుని ప్రజ్వలనంబు
తపియింప చేసిన ధరణీతలంబు
క్రాచిన తామ్రంబు గతినొప్పుచుండె,
మిడుకుటెండల వారి మెదడు కరంగ
ఆకసంబును చూచి యందరు ప్రజలు
కుయ్యో మొఱ్ఱోయంచు కడిచిరిగోడు;
ఆసమూహము నందు నందరలోన
నొక్కండు విడివడి యొకచెట్టునీడ
నాకభూషణము కంఠమున శోభింప
నిలుచుండె తాపంబు గలుగనియట్లు,
కలగన్న యతడిట్లు పలికె సభాగ్ర
భూషణా, యిందలి పురుషుడెవండు

సదయత నీకిట్టి సాయంబుచేసె?
అనవిని శాంతాత్ముడనె నిట్లు నామ
ద్వారంబు ముంగల నంగూరువల్లి
దట్టంబుగానల్లి పెట్టపోగొట్టు,
దాని చల్లని నీడ దరిజేసి యొకడు
పావనాత్ముడు సుస్వభావ పూజితుడు
కన్ను మోడ్చె, తదుపకారంబువలన
ఈ నిరాశాస్థితి హితము సేయంగ
తలపోసి నా పాపములు క్షమింపంగ
న్యాయమూర్తి మహేశు నతడిట్లువేడె
"ఈ దాసుపై జూపు మెనలేని కరుణ.
ఒకనాడు నాకాత డుపకృతిచేసె,"
ఈ రహస్యమువిప్ప నేమిచెప్పితినో
ఇదియు పీరాజ్ పతికగు మంచివార్త
షాహి విశ్రాణనచ్ఛాయ జీవించు
వారలనుభవింత్రు బహుమతి వింటు,
ఈవి కాడు సఫల వృక్షంబుబోలు,
అది దాటిపోయిన నంతయుంగొంగ
తలములె, వంటకట్టెల చెట్లు గుబురె!
మొదలంట గొడ్డంట మ్రోడు కుజంబు
పడవ్రేయుదు, రెవండు ఫలభార నమ్ర
వృక్షంబు ఖండించు వెంగలియాను?

కల్ప పాదపమట్లు కలయన్ని నాళ్లు
బ్రతుకుము, నీడయు పండ్లు నిచ్చెదవు
ఓ బూబకర్ సాది యొనరించు శుభము

## దండ నీతియందు రాజులకు హితము

ఈవిని గురియించి యెంతో చెప్పితిని,
అయిన నందరకది యక్కర గాదు,
జన కంటకుని నెత్తు సంపద గొనుము,
ఏలన, చెడుపక్షి యాకలన్ గరుల
ఒలుతు రత్యాది హాని సలుపనియట్లు,
యజమానితోడ పోరాడు బానిసకు
ఏల చేతంబెట్ట కోలయురాయి?
ముండ్ల చెట్టునుమూల ముట్టు పెకల్చు,
ముదమార ఫలవృక్షములను పోషించు,
తక్కువ వారిపై తలనిక్కు గొనని
మంచివానికి నిమ్ము మహితమౌ పదవి,
జన కంటకుండెట మనుచున్న గాని
వానిని మన్నింప వల, దేలనన్న
ప్రజలపై దౌర్జన్య భరమిడినట్లు,
దీప మూదినరీతి దీన శాత్రవుని
ప్రాణంబు నార్పు శుభంబు చేకూరు,

జాతి యంతయు బాధ చచ్చుటకంటె
దుష్టు నొక్కని మంట ద్రోయుట మేలు,
దారి దోపిడిగాని దయ చూచువాడు
స్వభుజాబలంబున సార్థవాహంబు
క్రూరంబుగా దోచుకొన్న వాడగును,
ప్రజల పీడించెడు రక్కసి మూక
తలలు తూర్పెత్తుము బలుపైన గాలి,
జన కంటకులపైని సలుపు దౌష్ట్యంబు
న్యాయ సమ్మతమును నర్హంబు నగును.

## అపాత్రులకు సహాయము చేయుట కీడు దెచ్చును

తన యింటికప్పు క్రిందను తేనెతెట్టె
గావించి మధు మక్షికంబు లెల్లెల్ల
నెగురుచుండుట చేసి యింటి కామందు
గృహ జీవితము విసిగించె నాతనిని,
భార్యతో నిటుచెప్పె బారు వాలంబు
తెమ్మిచ్చుటికి, తేనెతెట్టె పెకల్చి
సరఘుల నన్నిటి తరుమగొట్టెదను;
ఇంతి యిట్లనె తేనె టీగలనెల్ల
నేమిసేయ తలంపు? హితము గాదదియు,
దిక్కుమాలిన వయి దీనరావముల

సొంత పట్టునువీడి శోకించు చుండు,
తెలివి తక్కువ భర్త పోలతి మాటలకు
సరియని పనిమీద చనియె నెచ్చటకో,
ఇట్లుండ నొక్క-నాడింతిని కుట్టె
తేనెటీగలు పుట్టె తీరని నొప్పి,
ఆతడింటికి వచ్చె నంగడినుండి,
తెలివి మాలిన సతిఁ బలు కోపగించె,
నొవ్వోర్చు కొనలేక నెవ్వగం బడతి
వాకిళ్ల దారుల పైకప్పు పైని
కుయ్యో మొర్రో యంచు కూయిడం దొడగె
"మగనిపై నీవేల మటమటిం చెదవు?
నీవె యంటివిగాదు 'నిర్దయత నీవు
మధు కుక్షికంబుల మరలింప బోకు
మని, యెవ్వరైన దుష్టాత్ముల కొరకు
మేలు సేయుదురె? ఆమేలు మూలమున
వారి దుష్టత్వంబు వర్ధిల్లు చుండు,
ప్రజల, నాయకుడైన పలుబాములిడగ
ఖడ్గంబుచే వాని కంఠంబు తునుము,
కుక్కనగా నెంత, కూటిపళ్లెరము
పెట్టనక్కరయేమి? విసరి వేయించు
బానిసతో చెప్పుబట్టువైన యెమ్ము,
"కాళ్లు జాడించెడు గంతయెద్దునకు

భారి మెక్కుడు వేయ బాగుగానడచు?
నని పల్లెటూరివాడన్న లోకోక్తి
యెంతచక్కగనుండె! హీన వివేకి
తలవరి దొంగపై దయచూపుచుండ
గ్రామవాసులు రాత్రి కనుకూరుక్కగొనరు
ముచ్చులింట్లకు కన్నములు వేతురంచు,
కదనస్థలిని యీటెకర్ర యొక్కటియె
శతసహస్రేషు సంచయమునకంటె
పనికివచ్చును, ప్రతివాడు నర్హుండు
కాడు సంపదలకు; కలిమికొక్కండు
తగును, చీవాట్లకు తగును వేరొకడు,
పిల్లికూన నొకండు పెరిమతో చాక
అది పావురంబును పొదివి హింసించు;
తొడలు క్రొవ్వెక్కగ తోడేటి పెంచ
కొఱుకు యూసబుమెడ కూచి దంతముల
గట్టిపునాదిపై గట్టనిమేడ
యెత్తుగా నిర్మింప నెసగు భయంబు.

## బ్రహ్మముని ముందు దృష్టి

వేటకై బయళుల విడియు బ్రహాము
తన యుత్త మాశ్వంబు తలపొగరెక్కి
అవనిపై త్రోసిన యపుడు చింతించి

యెంత చక్కగపల్కె నీ మంచిమాట
మందనుండి మరొక్క మంచి గుఱ్ఱంబు
తెప్పింతు తెప్పున, దీనియట్లదియు
లోలమై చేమించ లోఁగొనవచ్చు,''
ఊటబొంగను మేకు నొకటి నాటించి
నీరమాపగవచ్చు, నిండుటేరైన
గజమునెక్కియుదాట కష్టసాధ్యంబు,
దజ్జాను సలిలంబు తగ్గిన యపుడు
కట్టవచ్చు, ప్రవాహకాండంబు బలిసి
పారునప్పుడు నేటి బంధింపవశమె?
నీచమా తోడేలు నీ యురింబడిన
యప్పుడే కడతేర్పు, మటుగాకయున్న
గొఱెలపై నీకున్న కూర్మిని విడువు,
ఇబ్లీసు దేవుని కెరగంగబోడు,
మంచి, దుర్జాతుని మతియందు లేదు,
కీడుతలంచు నుక్కివున కీ వెపుడు
ననువుగా నాశ్రయ మవకాశమిడకు;
సర్పంబు రాతికి సరిసూటినుండ
వేయక కఱ్ఱకై వెదుక నోచితిమె?
కృతికర్త యెవ్వండు క్రిందివారలకు
హాని కుడుపుచునుండు నవ్వానిచేయి
కరవాలు చేపూని ఖండింపమేలు,

కరిన శాసనముల గావించు మంత్రి
నిరయాగ్ని పడుగాక నిన్ను గొంపోవు,
అనకు దేశక్షేమ మునకు వాడొప్పు
నని, చెడ్డయోచన లందిచ్చు నతడు
మంత్రి గాడు ప్రజకు మారకుండగును.
చక్కగా నెరవేర్చు సాదిమాటలను
తగు నదృష్టము గల ధన్య మానవుడు,
ఏలన దేశాభి వృద్ధి కరంబు
లౌతలంపులు న్యాయ మలరుచు నుండు,

---

# ప్రేమ

దైవిక ప్రేమతో తలపు వెర్రెత్తు
భక్తుల కాలంబు పరమ సంతుష్టి
కడచిపోవు, వెడంద గంటివారినను
క్షితిపై మొలామును చరుముచుండినను,
దారిద్ర్య దుఃఖ సంతప్తులై యుండి
విభవసౌఖ్యములకు విముఖులయ్యెదరు;
పేదరికంబున భిక్షుకులయ్యు
ఆశతో కష్టంబులన్ని సహింత్రు;
అనిశంబు వారు దుఃఖాసవమాను
చుందురు; తిక్తమైయున్న, మౌనంబు
వహియించి యోర్పుతో పలుకరెద్దియును;
ఆసవంబును గ్రోలు నానందమందు
కైపు తలకునెక్క కష్టంబుగలదు,
పొదగులాబికి ముండ్ల బొందళంబట్లు;
అతని చింతనమందు నలరెడు నోర్పు
చేదుగా, దేలన చెలికాని చేతి
తిక్తపదార్థంబు తియ్యనౌగాదె!
వానిచే బద్ధుండు బంధవిముక్తి
వాంఛింపడెప్పుడు; వాని వాగురల
పడిన పక్షియు బయల్ పడ నిచ్ఛగొనదు;

రాజ్యభార విముక్త రాజులు వారు
'హామె' తెగ బిచ్చగాండ్రటులు దైవికులు,
పథమున సోపాన పాళియుం దెలియు,
అయినను మఱచిరి యద్దాని జాడ;
నెయ్యునిపై ప్రేమ నిందలోర్చెదరు
పైకెక్కి యుండిన, కాలు తేలికగ
బరువు మోసెడునొంటె పగిది నవ్వారు,
వారి వృత్తము స్థితి ప్రజకెట్లు తెలియు
చీకటిలో నూరు జీవామృతంబు
లాగు నిగూఢమై దాగి యుండుటను?
తేజొందు జెరుషెలేం దేవాలయంబు
వలెలోన శోభయు పైకి పాడట్లు
వారరు కనిపెంత్రు బాహిరంబునకు;
శలభంబు దీపికాజ్వాల బడ్డటుల
అసువులు త్యజియింప నలకువంగొనరు;
పట్టు పురుగు విధాన వసియింపబోరు
గట్టిగా మోహాను కౌగిలించియును
హృదయ రంజనునకై వెదకు చుండెదరు;
సెలయేటి యొడ్డున చేరి యుండియును
పెదవులు దప్పిచే బీటలువారు,
నీరు దొరకవంచు నేను వచింప
నీలు నదీతీర నికటంబు నకును

వాపు రోగియుచేర వచ్చినట్లుండు.

## లౌకిక దైవిక ప్రేమలు

నీరు మృత్తికతోడ నిర్మింప బడిన
నీకు, హృచ్ఛాంతిసి నెరయోర్పు దనము
హరియించు ప్రేమంబు దురవస్థగొల్చి,
మేల్కాందు వేని, యామెలత కపోల
పాళియు తిలకంబు భావంబుగొనును,
కన్ను మోడ్చెదవేని కలలలో కూడ
దాసుడ వౌదువు దాని చింతలకు,
నిజమున కీవునా నెలత పాదముల
తలమోపి జగమెల్ల దాని కట్టెదుట
అస్థితి పర్యాయ మనుచు నమ్మెదవు,
ప్రేయసి నీసొత్తు ద్వేషించి నపుడు
దుర్మ్మెన సొమ్మైన తుదకు నీకొకటె;
పొలతి నింకొక్కతె వలపింప కుంట
యేలన, మొదటిది హృదయ మందుండ
వేరొక్కతెకు దాన వెలితి లేకుండు,
"కనులెత్తి నప్పుడు కన్నుల వెలుగు,
కనుమూయ డెందంబు కలికికే నెలవు,"
అని ప్రశంసింతువు వనితపై మమత,
అనులు భంగింతురను చింతగాని
క్షణమైన నోర్చుకో గలశక్తి గాని

కలుగను నీయందు, చెలియొక్క వేళ
జీవమిమ్మన, నరచేత చూపెదవు;
కరవాలు నీతల ఖండింపనెత్త
మెడచాపెదవుముందు తడబాటు లేక,
ఇంద్రియ దౌర్బల్యమే మూలబంధ
మైన ప్రేమయెటులో యాత్మ విప్లవము
పెరరేపి దుర్దమావేశంబు గొలుప,
సన్మార్గవర్తులు సన్మతస్థులును
అతుల సత్యాన్వేషణాంబోధియందు
నంతులేక మునుంగ నాశ్చర్యమేమి?
వలపు పిచ్చిని వారు ప్రణయిని కొరకు
తమ ప్రాణములనైన త్యజియింపగలరు;
ప్రేయసి స్మృతివల్ల బాధచేవారు
పాడులోకంబును వర్జించినారు,
సత్యంబుపై దృష్టి జనపాళినుండి
విడివడుచుందురు వెర్రివారల్లు,
సాఖప్రణయమందు సక్తులైయుంట
సీధువు పాత్రలో చిందిపోయెడిని,
మందిచ్చి రోగంబు మాపదుర్ఘటము,
ఎవరెఱుంగరు జాడ్య మేదియైనదియు,
"నేను మీ దేవుడగానె" యన ప్రశ్న
వారి వీనుల వినవచ్చె పైనుండి,

''జౌన''ని యెలుగెత్తి యరచిరివారు,
కార్యవిముక్తులౌ ఘనులొక్కమూల
ధ్యాన నిర్మగ్నులై తనియుచుండెదరు,
కాళ్ళుదుమ్మున, నూఱ్పు గ్రాగుచున్నట్లు.
ఒక కేకచే కొండ యుద్ఘాటనంబు,
రావమొక్కటిచేత రాజ్యవిప్లవము
సేయ సమర్థులు సిద్ధసంకల్పు,
లనిలంబువలె కంటికగపడకుండి
కడురయంబున వారు కడచిపోయెదరు,
మౌనంబు వహియింత్రు మంచి కస్తూరి
పగిది, దైవస్తుతి పలుకుచుండెదరు,
కరముప్రొద్దున లేచి కనుల కన్నీరు
గార్తురు కనుకూర్కు కజ్జల మెడల,
స్వారిగుర్రము రాత్రి పరుగెత్తి బడలి
మరణించె, వారలు మాపు మేల్కనుట
ప్రొద్దున మూల్గుచు పొందిరి శ్రమను,
రాత్రియుం బవలు విరామంబులేక
యున్మాద జలధిలో నురికి మునింగి
హృదయ సంక్షోభంబు పొదలుచునుండ
'అది రాత్రి' 'యిది పవ'లను జ్ఞానమెడలె,
ప్రణయిని వదన సౌభాగ్య మోహమున
యుల్లంబు తవిలి రాకుండుట జేసి

సరకుసేయరు బాహ్య సౌందర్యగరిమ,
బాహ్య రూపంబుల పావనాత్మకులు
తల పోయరెప్పుడు తమ చిత్తమందు;
ఒకవేళ యజ్ఞాని యొకడట్లు తలప
మెదడు మాంసము లేని మెదక యతండు,
ఇహ పరలోకంబు లెవడు నిత్యంబు
మరచునో యట్టి సమ్మాన్య భావుండు
అమలమై తనరునా ధ్యైకాసవంబు
యానంద మగ్నుడై యాను తన్మయత.

## బిచ్చగాని పుత్రుడు, రాచపుత్రుని ప్రేమించుట

వినియుంటివే మున్ను బిచ్చగాడొకడు
పృథ్వీశు పుత్రుని ప్రేమించె నంచు,
వసతి కేగి యతండు వ్యర్థ భావముల
నూహించు చుండెను నున్మత్తునకుల,
ఊహ దంతంబులు నొత్తె కోరికను,
మైలు రాయివిధాన మైదానమంను
కని పెట్టుకొని యుండు కడలేని వాంఛ,
చదరంగమందు నశ్వంబు ప్రక్కలనె
గజమట్లు నిరతంబు గాన్పించు నతడు,
ఉల్లంబు నెత్తురు లొలుకు చుండినను

తన రహస్యముదాచె తనలోన తాను;
నిరతంబువాడు కన్నీరు నించుటను
అడుగు లాశాపంకమందు క్రుంగిలియె,
కనిపెట్టి రాబిచ్చగాని దుఃఖంబు
పదిగ నచ్చోట కావలి కాచు భటులు,
"మరియొక్క మారు నీ మైదానమునకు
అడుగుపెట్టకు" మంచు నదలించినారు,
క్షణముసేపటు పోయెగాని తక్షణమె
స్మృతివీధి వికసింప మిత్రుని మోము
క్రమ్మర నచ్చోట కట్టె గుడారు,
"ఇటకు రావద్దని యింతకుమున్నె
చెప్పియుంటినిగాదె, సిగ్గులేద"ంచు
బానిస యొకడు కోపంబున డాసి
కాలుచేతులు తల కర్రతో మోదె,
మరలి వెళ్లెను, వాని మానసమందు
శాంతియు సహనంబు సర్వంబు సమసె
తన స్నేహితుని మోము తలపోయునపుడు
ఓరిమి సుంతైన నొనగూడకుండె,
చక్కెరపై మూగు సన్న యీగల్లు
ఎంత తోలినగాని యిటునటు తిరిగి
మరల వ్రాలెడు పోల్కి మరలు నతండు,

ఒకడిట్లు వచియించె నోయి దివాన!
ఎంత యక్కజము నీవీ కర్ర పెట్లు
రాతి దెబ్బలు తిని ప్రీతినోర్చెదవు!
బిచ్చగాడిట్లనె ప్రేమ సఖుండె
చేచేత నాకిట్టి సిలుగు ఘటించె,
సఖుని చే కష్టంబు సంభవించినను
నలిగియు మొర పెట్ట న్యాయంబు కాదు;
అతడు నన్ మిత్రుడనని ప్రేమగనిన
శత్రువుననుచు ద్వేషంబు పూనినను
అరయుము, యతని స్నేహమె కోరుకొందు;
కోరకు నాయందు నోరుపు, సఖుడు
లేకున్న, నుండిన చీకుచెడంద
శాంతి చిక్కంబట్టు శక్తి లేకుండు,
ఇక్కట్లు సహియింప హృదయబలంబు,
కడగి పోరగ నవకాశంబు, నిచట
నిలువశక్తియు, బాసి తొలగంగ కాళ్లు
స్వాధీనములుగా, వహంకారమూని
"రాజసన్నిధి వీడి రయమునంబొమ్మ"
అని చెప్పబోకుమ, యతడు నాతలను
దయమాలి ఖండించి తన గుడారంపు
బిగిమోకునకు మేకు విధము గట్టినను,
చీకటి మూలలో జీవించుకంటె,

శలభంబు తన ప్రాణ సఖుని పాదముల
పడి మరణించుటే పరమ శుభంబు,
"అతడు చౌగానుతో నడరించి కొట్ట
దెబ్బకెట్లో ర్తువు తెంపరి కాడ?"
"బంతినా యాతని పదములం బడుట"
"ఖడ్గంబుతోడ నీ కంఠంబు ద్రేయ?"
"అట్లయ్యు మారాడి యరికట్టబోను,
వాడొక్కనికి ప్రేమపాత్రమైయుండ
చెలికాడు పెట్టెడు చిన్న బాధలకు
విసుగుతో నెప్పుడు వేదనంగొనడు,
తలను మకుటంబునో తరవారియునో
అను సంశయము నాకు నర్థంబుకాదు,
అసహిష్ణువును నన్ను నట్టె దూరకుము,
సహనంబు ప్రేమలో సమసియేపోవు,
యాకూబువలెగాంచి యత్నులు వెల్ల
వారినగాని నే భగ్నాశనొంద
కన్నుల యూసబు గాంచునందాక,
ఒకనాడు బిచ్చగాడుత్కంఠతోడ
రాజపుత్రు రికాబు రవణముద్దిడియె,
ఆతడు విసుగెత్తి హయము వాగెలను
వెనుత్రిప్పె వానిని విడిపోవు నిచ్చ,
కలకల నగి బిచ్చగాడు నిట్లనియె

వాగెలు లాగకు, పాదుషాపైన
నెవనిచూచియుగాని యిట్లు సేయందు,
నీయునికి వలన క్షీణించె నా యునికి,
స్మృతిని నీవుంటను స్వీయగౌరవము
మచ్చుకైనను లేక మలమలమాడె,
ఒక వేళ నాలోన నొప్పుమిగన్న
తప్పుల దూరుచు విప్పిచెప్పకుము,
ఏలన, నీవెనా యిహజీవితంపు
మెడపట్టిలోనుండి మెడచాపినావు.
అందువల్లనె ధైర్య మవలంబనముగ,
నెమక నీయంక వన్నియ ముద్దుగొంటి.
నను నేనె లెక్కింపకునికి కారణము,
కలముతో నాపేరు తొలగించినాడ
అన్ని యాసల పైని యడుగు త్రొక్కితిని,
మత్తాక్షముల దృష్టి మార్గంబెపుడొ
హరియించె ప్రాణంబు, లక్కర యేమి
ఖడ్గంబు చేపట్టు కష్టంబు కుడువ?
రెల్లు పొదల నగ్ని రేపి పోపొమ్ము
పచ్చివెండువి చెట్లు వనమునంగాలు.

# త్యాగశీలమైన ప్రేమ

గాయకుండు రసార్ద్రి గానంబుసేయ
అచ్చరవంటి చంద్రాస్య యొక్కరితె
నాట్యంబు సలిపి యానందంబుకూర్చె,
తన చుట్టుపట్టుల తపియించుచున్న
విరహదగ్ధుల చిత్త వీధులనుండి
వెడలు నిట్టూర్పులు వేంద్రంబు గొలుప,
దీపికాజ్వాల యంతెరవ పయ్యెదకు
నిప్పునంటించెను, నెలత సంక్షుబ్ధ
హృదయయై కోపంబు గదుర నిల్చుండె
నెయ్యుడొక్కడుపల్కె నీకేమిభయము?
మడతి, నీపయ్యెద మాత్రమే కాలె
తనువు సర్వము నాకు దగ్ధమైపోయె!
ప్రణయిని వగుదేని స్వాకము నెంచకుము,
ఏలన, సొంతంబు హృదయమోహనుని
ఒకటిగా తలపోయ నుచితంబెనీకు?
త్యాగశీల ప్రణయంబు గాదదియు.

# ప్రేమబద్ధుల వృత్తము

ప్రాజ్ఞుడౌ వృద్ధుని వలన నీకథను
వింటి దైవప్రేమ వెర్రెత్తినట్టి

తనయు డెడారిదారిని బట్టెనంచు
జనకుడా యెడబాటు సహియింపలేక
నీరునన్నము మాని నిద్రింపకుండె,
అందుకై కొమరుని నిందించి రొరులు;
అతడిట్లు వచించె నాప్రేమ సఖుడు
నను "మదీయుడవ" ని యనినది మొదలు
పరులతో నెయ్యంబు తరిగె నాయందు
విశ్వేశుపై నొట్టుపెట్టి వచింతు
తనదు సౌందర్యంబు గనిపించి నంత
మిగత సర్వము నూహా పగిది చూపట్టు,
ప్రజలకు విముఖుడో పరమ చింతనుడు
పోకార్ప బడలేదు, పోగొట్టుకొన్న
తన నెయ్యు క్రమ్మర కనిపెట్టి పట్టె
అల దేవ దూతలో యడవి మృగాలో
యని చెప్ప నొప్పెడి యార్తచేతసులు
ఉన్నారు ధరణిలో నుభయవర్తనులు;
దేవదూతల పోల్కి దేవుని స్మరణ
ఔన్నత్యముంగాంతు, రడవి జంతువుల
వలె రేయి పవలును ప్రజల సాంగత్య
మును వీడి పరతెంతురనువైన యెడకు,
ఆధ్యాత్మికముగ బలాఢ్య బాహువులు,
హ్రస్వ హస్తులు లౌకికా శయమందు,

ప్రాజ్ఞు లుల్లమునందు, పైకి నున్మాదు,
లాత్మలో జాగర్య, యత్ఝులంగ్రైపు,
ఒక మూలగూర్చుండి యొక కాలమందు
తనివి నెందుదురు బొంతలు కట్టుకొనుచు,
ఒక వేళ సభయందు నుల్లంబు చితికి
తమ కుట్లబొంతలు తగుల బెట్టెదరు,
పరచింత నిజచింత వారికి లేదు,
ఐక్య కోణమునందు నన్యు నొక్కనికి
పాల్గొన నెడలేదు వారి సంఘమున,
తెలివి యింద్రియములు తికమక లాడు,
వేత్తలనీతులు వినరాని యట్టుల
శ్రుతులలో తూలము చొప్పించు కొంద్రు,
వనధిలో బాతువు మునిగి పోకుండు,
మరి "సమందరు" కేమి మంటలు బాధ?
రిక్తహస్తులై యయ్యు హృదయంబు నందు
ఐక్యాశ నెప్పుడు నడరు చుండెదరు,
ఏబిడారము లేక యిసుక బయళ్ల
తిరుగు నిరంత యాత్రికు లట్టివారు,
ప్రజల యంగీకృతిపై నాశ గొనరు,
అఖిలేశ్వరు ననుగ్రహంబు వారలకు
తృప్తిగా వర్షించు, నిది చాలుగాదె!
ప్రజల కంటికి కనబడ బోరు ప్రియులు,

కుట్లబొంతకు లోన గూఢంబుగాగ
జున్నారు ధరియింప రెన్నడువారు,
ఫలగుచ్ఛముల నిండి పందిటనీడ
లిచ్చు ద్రాక్షాలత కీడైనవారు,
మనవలె పాపకర్మముల గావించి
యంగీలకును నీలిరంగు వేయింప,
రంబుధిపాలె కోపార్తులై వారు
నోట క్రక్కరు పెట్లు నురుగుదబ్బలను,
కాయము పోషింపగడగ రెన్నడును,
ప్రతిమూర్తినుండదు పరిశుద్ధమాత్మ,
పాదుపా విలువడు ప్రతిబానిసీని,
ప్రతిచింపి బొంతలో భవ్యంబు లేదు;
మంచుతుంపురులెల్ల మంచి ముత్యంబు
లైన గవ్వలపోల్కి నంగళ్లునిండు,
ఆటదొమ్మరులట్టు లరకాళ్ళ క్రంద
మరగాళ్లు బంధించి తిరుగంగబోరు,
అటునిటు నడువ శక్యంబుగాకుంట,
దైవరహస్య సౌధంబున సఖులు
చెరియొక్క గ్రుక్కెడు శీధువునాని
కడపటి తూర్యంబు కడలొత్తుదాక
కై పెక్కి నిరతంబు కన్నుమోడ్చెదరు,
వాలు చూపినగాని భయమునొందకయె

మైక్యాశ మరలింపరా గురినుండి,
వైరాగ్యమును ప్రేమ వర్తిల్లుచుండు
అద్దంబురాయట్టు లతి విరోధమున.

## ప్రేయసుని నిరాకరించిన సమర్‌ఖండు యువతి

ప్రథిత సమర్ ఖండు పట్టణంబందు
నొకనికి ప్రేయసియుండె చక్కనిది,
నుడులకు మారుగా నోటకల్కండ
యతివకున్న దటంచు ననవచ్చునివు,
తరణి సౌందర్యంబు తరుణికిం గుదువ
పెట్టినట్టుల మూర్తి విన్నాణమొదవె,
షోకు నొయ్యారంబుచూప, పుణ్యాత్మ
భక్తి పునాది కంపము నొంది సడలు,
రామణీయకము పరాకాష్ఠముట్టె!
దైవకారుణ్యము తనకున్నదంచు
తెలుపు లాంఛనమన నెలత యొప్పారు,
విహరించుచుండిన వెలది రూపంబు
నందటి కన్గవ లనుసరించెడిని,
వలపుకాంక్ష యెడంద ప్రాణములుగూడ
ఆబోటి బలిపీఠి నర్పించినారు
ఒక్క ప్రణయబద్ధుడోరచూపులను

కడురహాస్యముగ తన్ గాంచుచునుండ
కనిపెట్టి చెలి యిట్లు ఘర్షించి పల్కె
ఎంతకాలము నన్ను నిటువెంటనంటి
తిరిగెదవోయి? నీ వెరుగవోయేమొ
నీవలబడు పిట్ట నేను గానంచు,
మరియొకమారునిన్ మత్సమీపమున
గాంచెదనేని నీగళము నిర్దయత
ఖండింతు రిపునట్లు కరవాలుపూని,
ఒకడిట్లు వచియించె ఓయి నీవిపుడు
సొంతదారినిపొమ్ము, సులభగాదదియు.
ఇంతకంటెను సాధ్య నేకాంత నైన
అనుకూల పరచుకో, న్మది నీకు మేలు;
నీకోర్కె ఫలియింప దీకాంతతోడ,
హృదయాశకై ప్రాణమొట్టి దుర్గతికె
పాల్పడకుండుత పరమేశు కృపను,
ఆహెచ్చరింపుల నతిమోహితుండు
ఆలించి లోనుండి యాతనాపూర్ణ
పరిదేవనముగొల్పి పల్కె నీరీతి,
మరణ ఖడ్గపు వ్రేటు కెరలి నాశవము
దుమ్మునెత్తుటిలోన దొరలింపనిమ్ము,
ప్రజలొకవేళ నావార్త దెల్పెదరు
''కాంత ఖడ్గంబుచే ఖండించె వీని''

అని శత్రువులు మిత్రులందరు వినగ,
మోహిని వీధిదుమ్మును వీడి చనగ
హృదయగోచరము గాదే యుపాయంబు,
అన్యాయముగ నాదు యశము పోగొట్ట
వద్దని చెప్పుము వనితతో నీవు,
ఓయి యహంకారి, యూరక నన్ను
'అనుతాపమందుమ' యని చెప్పె దీవు,
ఈమాట పల్కిన హేతువు వలన
నాగి నీవె యనుతాపమొందినమేలు!
సఖయేమి చేసిన క్షమియింపు నన్ను,
ఎదనెత్తుకోరిన, నదియు సమ్మతమె
ప్రతి రాత్రి విరహాగ్ని గ్రాగుచుండెదను,
ప్రొద్దుపొడిచినయంత పొలతి నెత్తావి
వ్యాపించి తప్తమా ప్రాణంబుగాచు,
ఈనాడు ప్రియురాలి యింటిమార్గమున
కాయంబు విడనాడ గలుగుదునేని
అంత్యదినంబున నతివ చెంగటనె
నాటెదను గుడారు నమ్మకంబుగను,
సాధ్యమానంత కీసంగరమందు
వెన్నిచ్చి వెడలకు విటతాటనముగ,
ఏలన, ప్రేమ దహించియుండియును
పరమ భక్తుడు సాది బ్రతికియున్నాడు.

# ప్రేమతత్పరుల బలిదానము మరణమును అదృష్టమని యెంచుట

ఒక్కఁడు నీర్వట్టి యోర్చుకోలేక
అసువులు దేవుని కర్పించువేళ
వచియించె నిట్టుల "పారునీరమున
పడిచచ్చు సుకృతియే పరమ హృష్టుండు,"
బుద్ధిబలములేని పురుషుడొక్కఁడు
అనె నిట్లు చావు నీకాసన్నమౌట
పెదవులు తడిసిన బీటలెత్తినను
ఒకటియేగాదె, ప్రయోజనమేమి?
అనవిని తృషితుండు వినిచె నీరీతి
ప్రియమైన ప్రాణంబు వెడలించు కొఱకు
తుదకు నానోటిని తోయ బిందువుల
తడపలేనే? పెల్లు దప్పిగొన్నతడు
పడు నగాధ జలప్రవాహంబునందు,
ఏలన, చక్కఁగా నెఱుగు నతండు
దప్పి తీరినవెన్క తామున్గునంచు,
ప్రియుడవేయైన నాప్రేయసి కొంగు
పట్టుము 'ప్రాణంబు బలియిమ్ము' యనిన
'తీసికొమ్ము' యటంచు తెలుపు మా చెలికి
ఆ ప్రాణంబున నీవు నాకసుఖంబు

ననుభవించెద, వేలయని యందువేని
అస్థితి నరకంబు నతకరించితివి,
ధాన్యంబు చల్లెడు తరుణంబునందు
కృషికుల డెందంబు కీడ్పాటునొందు,
పంట సిద్ధంబైన పదినాళ్ల పాటు
నిశ్చింతులై సుఖనిద్ర చెందెదరు,
ఆ ప్రేయసుల సమాజాంతరమందు
ఎవ్వడంత్యావృత్తి నెరిగి పాత్రంబు
కై కొనునో వాని కాంక్ష సిద్ధించు.

## ఫకీరులయోర్పు పట్టుదల

భాగ్యవంతులవంటి ఫక్కీర్లు, పాహి
వంటి భిక్షుకులునో ఫంధ నెరుంగు
భక్తుల కథలెల్ల వచియించగలను,
ముది బిచ్చగాడొక్క యుదయంబునందు
భిక్షాటనమునకు వెడలి మసీదు
ద్వారంబుకడనిల్చి వాంఛించె భిక్ష,
అటనొక్కడు వచించె ఆమందిరమున
ఎవరు లేరేదైన నిచ్చిపంపుటకు,
ఇచ్చోట నిలువకు మెంత సిగ్గిడివి!
అనవిని యాచకుండనియె నక్లైన
ఈగృహంబెవరిది? యిందున్నవారు

పరుల యవస్థపై కరుణింపబోరె?
అనవిని యచటి వాడనియె నోరెత్తె
కుండుమీ, యీ ప్రశ్న యుచితంబుగాదు
మందిర యజమాని మనకు నెల్లరకు
సర్వస్వతంత్రుడౌ స్వామియంచెరుగు,
లోని దీపంబును పైని తోరణము
కని బిచ్చగాడంత కటకటపడుచు
వేడి యెదలోనుండి వెలికూర్చి కూయి
యిట్లనె దీనుడై నెంత శోచ్యంబు!
ఇటనుండి మఱియొక యెడకు నేగంగ,
పడసి యీ ద్వారంబు భగ్నాశతోడ
తిరిగి వెడలుట యెంత తీరని యార్తి!
ఏ గొందెనేనియు నింత యాచించి
హతమనోరథుడనై క్షతిగాంచలేదు,
మొదటనే యీసత్యమూర్తి ద్వారమున
నిలిచి సిగ్గిడినయి వెలువడ నేల?
ఇచ్చట నైననే నెడ తెంపలేక
యర్థుల పోలిక నంజలిపట్టి
యాశింతు, నే శూన్యహస్తుడనగుచు
మరలిరానను సత్యమెఱుగుము నేను,
వినియుంటి బిచ్చగాడును నొక్కయెడు
నటె మసీదున నర్థియైయుండె.

నని; యొక్క రాతిరి నాతనిగుండె
దౌర్బల్యవశమున తటతటలాడె,
బ్రతుకు పునాది యప్పట్టున మృత్యు
పంకంబునంగుంగు పగిది చూపట్టె,
ప్రత్యూషంబున, దివ్వె పట్టియొకండు
పరికించి యతనిలో ప్రాణలేశంబు
ప్రొద్దుటి దీపంబు పోలికనుండ,
నెలుగెత్తి సంతోష కలితుడై పల్కె
"పరమకృపామయు వాకిటన్నిలచి
తలుపుఁ దట్టిన, వీడు తమయంత నవియు,
అన్వేషి కోరిమి యావశ్యకంబు,
వినలేదు రసవాది విసిమాలెననుచు
మార్చవచ్చును రాగి మంచిబంగారు
గా నొక్కనాడని కనకంబునెంతో
పనికిమాలినధూళి పడవేసినారు!
వస్తులంగొనుటకు బంగార మొదవు,
ప్రాణవల్లభ మేలి ప్రణయంబుకంటె
ప్రియమైన దెద్దాని విలువంగ గలవు?
హృదయాపహారిణి యెదకత్తపెట్టి
వేరొకరంజని వెదఁ గ్రహించు
చిటుముటలాడెదు చెలువమోహమున
చిత్త సంతోషంబు చెరచుకోబోకు,

వేరుపేర్చియసి రూపనీరము చల్లి
మొదటి పేర్మిమాగ్ని మొదలంటనార్పు;
రామణీయకమున ప్రథమతో సాటి
కాకున్న కొంచెము కష్టంబునైపు;
మరల దీనినివీడ మర్యాదకాదు;
అదిలేక జరుగునటంచు దోచినను
ఎవతెపైని నెడంద నెడపెట్టవచ్చు.

## యథార్థభక్తుడు దౌర్జన్యమువలన వెనుతిరుగడు

రాత్రియంతయు జాగరంబుగావించి
ప్రొద్దున పక్కీరు పుణ్యచింతనుడు
ప్రార్థింప నంజలిపట్టె దేవునకు,
ఆకసంబుననుండి యాతనిచెవిని
పడెనొక్కవాక్యంబు, "వ్యర్థుండవీవు,
నీదారిపొమ్మింక లేదు లాభంబు;
అఖిలేశు వాకిట నంగీకృతంబు
కాదు నీప్రార్థన, కారియపడుచు
నిలువుము, లేకున్న తొలగు భంగమున,"
ఇంకొక్కరాత్రియు నిట్టులేకడచె
సర్వేశు భక్తిని సంకీర్తనముల,
శిష్యుడొక్కడు వానిస్థితి కనిపెట్టె

యిట్లనె గురుదేవ, యింక నాతట్లు
వాకిలి బంధింపబడుట, వ్యర్థముగ
యత్నింప నీకేమియగు నింతకంటె?
కనుల కెంపులజాలు కారుచున్నట్లు
బాష్పబిందువులను వర్షించియతడు
ఆర్తచిత్తుండయి యనియె కుమార
వాగెల నాతండు లాగి త్రెంపినను
అంకవన్నియపట్టు హస్తంబువదల,
ఈమార్గమునకన్న నింకొక్క పంథ
గోచరమగునేని కూగ్రిగ భంగమున
వసరక క్రిమ్మరి వచ్చియేయుందు,
అర్థియొక్కడను భగ్నాశుడై, మరల
నింకొక్క యెడకేగ నేమిలోపంబు?
"నాకు నీవీథిలో నడశాటయుండ
దనివింటి, వేరొక్క యధ్వమెచ్చటను
గనరాదె" యనియూర్చి కాతరపడుచు
భూమిపై తలవోపి పొగులుచునుండ
తనయంతరాత్మకు వినబడెనిట్లు
"నీకు వివేకంబు లేకయుండియును
అంగీకృతంబుని యర్థన, యేల
యనగ, నాకంటెను నాశ్రియస్థాన
మింకేదిలేదని యెరుగుట కతన."

## కుమారునకు తండ్రి నీతిబోధ

పడుక వేళన మాజు పఠియింప కుండ
కన్ను మోడ్చిన పుత్రు గని నిషాపూరి
యేమి చెప్పెనో దాని నెరిగి యున్నావె?
ఏ ప్రయత్నము లేక యెవ్వాడు ఫలము
గనునని యాశింప గలవె కుమార?
యవలు పంటను గోయ, నడుగున నిల్చి
కొయ్య కాల్పెట్టదు క్రొత్తగా వేళ్లు;
అది యుండి యస్థితి యట్లు నిష్ఫలము;
అనిశంబు లాభంబు నాశింపు, నష్ట
భయమున జాగ్రత్త పడి ప్రవర్తింపు;
కలిగెడు నష్టము కని పెట్టనతడు
దురదృష్ట వంతుడై తుదకు దుఃఖించు.

## ఎవని వియోగము దుస్సహమో వాని దౌర్జన్యము నోర్చుకొనుము

క్రొత్త కోడలు వచ్చి యత్తగారింట
కోడంట్రికము సేయు కొలది కాలమున,
మమత సుంతయు లేని మగని గురించి
వృద్ధుడౌ మామతో ఫిర్యాదు చేసె

కొడుకు కుటుంబపు నడవడి మీరు
సమ్మతింపకుడు, నాసర్వ కాలంబు
గడుపుదాన నెడంద కారియతోడ,
నాసహా వాసినుల్ నారు లీయింట
నావలె హృదయార్తి నవయుట గాంచ,
స్త్రీలును పురుషులు స్నేహబంధమున
బాదములో రెండు పప్పులు వోలె
కలసియు మెలసి సుఖంబుండు వారు,
ఇంత కాలంబయ్యె నెప్పుడు గాని
భర్త నామోమును వలపునం జూచి
చిరు నవ్వు నవ్వడు, చెలిమి గోరండు,
ఈ మాట లనువిని వృద్ధమాతులుడు
అతుల వాక్చతురుడు ననుభవశాలి
తెలివితో నింపుగా పలికె జవాబు,
అతడు సుందరుడని యనుకొందు వేని
వాని దౌర్జన్యంబు చాన, సైరించు,
ఒకనికి విముఖవై యుండిన నీవు
అట్టి మరొక్కని నార్జించు వరకు
వాని విడుచుట యెంతో వంత చేకూర్చు,
ఏల యొక్కనితోడ నెదురొడ్డి నిలువ?
అతడల్ల నీస్థితి యక్షరంబులను
కలము గీతను పెట్టి దొలగింప గలడు;

బానిసవలె నీవు పరమేశునాజ్ఞ
శిరసావహింపుము, శ్రేయంబు గల్గు,
అట్టి వేరొక స్వామి నరయులే వింద

## బానిస కృతజ్ఞత

సౌహృదయం బొక్కనాడు గులాము
పయి దయార్ద్రించాయె, స్వామి యవ్వాని
నింకొక్కనికి విక్రయించెడు వేళ,
బానిస యిట్లనె భావపూర్ణముగ.
నావంటి దాసులెందరో మిమ్ము కొలువ
వత్తురు కాని మీవంటి సజ్జనుడు
స్వామి నాకన్యుడు ప్రాప్తింపబోడు.

## స్నేహితుని దర్శనము వ్యాధి బాధకంటె మేలని తలచుట

దేవదూత మొగింబు తీరు తియ్యంబు
పరగు వైద్యుడు మెర్వ పట్టణవాసి
యొక్క డుండెను, హృదయోద్యానవనిని
సర్వ విధంబున, చక్కనివాడు,
హృదయ క్షతులగూర్చి యెమెరుగండు,
తనకంటె మోహంబు తన కగోచరము,

తిక్త చిత్తుండగు విదేశ యాత్రికుడు
ఇట్టుల తనకథ నెరిగించె నాకు
"ఆవెజ్జుని నాయంత రంగంబు
కొంత కాలము తగుల్కొని యుండె ప్రీతి,
క్రమ్మర నతడునన్ గనరాడటంచు
వ్యాధి శమించుట వాంఛింపకుంటి,
ఎందర ప్రాజ్ఞుల నెంద ఱుద్ధతుల
వలపు పిచ్చి యొనర్చె బలహీనులట్లు!
వెర్రి, వివేకము వీనులన్ నులుమ
తెలివి ప్రభావంబు తల యెత్తబోదు

## తెలివిపై వలపు ప్రభుత్వము

తన లోహముష్టిని దర్పింప జేసె
నొక్కడు కేసరి నోడింతు కోర్కె,
సింహంబు వానిని చేగోళ్ల నదిమి
పట్టిన యప్పుడు వాని ముంజేయి
బలము తగ్గెనటంచు తెలిసె నాతనికి,
ఇట్లనె నొక్కండు ఏల యిత్తరిని
పడతిపోలిక నీవు పవ్వళించితివి?
ఇనుపముష్టిని నెత్తి యెడలేక మొత్తు,
కీడ్పడి యాతండు క్రిందనేయుండి
"మన్ముష్టి చాలదు మత్తసింహమును

ఆటుపోటులగూల్ప" ననెననివింటి,
ప్రాజ్ఞ వివేకంబు ప్రణయ మడంప
బలముప్పి సింహము పటిమ, యిట్లుండు,
ప్రజవిదారించెడు పంచాననంబు
చేతిలో నొక్కండు చిక్కిన వేళ
నినుప ముంజేయున్న నేమిలాభంబు?
ప్రేమ పిచ్చిల్ల వివేకంబుమాట
నింక ప్రస్తావింప, కేలన, బంతి
కొట్టిన యెడ కేగు కోలకు లొంగి.

## ప్రేయసి దృష్టిలో ప్రియుని యోగ్యత

మున్ను చిన్నాయన ముద్దుకూతునకు
పెదనాన్న సుతునకు పెండిలి జరిగె,
ఇరువురి ఫాలముల్ ఫురుడించె రవిని,
వారలిరువురు గొప్పవంశంబువారు,
ఆనందకరమయ్యె నతివకు పెండ్లి,
మగనికి ద్వేషంబు తెగడిక హెచ్చె,
మాట మంచితనంబు మానమర్యాద
లచ్చర యందంబు నెచ్చెలికుండె,
గోడవంకకు త్రిప్పుకొను భర్త మొగము,
తొడవులు కైసేయు పడతి ముచ్చటగ,

తనచావుకై వాడు దైవంబువేడు
ఆగ్రామ వృద్ధులు నతని రావించి
ఉపవిష్టుఁజేసి కార్యోక్తు లిట్లనిరి
"ఆ చానపై నీకు నర్మిలిలేదు,
కాన శుల్కధనంబు కాంతకునిమ్ము,"
భర్త పక్కననవ్వి వారికిట్లనియె
పడతి వైవాహిక బంధంబు మరల
కడసేయ నూరుమేకల నిచ్చుకొనుట
కరము దుర్ఘటమైన కార్యంబుకాదు,
గోతుల చర్మంబు గ్రొచ్చి యానాతి
యిట్లనె నేనింక నీప్రియు పైని
మోరుపు వహియించి యుండవీలౌనె?
వలపు విశ్వాసము భార్యసంగతిని
వదలిన వానితో పనియేమి యింక?
కడుసమ్మతించిన కాదన్న నొకటె,
నిర్బంధపెట్టిన నెనరు చూపెదను,
నూరు మేకలెగాదు, నూర్లువేలైన
ప్రియుని మోమునుగాంచ వీలులేకున్న
ఆయా స్తితో నాకు నక్కరయేమి?
నీవు ప్రేయసితోడ నిరతతత్పరుడ
వగుటకేమున్నది? అడిగెదవేని
సత్యంబు, చెప్పెద చానయేనీకు

హృదయ సౌఖ్యంబుల ముదముతో నొసగు;
నీకు స్వర్గము లేక నిరయ కూపంబొ
వాంఛితంబని వ్రాసె, వలపు పిచ్చెత్తి
యున్న స్నేహితునకు నొక్కండు, వాడు
ప్రత్యుత్తరంబుగ వ్రాసె నీరీతి
"ఆవిషయంబుల నడుగకు నన్ను
అతివ కేది ప్రియంబొ య దెనాకు ప్రియము.

## లైలీ పైని మజ్నూను ప్రేమ

మజ్నూనుతో నొక్క మనుజుండు పల్కె:
ఓ యదృష్టపదుడ, ఓయి సజ్జనుడ,
ఏమి తటస్థించె, నేండ్లు పూండ్లయ్యె
'హాయ' తెగవారిని నరయంగరావు,
లైలిపై వలపిచ్చి ఘూలెనో యెదను?
తలపులు మారెనో తలగెనో వాంఛ!
ఈమాటలన్ విని యెదపుండు వార
పాపము! మజ్నూను పలవించి యేడ్చి,
యిట్లనె ఓయయ్య, యేలనామాట?
ఇంతకుముందె నాయెద చింత చిక్కి
కసికాట్లుపడె, నీవు కనికరింపకయె
చౌడు చల్లెదవేల క్షతి మంటలెత్త?
ఇటకు దూరంబౌట యేమి ప్రత్యయము

సహానంబునకు? పలుసార్లు దూరమున
నుంట తటస్థించు, నొకని యక్కరను,
అనవిని యాతండు ననియె సజ్జనుడ,
యేమైన వార్తలు నింతికై లేకి
చెప్పిపంపెదవేని చెప్పుము నాకు,
ఈవార్త ప్రియురాలి యెడ తెల్పబోకు,
జాలియాగాదె, యాసఖియున్నచోట
ఊరక నాపేరు నుచ్చరించినను.

## అయాజుపైని సుల్తాను మహమ్మదు ప్రీతి

అయ్యాజుకేమియు నందంబులేదు,
అయిన నక్కజమయ్యె నతని సుల్తాను
గజనీమహమ్మదు కడుప్రీతిగనుట!
తావిరంగును లేక తరలు గులాబి
పయిని బుల్బులి యాసపడుటెంతవింత
అని షాహి దోషంబు నరసె నొక్కండు,
ఎవ్వడో పాదుషా కీవార్త తెలిపె
తనలోన నీమాట తరచి తర్కించి
అక్కసపడి యిట్టులనియె సుల్తాను
ఓయి, యయాజుపై నున్న నాప్రీతి
వాని సద్వర్తన వలన గల్గినదె;

దేహసౌష్ఠవమును, తీరు తియ్యముల
వలనగా, దిదియెంత వ్యర్థ చింతనము!
ఒకనాడు వినియుంటి, నొంటె తండంబు
వరుసగా లోయలో నిరుకుమార్గమున
నడుచుచుండగ క్రళ్లి పడె నొక్కటందు,
దానిపైనున్న ముత్యముల పేటికయు
నగలి చెల్లా చెదరయ్యె సామగ్రి,
సుల్తాను నదియెల్ల చూచి దోపిడికి
నాజ్ఞ యిచ్చినయట్లు హస్తంబు విసరి
అచ్చోట నుండి హయంబుపై నెక్కి
వేగంబుగా స్వారి వెడలె నెచ్చటికొ.
పగడాలు ముత్యాలు పడియున్న చోటి
కాశ్వికులును భటులుఁగదరు చేరి,
తన్మగ్న చిత్తులై తహతహ పడిరి,
తక్కనవారు ముత్యాల నార్జించు
తగులంబు లోనుండ, ధరణీశు వెంట
రక్షకు డొక్కండు రాడు, మరొకడె
యయ్యాజు షాహికి ననుయాయి యయ్యె;
సుల్తాను వెనుచక్కి చూచి యిట్లనియె
"ప్రియమిత్రమా, నీకు పెల్లు దోపిడిని
ఏమి దొరకె?" చెప్పె "నేమియు లేదు,
వెడలు మిమ్మును చూచి వెంట వచ్చితిని,

తమసేవ వదలి ముత్యముల దిక్కేగ;
లేని సమీపవర్తివి యైన నీవు
కీర్తిలాంఛనపు టంగీ గాంచనున్న
పాదుషాసేవ నవజ్ఞ సేయకుము,
యతు లీశ్వరుని దప్ప నాయీశునుండి
యేయనుగ్రహమును నిచ్చనై కోర
దైవ మార్గంబును దప్పినట్లగును,
దృష్టి నీప్రియుని దాతృత్వంబు నందె
సక్తమైయున్న నీస్వాకమె చూచెదవు,
వాని విచారంబె పట్టదు నీకు
అత్యాశతో వాయి యనవరతంబు
తెరచుకోనున్నంతవర కంతరంగ
కర్ణంబులకు వినగాదు నదృశ్య
తలమునుండి రహస్యములు కొన్నియేని.
సత్యమలంకృత సౌధంబుబోలు,
అందు దుమ్మునురేపు నాశకామంబు,
కావిరిధూళులు కడలు కొన్నపుడు
కన్నులుండియుగూడ గాంచసాధ్యంబు
గాదన్న సంగతి గనలేదె నీవు?

## మహిమపాదుడు

విధివశంబున నేను, వృద్ధుడొక్కండు

'షార్యాబి' లోనుండి పశ్చిమ దేశ
మున నొక్కనది తీరమునకు నేగితిమి,
నా చేత 'దిర' ముండె, నావికుండెరిగి
యిమ్మని, నను పోత మెక్కించుకొనియె;
పాపము! వృద్ధుని పడవెక్క నీడు;
సహవాసి గతికి నాస్వాంతంబు పొక్కి
కనుల నిండుగా క్రమ్మె కన్నీరు;
నాయేడ్పు చూచి, యానంద చిత్తుండు
పకపక నగి యిట్లు పలికె మిత్రుండ
ఆర్తి నాకయి నీవు ననుభవింపకుము;
ప్రాజ్ఞుడ వీవు, నీపడవ నెవ్వండు
గట్టు చేర్చునో, వాడె కడచేర్చు నన్ను,
మాలిమి కాంద్రుడు ధూమంపు వేగమున
పడవ పోనడిపిరి వారు నాస్తికులు,
దైవ భీతిని కూడ తలపని వారు;
నీటిపై మడిచాప నెరయంగ పరచి
దానిపై గూర్చుండె తపసి సత్తముడు,
స్వప్నమో లేక నాభావ చిత్రంబో
అని తలపోసితి ఆతని కంటె,
ఆశ్చర్యమున నాకు నారాత్రి యంత

నిద్దుర పట్టదు, ప్రొద్దున నన్ను
కని వృద్ధుడిట్లనె కమనీయభావ,
యక్కజ మంది తే యందుకు నీవు?
పడవ నిం దెచ్చె, దేవుడు నన్ను దెచ్చె,
అఖిలంబు త్యజియించి యలరు ఫకీర్లు
నీటిని నిప్పును దాటి పోగలరు
అనుమాట నమ్మబో రదము లౌ కపట
భక్తులు, తనబిడ్డ వహ్నితత్త్వంబె
యెరుగ కుండిన నాడు పెరిమతో వాని
కాంచి కాపాడ దే కనిపెట్టి తల్లి?
దైవికానందాబ్ధి తల మున్గియున్న
భక్తుల భారంబు భగవ దర్పితము,
క్రాగు మంటలనుండి కాచె కలీలు,
నీలు నద్యావర్త జాలంబునుండి
ప్రథితి మూసానావ రక్షించి నట్లు;
అట నీతగాడు సహాయపడంగ
బాల శిష్యుని కేమి భయము వాటెల్లు
'దజ్లా' స్రవంతి యెంతటి వెడల్పయిన?
తడిలేని నేలపై నడచి పోయినను
మురికియా నీకొంగు, మరియింక నెట్లు

జలముపై నడచెడు సద్భక్తులెట్లు?

## దృశ్య ప్రపంచముయొక్క అస్థిరత

ఇలవివేకులమార్గ మెంచిచూడంగ
త్రిప్పలుగా మెలికలు తప్పలేదొకటి,
పరమభక్తులు భగవంతుడుతప్ప
అంతయు నశ్వరమని తలంచెదరు;
ఇది సత్య సంవేది కెరిగింపవచ్చు,
కాని పండితులిట్లు గొణుతురు నెరసు
"అస్థైన భూమియు నాకాశమేమి?
ప్రజలు మృగంబులు పక్షులు నేమి?"
ఓయి వివేకి నీవొప్పగు ప్రశ్న
యడిగినాడవు, బదులాడినమాట
నీకు సమ్మతమేని నేవిన్నవింతు,
కొండ లెడారులు కూపారమంబ
రము మానవులు నప్సరః స్త్రీలు దేవ
దూతలు దయ్యాలు తుదకు సర్వంబు
సర్వేశునకు క్రింది స్థల మాక్రమించు,
ఆతని స్థితిచేత నంతయు స్థితము,
కల్లోలములు రేగి కడలి నీకంటి
కగపడు మహితమై యత్యంతశక్తి,
కదలు నత్యున్నతి గగన చక్రంబు

కాని లోకికులెట్లు గాంతురు దారి
జ్ఞానులు నివసించు ఘనరాజ్యమునకు?
అది యర్కబింబమే నణువంత లేదు,
సప్తసముద్రాలు జలబిందువంత
కావు, జ్ఞానుల రాజ్యకల్పనయందు,
ఉజ్వల కీర్తితో నొప్పు సుల్తాను
జెండాను పైకెత్త స్థితి సకలంబు
అస్థితి గర్భంబునందు నడంగు.

## పల్లెటూరి బాలుని లోకజ్ఞాన శూన్యత

గ్రామ సర్దారియు గడుసరి కొడుకు
షాహిసైన్యము మధ్య చనిరొక్కనాడు,
వెండికట్టెలవారి, వేత్రహస్తులను,
పరశుపాణుల, మేలి పట్టుటంగీల
వారల, నడుమున పసిడి జల్తారు
పట్టులు కట్టిన పార్శ్వవర్తులను,
వేటకాండ్రను, యుద్ధవీరుల బాణ
తూణీరధారుల, దోర్బలాత్మకుల
బాలుండు వెరగంది పరికించుచుండె,
ఒకడు చీనాపట్టు టుడుపు ధరించె,
మరియొక్కడు నృపాల మకుటంబు దాల్చె,

బాలుడిచ్చటి ప్రాభవంబు వైభవము
గని, తండ్రి హీనత కనిపెట్టి పోల్చి,
మారి పోయెను తండ్రి మానస స్థితియు;
మొగమున నెత్తురు బొట్టు లేకుండె,
భయమొంది యొకచాటు పట్టునకరిగె,
తనయుడిట్లనె ఏమితండ్రి, నీవైన
గ్రామంబునకు పెద్దగావె? నేతృత్వ
మందు గౌరవనీయు లందరయందు
మేటివి, యేమయ్యె మీచిత్తమంతు,
జీవితంబున ఆశ ఛేదించుకొనగ!
పాదుషా యన్నంత భయకంపనంబు
కలుగ నేలకో, తుంగగాలికి నట్లు!
అనవిని సర్దారి యాజనకుండు
తనయుని కిట్టుల తగచెప్పె నిజమె,
నీవన్న యట్టుల నేపాలకుడనె,
యైన, గ్రామములోన నేను నున్నపుడె
తద్గౌరవము నాకు దక్కెను గాని,
పాదుషా యెదుటికి వచ్చితి మన్న
భావంబె పెద్దల భయపెట్టుచుండు,
ఓరి బాలిశుడ, నీవూరిలో నుంట
లోక మెరుగమి, నీలోనీవు. గొప్ప
పదవి నీకున్నట్లు భావించినావు,

వక్తలు వచియించు పలుకు లన్నిటికి
సాది వాక్యములలో సాదృశ్యముండు

## మిణుఁగురు పురువు

ఉద్యానముల బీళ్ల నొకవేళ నీవు
గాంచి యుందువు, దీప కలికల పోల్కి-
ఖద్యోతములు రాత్రి కాంతిల్లుచుండ,
"మినుకు మినుకను మిణ్గురుంబురువ,
పగలేలకో నీవు బయటికిరావు?"
అని యొక్క డడిగెను, అగ్ని కీటకము
మృత్తికాజాతంబు మిడుగురు నోట
నెట్టి ప్రత్యుత్తర మిచ్చెనో చూడు-
"రేయుంబవళ్లు చరింతునె దారి,
అయిన నాప్రభయెంత యర్కుని ముందు!

## అతబల్ సాదు బి-జంగీని దీవించిన ఫకీరు

"నీదు గోరీపైని నిరత మీశ్వరుడు
కరుణామృతంబును గురిపించు గాక!"
అని సాదు జంగీని ఆశీర్వదించె
నొక పుణ్యశాలి, రాజూచిత మర్యాద
నర్థ మంగీనిచ్చి, యతని యోగ్యతకు

తగ గౌరవించి యాదరణంబుచూపె,
"చాలు దేవుడ"టన్న స్వర్ణాక్షరములు
అంగిపై జరికుట్టునందు కాన్పింప,
ఉన్మత్తుడై పయినున్న యంగిని
చీలిక పేలికల్ చేసె ఫకీరు,
సంక్షోభ తాపంబు స్వాంతంబునేర్చ
కదలి యెడారి మార్గము పట్టె నతడు,
మరు దశవాసులమధ్య నొక్కండు
ఇట్లనె మిత్రుడా, యేమిచూచితివి?
నీతీరుమారిన రీతి కన్పట్టు,
మొదట నీవు ధరిత్రి మూడు మారులుగ
ముద్దుపెట్టితివి, ఏమో కాని తుదకు
కాలిమడిమ త్రిప్పగా నక్కరేమి?
అనవిని హసియించి యాతడిట్లనియె
మొదట నాశా భయంబుల దేహావల్లి
గాలికి తుంగట్లు కంపించుచుండె,
"చాలు దేవుడ"టన్న సందేశ గురుత,
ఎట్టి వస్తువుగాని యెవ్వాడుగాని
తుదకు నాదృష్టికి తోచుట లేదు.

# అంతయుః దైవేచ్ఛ

మును శ్యామదేశంబు నను నొక్క పట్న
మందు, గగ్గోలుగా నరచిరి ప్రజలు,
వృద్ధ సజ్జనుని గారించి కొంపోవ,
కాలు సేతులకు శృంఖలములం దొడుగు
నపుడాతడన్న వాక్యములు నా చెవుల
నేడట్టుల ప్రతిధ్వనించు నిప్పుడును,
షాహి పురికొల్పి సంజ్ఞను చేయకున్న
నొరుడంత సాహసమూని ముచ్చిలునె?
అని యిట్లువచియించె నాతడు మున్ను,
నా నెయ్యు డెసకొల్ప నాపైకివచ్చు
వాడు శత్రువె యైన, పరమ మిత్రంబె,
నీకు గొప్పతనంబు నెగడి యుండుటయు,
కాక, భంగము కైదు కలుగుట గూడ
దైవేచ్ఛయంచునే తలతు సర్వంబు,
తిక్తౌషధము వెజ్జు తినిపించె ననుచు
వ్యాధి కోసము భయపడకు వివేకి,
వైద్యుడేమిచ్చిన వద్దనంబోకు,
అతని కంటెను రోగి యతివేత్త గాదు,

# పుణ్యాత్ముడైన ప్రేయసుడు

పలుయాతనలు పడ్డవానిచే చిక్కి  
నొకనిడెందము నాదు నుల్లంబుపగిది,  
అతడు వివేకి, శాస్త్రార్థకోవిదుడు  
అని తలంచిరి, వెన్క నాతడున్మత్తు  
డనుచు మ్రోగించిరి యంతటఁ డప్పు,  
మిత్రులచే దిను మెడగలీతాలు,  
ఫాలంబుమేకట్లు బయటికింజూపు,  
తలలోని యూహాలుకలగి, యాదలను  
కర్రదెబ్బలనోర్వ గలయట్లుచేసె;  
సఖునికై వహించు శత్రుపీడనము  
వెరవక నెయ్యుండు విషమునిచ్చినను  
అదియు నమృతమట్టులతనికిందోచు  
చెలికాండ్రనిందలు చెవిసోకకుండు,  
వారి నిర్మగ్నుడౌ వాడెట్టులెరుగు  
పైనివర్షించెడు వానజల్లులను?  
ఎడదకుదుటనురాయి పడిభగ్నమైన  
వానికేమిభయంబు, పరువుభంగంబు  
ప్రజల దర్పణమున ప్రతిఫలించినను,  
అచ్చరవంటి రమ్యాకృతిదాల్చి  
యొకరేయి స్త్రైతాను నొత్తై కౌగిటను

ఆవెర్రియువకుని, నంతపొద్దుటను
అతడు నమాజుచేయను శక్తిదూలె,
ఈ రహస్యము మిత్రులెవ్వరు గనరు,
కప్పుదగ్గరగుంట చొప్పడునీట
మునిగెనాతడు, శైత్యమున ముంచుపెరి
చలువరాతలుపళ్లు సంబంధించె,
"చలినీళ్ళబడి నీవు చచ్చెదవేల?"
యనుచు నిందించె హితాశయుడొకడు,
అంతట యువకుండు నరచి యిట్లనియె,
"జాగ్రత్త, నిందలు చాలింపుమింక,
కొన్నిరోజులనుండి కరగ్రుడునన్ను
వలపింపజేసెను, వానిప్రేమమున
చిక్కి యోరుపులేని స్థితినున్నవాడ,
సంతసంబున నొక్కసారియేనైన
నను విచారింపడు గనుమోయియెంత
కాలంబువరకు నాబాలునిభరము
నాత్మలో వహియింతు నార్తితాపమున
తనువు మృత్తికతోడ, నొనరించి, శక్తి
చే నిర్మలాత్మను సృజియించినట్టి
పరమేశ్వరునియాజ్ఞ భారంబుదాల్తు
ననినీవు నక్కజమందంగనేల
అతనికారుణ్య మౌదార్యఘునత

విరతిలేక యనుభవించుచుండియును.

## పుణ్యాత్ముల ఆత్మానందము

ప్రణయవంతుడవేని స్వార్థంబు విడువు,
అట్లుగాక సురక్షితార్థంబు గొనుము,
పరమేశ్వరుడు నిన్ను పెరిమతో దుమ్ము
చేసిన వెరవకు, శేషించియుండు
నాత్మ, దేహము నాశమైనపిమ్మటను
విత్తుచుట్టును మన్ను వేయకయున్న
మొలకెత్తి చివురుల వెలికొత్తబోదు,
స్వార్థంబునుండి నీయాత్మ విముక్త
మైన దేవుని ప్రేమ నది సంతరించు,
నిన్ను నీవెరుగంగ తెన్నుగన్పడను
స్వకము స్వకమ్మనుచు స్మరియింతువేని,
శాంతంబు వీడనా సూక్ష్మంబు తెలియు,
వలపు పెచ్చొత్తినవానికి, పాట
కాని రాగమె కాదు, పశుపక్షిశబ్ద
ములుకూడ గానమై మోదంబుగొల్పు,
ఈగలైనను దగ్ధహృదయునిపైని
ఎరకలల్లార్పవు, ఏమందువేని
యీగలట్లాతడు నెడతెంపిలేక
తలపైని చేతులు తాటించుకొనును;

భావంబు చెదరిన భగ్నచిత్తునకు
స్వరతారతమ్య విజ్ఞాన మెట్లుండు,
పక్షికూసిన నేడ్చు పక్కీరు కలగి,
గానంబు నాపడు గాయకుం, డైన
ప్రతినిమేషము చెవుల్ శ్రద్ధగా వినవు,
దగ్ధచిత్తులు త్రావ ద్రాక్షాసవంబు
జలచక్ర శబ్దంబె చాలు వారలకు
ఆనందమయమైన యనుభూతి గూర్ప,
భ్రమియింత్రు సలిల చక్రంబు మాదిరిగ
వృత్త నాట్యంబుల, వేదనామయత
సలిలంబుగార్తురు జలచక్రమట్లు,
ఏకాంతముననున్న యెడ మెడపట్ట
లోనికి కుంతురాలోచన శిరము,
ఆనంద తన్మయులై శక్తిలేని
యెడ చింపివేతురు మెడపట్ట వారు,
ఏమిగానమటన్న నేమి చెప్పుదును?
ఎవడు శ్రోతయటన్న నెరుగుదు నేను,
పరతత్త్వ శిఖరంబు పయినుండి వాని
ఖగముపై కెగురంగ, కడగియా దేవ
దూత సైతము దాని తోడరంగ బడలు,
ఆటపాటలయందు హాస్యములందు
సక్తుని యాసక్తి సబలమానందె,

ఇంద్రియలోలుండు ఎటుగానమెఱుగు?
సుప్తుండు కన్నెత్తు సుఖరావమునకు,
ఆనందమత్తాత్ము డటుమేలుకొనునె
పొద్దుటి తెమ్మెరంబూవులు విరియు,
బరువుగొడ్డటవిచ్చు వంటకట్టియలు
మత్తునానందంబు మది వెర్రితనము
అవనియంతటనుండు, నైన నంధుండు
దర్పణంబుననేమి దర్శింపగలడు?
దోషమారోపింప దొడరకుమత్తు
వలన పిచ్చెత్తిన భక్తునిపైని
జలపూర పతితుండు పలువిధంబులుగ
కాలుసేతులువట్టు ఱాచుకొనంగ
ఒంటె నరబ్బివాడుసికొల్పినంత
అది యెంతో సంతుష్టి నాడుటనీవు
కనియుండలేదె యెక్కాలమందైన,
ఒంటెకట్టుల హర్షముత్సాహమెదను
నరునకు లేకున్న, ఖరమే యతండు.

## వేణుగానమొనరించిన కుమారుడు

కండచక్కెర మోవిగల యువకుండు
వేణువు పూరించువిధము, డెందముల
మంటలరెల్లట్లు మండించుచుండె,

పలుమారు తండ్రి యవ్వానిపై నరచె,
కుపితుడై పిల్లనగ్రోవి దహించె,
ఒకరేయి కొమరుని యుత్సాహభరిత
వేణుగానము తండ్రి వీనులంబడియె
మొగమున చెమ్మటబొట్లు జాల్వార
నిట్లనె జనకుండు ఈతూరి వేణు
గానంబు నాయెద కార్చిచ్చు వెట్టె,
దైవచింతను పిచ్చిదాకినవారు
మైమరపున నృత్యమండలిలోన
చేతులు చాపుచు పాతరలాడు
టెందుకోయది నీకు నెరుకయె చెపుమ
తమహృదయంబులో ద్వారకవాట
బంధంబువీడ ప్రపంచంబుతోడ
నికపనిలేదని యెరిగించునట్లు
చేతులల్లార్తురు జ్ఞాతలై వారు,
ఎవనికి చొక్కాలనెగురు చెంగులును
ఆత్మలట్టులతో ము నాప్రియమిత్రు
స్మరణ నృత్యము ధర్మసమ్మతంబగును,
ఈదుటలో నీవ ప్రహీనుండవంచు
నొప్పుకొందునుగాని, యుడుపులుతీయు
కాలుసేతులు నంతకంటె తేలికగ
నీట తాటింపంగ వాటమైయుండు,

కైతవంబును కీర్తి గౌరవంబనెడు
కట్లబొంతను దాల్చుకొనక వర్జించు,
బొంత భారంబున, మునిగినవాని
బలముగిలంబును భగ్నమైపోవు,
ఐహికసంబంధ మవగుంఠనంబు
వలె వ్యర్థమైయుండు; బంధముల్ సడల
ఐక్యంబు నొందెదవా ప్రభాసమున.

## మైనపువత్తిదీపముపై మిడుత వలపు

శలభంబున కెవండో సలహానొసంగె
ఓయి యధముడ, నీకోపినయట్లు
అర్హ్వమాదాని నెయ్యంబు సాధించు,
హానిలేని పథంబునం కాల్మెట్టు,
దీపంబునకు నీకు తీరని ప్రేమ
ఎప్పటినుండి యింకెప్పటివరకు?
మంటలందిరుగ 'సమందరు' గావు,
ధైర్యంబువలయును, తర్వాతపోరు
అంధమూషికము సూర్యాతపంబునకు
దాగియుండును, ముష్టిదార్ఢ్యంబువాని
యెదుట బలాత్కార, మెరుగమిగాదె!
అతడు నీకువిరోధియని యెరింగి ...ను

ఆత్మ మిత్రుఁడటంచు నంగీకరింప,
తెలివిలోపంబని తెలుపంగవలయు,
అతని కార్యములందు నసువు లర్పింప
మంచిచేసితివని మెంచరు జనులు,
పుత్రిక నిమ్మని భూమీశునడుగు
బిచ్చగాడు కడింది పిచ్చి భావముల
తలపోయుచుండెను, తన్నులు దినెను!
రాజులు సులతాన్లు రమణిపై దృష్టి
పరపుచుండగ నిన్ను వంటి ప్రేయసుని
నెటులెక్కసేయు నాయింతులమిన్న?
నీవంటి నిరుపేద నెయ్యుని గోష్ఠి
కని ప్రేమ మర్యాద గనదని మెంచు,
తక్కువారికి మెత్తదనము చూపినను
దిక్కుమాలిన నిన్ను ధిక్కృతింగనును,
ధుఃఖాగ్నిలో క్రాగి తూలెదు మిడుత
ఏమన్నదో చూడు! "ఎంత యక్కజము!
పసచెడి నేకాల భయమేమి నాకు?"
అగ్ని నాయెదలోన నలరు, నయ్యదియు
అల ఖలీలున కట్టులయ్యె గులాబి,
హృదయాపహారిణి యెద చెంగుపట్టి
కడగి నాయెడద యాకర్షింపలేదు,
కాని నాయాత్మను గట్టిగా నొడిసి

పట్టి నెచ్చెలి ప్రేమ పడలాగికొనియె,
సొంతంబుగా నేను చొరజోను చిచ్చు;
వలపు పాశములు నాగళము నట్లీడ్చె
ఎంతో దూరమునుండి యిటు క్రాగుచుంటి,
ఇప్పుడే నాయెద యేర్పుటకాదు,
ఇంతినర్ల వలపుతో నిటుసేయలేదు,
యచల సన్న్యాసిని యనిచెప్పవచ్చు,
సతి పదంబుల బడి సమయ వాంఛింతు,
ఎవరు నిందించెదరీ ప్రేమచింత?
నా నాశనమునందె నాకేల కోర్కె,
అని యెఱుంగుదువె? నేనాత్మ నర్పింప
సకియ జీవించుట సర్వసమ్మతము,
ఇట్టుల విరహాగ్ని నెరియుచుండెదను
అదియు నానుదికెక్కినట్టి హేతువున,
ప్రియుని ప్రేమాగ్ని యాప్రేయసిందాకు,
"నీకర్త యగునట్టి నేస్తక త్తియను
తిరము సహానుభూతిని గల్గు దాని
చేపట్టుమని యెన్ని తేపలు చెవిని
నూరిపోసెదవోయి నోరు నొప్పెత్త,
వలపు పిచ్చెత్తిన వానికి నీవు
తెలివి బోధింపకు, తేలుకాటునకు
నేడ్చువానిని చూచి, "ఏడువవద్దు"

అని యుపదేశించినట్టుల నుండు,
హితము వానికి మది కెక్కదటంచు
నీ వెఱుంగుదు వేని నీతి చెప్పకుము,
కల్లెంబు చేనుండి జుల్లినవాని
నడుగరు "గుఱ్ఱంబు నల్లనందోలు
మోయి గులాము" యంచూరక నొరులు
"వలపు నిప్పగు, నీతిపవనంబుబోలు"
అనునిట్టి చతురోక్తి యా సిందుబాదు
కథలోన సంతోష కలితమైతోచు,
గాలి నిప్పును చేర కలలెగదట్లు,
చిరుత వేఁటులుదిని తెరలు ద్వేషమున,
నీవొనర్చిన చెడ్డ నేగాంచినపుడు
నన్ను నీవంటి మానవునకు నెదుట
నిల్పెదు, నీకన్న నెప్పరిదైన
వాని నన్వేషించి వ్యర్థంబుగాని
యటు కాలముం బుచ్చనౌను, లేకున్న
నీవంటివానితో నెయ్యంబునల్ప
జీవితలాభంబు చెందవునీవు,
ధరనహంభావులు తమవంటివారి
గలసి వర్తింతురుగాని సర్వేశు
మననామృతము గ్రోలి మత్తులౌవారు
అతిభయంకర మార్గమందు చరింతు9,

అది నేనీ కార్యమందు వర్తింప
ప్రాపంచికాశలు వర్జించినాడ;
ప్రేమకంటె బలియగు ప్రియుడు యథార్థ
వంతుడు. శంకించువాడు సొంతంబు
ప్రేమించుకొనునట్టి పిరికి మానవుడు,
మాటున పొంచి యామరణంబు నన్ను
కనురెప్పపాటులో కడతేర్చగలదు
అంతకంటెను శ్రేష్ఠమా ప్రియురాలి
చేతిలో నాముక్తి సిద్ధించునేని,
తలవ్రాత తప్పదు, తథ్యంబు మృతియు,
గాన నెచ్చెలివల్ల గలుగుటంజేసి
సంతోషకరమైన చావునాకదియు;
నిస్సహాయుండవై నీవొక్కనాడు
ప్రాణంబు నర్పింప వలసియేయుంట
అదిమేలుకాదె నీయసువులు ప్రాణ
వల్లభ పదములంబడి కోలుపోవ!

## మైనపువత్తి దీపమునకును మిడుతకును జరిగిన సంభాషణము

ఒకరేయి నిద్రపట్టకయుంట. నాకు
జ్ఞప్తియున్నది, వింటి శలభంబునకును
తేనెమైనపువత్తి దివ్వెకుజరుగు

సరససల్లాపంబు, శక్యమాకొలది,
ఇట్లనె శలభంబు "ఏను ప్రేయసుడ,
అగ్నిలో నుసియైన నదిన్యాయమగును,
కాని నీకును నేమి కారణంబౌదవె
కన్నీరు పెట్టంగ, క్రాగుచుండంగ"?
దీపమిట్లనె ఓయి దీన సఖుండ,
మధుర మిత్రంబైన మధువు నన్నుండి
చెదరికారుచునుండె, క్షీరీను వెడల
ఘర్మాదు కటు దుఃఖవహ్ని పైకొనియె,
పాలియున్న కపోల పాళులనుండి
ప్రతి నిమేషము బాష్పవారి జారంగ
నిట్లనె దీపంబు ఈప్రేమ వృత్తి
నీపని కాదోయి, నెగ్గశక్తుడవె?
సహనంబు, నిలుచుండు శక్తియు లేదు,
అపరిపూర్ణుండ, నీవగ్నికీలలను
గని బుద్ధ సెప్పెదు కాలికిం ద్వరగ,
నేను నిశ్చలముగ నిలుచుందు, దేహ
మంతయు శిఖలోన నంతమౌదాక,
ప్రేమాగ్ని కీలనీ రెక్కలం గాల్ప,
ఆపాదమస్తకం బంతయుంగాల్చు
నన్ను, చూడుమ యెంతో నవసినదాన!
కొంతరాత్రి గడచినంత పూబోణి

ఊదె మైనపువత్తి నున్నట్టులుండి,
వత్తి యారియు పొగ పైకేగు నపుడు
అది యిట్టులనియె ఓయయ్య ప్రేమకును
అంత్యమిట్టులనుండు, ఆప్రేమ నేర్వ
తలచద వేని నెచ్చెలిచేత చావె
ప్రియమగు, విరహాగ్ని వేగుటకంటె,
ప్రణయినిచే చంపబడిన యవ్వాని
గోరిపై నీవేల గోడునొందెదవు?
అటుగాక యందుకు హర్షింపవలయు,
అంగీకృతుండయ్యె నను కారణమున,
ప్రేయసుండవె యైన ప్రేమచింతలను
కడుగుకొనింబోకు, కాక యాసాది
యటు నైహికేచ్ఛల నన్నియు విడువు,
తన యిష్టమును పొంద వెనుదీయబోడు
విశ్వాసి, వానిపై విశిఖముల్ రాళ్లు
పరులెడ మియ్యక గురిపించుచున్న,
"జలధి ప్రయాణంబు సరికాదు నీకు"
నని చెప్పియుంటిని, ఆమాట వినక
పయనింతువేని నీప్రాణముల్ తనువు
అడరు తుఫానుకు నర్పించుకొమ్మ

---

## నమ్రత

పరమ పవిత్రుండు పరమేశ్వరుండు
సృజియించె నిన్నుమున్ మృత్తికతోడ,
కావున దుమ్మట్లు కమ్ము దాసుండ;
లోభంబు గర్వంబు లోక పీడనము
పనివడి యార్జింప వలవదెవ్వనికి;
నిను మట్టి నిర్మించె, నిప్పు కావలదు;
గర్వించి తలయెత్త గాఢాగ్ని శిఖలు,
అడకువ క్రిందికి నడగెను దుమ్ము,
ఆనీచవహ్ని గర్వాంకితంబౌట
దానితో సైతాను తగసృజియించె,
దీనితో నిర్మించె మానవ ప్రతతి.

## అడకువవలన నౌన్నత్యము

అభ్రంబు నుండి వర్షాంబు కణంబు
వనధిలోపడిదాని వైశాల్యమరసి
సిగ్గొంది యిట్లనె: సింధువదేడ?
నేనేడ? దేవుడా, నిజమిట్టులుండ,
నన్ను పోల్చుకొనంగ నలుసంత లేను!
తనుతా తిరస్కారమున చూచుకొనగ,
నొక శుక్తి దానిని నోడిలోన చాకె;

దైవంబు బిందును తగుచోట నిలుప
ఆణిముత్యంబయి యది కీర్తి గాంచె;
నైచ్యంబు వలన నౌన్నత్యంబుఁగల్గె;
అస్థితిలోనుండి యార్జించె స్థితిని.

## దైవభక్తులు తమ్ముఁ తాము నీచముగ నెంచుకొనుట

సౌనగు। ప్రాయమువాడు బుద్ధిమంతుండు
పావనాత్ముడు వార్ధి పయనంబుచేసి
తురికిలో దర్బందు పురికి విచ్చేసె;
వానియందు సమస్త వరణీయ గుణము
లతుల వైరాగ్యంబు నరసి, సామాను
నొక మసీదున పెట్టియుంచిరి బసగ,
అటులుండ నొకనాడు నాతనిగాంచి
అచ్చటి బోధకుండనియె "కుమార,
చెత్త చెదారంబు చేరినదుమ్ము
చిమ్మి శుభ్రము చేసికొమ్ము మసీదు."
ఆమాటలనువిని యధ్వగుండంత
వెంటనే బయటికి వెడలె నెయ్యెడకొ,
క్రమ్మర నచ్చోట గానంగరాడు,
"సేవచేసెడు శ్రద్ధ చిదుపయంతైన
ఆ ఫకీరుని మతి నలరంగబోదు"

అనిచిన్నలుం బెద్ద లతని గురించి
తమకిష్టమున్నట్లు తలపోసికొనిరి,
సేవకుండొకనాడు త్రోవ నాతనిని
చెయిపట్టి యిట్లనె "చెడ్డచేసితివి,
నీయభిప్రాయంబు నిశితంబుకాదు,
స్వాశయవిశ్వాస జాల్ముండవీవు,
తెలియవే మనుజులు దేవుని సేవ
అంతస్తు హెచ్చయి యలరుచునుండ?
ఈ మాటలన్ విని యెదకందువార
కపటంబులేని దుఃఖమున నిట్లనియె
పక్కిఁడు మిత్రుఁడా, భాస్వంత హృదయ,
అట చెదారము దుమ్ము నావంత లేదు,
ఆ పవిత్ర స్థలమందు నేనొకడ
కల్మష కలితుండగాన, "మసీదు
పావనత్వము దోష పతితంబుగాక
పరగుగాక"ని నేనె పథముపట్టితిని,
తనమేను నీచమానని యెంచుదారి
తప్ప, దర్పేసికి తనరదింకొకటి,
ఔన్నత్యముంగోర, నడకువంగొనుము,
ఆకప్పుపై కెక్కనట్టి నిశ్రేణి
కాక వేరొకదారి కనిపింపబోదు,

# సుల్తాన్ బాయజీద్
# బుస్తామి నమ్రత

బాయజీద్ బుస్తామి పండుగదినము
ప్రత్యూషమున స్నానవసతినివీడి
బయటికి కాల్మెట్ట, పై మేడనుండి
తెలియకొక్కడు బూదితల కుమ్మరించె,
తలపాగయును వెంట్రుకలు చెదరంగ,
తనకృతజ్ఞత తెల్పుకొనగ దేవునకు
చేతులు మొగముపై చేర్చి యిట్లనియె
ఓసిప్రాణమ, నిరయోజ్వాలవహ్ని
పడుటకర్హుండవైనవాడ, నీనాడు
బూది పైబడినంత మోముత్రిప్పుదునె?
పెద్దలు తమపైని పెట్టరు దృష్టి,
మొండియహంభావునుండి తత్త్వంబు
గను జ్ఞానచక్షువు కాంక్షింపబోరు,
పేరుప్రతిష్ఠల, పెద్దతనంబు
కలుగ, దౌన్నత్యంబు, కపటనటనల
తనకుదా ప్రకటించుకొనుట చేపడదు,
వేషధారిత్వంబు వీడిన నరుడు
స్వర్గంబునకునేగు ప్రళయకాలమున,

అడకువ హెచ్చించు నౌన్నత్యగరిమ;
అహమింప దుమ్ములో నణగిపోయెదవు
పొగరుబోతగు కోపి బోరలంబడును,
గొప్పతనమునీవు కోరెదవేని
పాకులాడకుదాని పదములవెంట.

## గర్వముయొక్క అంత్యము

గర్వితమదియందు గనలేవుమతము
తనుదాను పూజించుకొను మందమతికి
ఈశ్వరప్రత్యక్ష మెటులబ్బగలదు?
పై మెట్టుపై నీకు భావమున్నెడల
అధములపోల్కి, నీవన్యులనెవరి
తిక్త తిరస్కారదృష్టి చూడకుము,
గర్వంబునందు యోగ్యతలేదటంచు
ఎంతదాక వివేకి చింతింపవలయు?
సత్ప్రవర్తనగలసాధువటంచు
ప్రజలు నిన్ గొనియాడు పాటియశంబు
కంటె హెచ్చుగ నేలకాంక్షింతువీవు?
నీవంటి దరిచేసి నిన్ను గర్వమున
కనుగొన, వానిని ఘనుడనంబోకు,
ఈవు సైతము వానియెడ నహంకృతిని
చూప, వానికినీవు చూపట్లుగలవు

గర్వితుండును నీకు కనిపించునటుల,
ఉత్తమపదవిలో నుండిననీవు
జ్ఞానమున్న, పతితుగని నవ్వబోకు,
పలువురు పదవిలో పతితులైనారు,
వారిస్థానంబులు పతితులుగొనిరి,
ఒప్పుకొందునునీకు తప్పులేదంచు;
దోషయుక్తుని నన్ను దూషింపవలదు;
ఒకడు కాబా తల్పుటుంగ్రింబుపట్టి,
పానశాల నొకండు పడె కైపుమించి;
ఈశుడాతనిపిల్వ నెవరాపగలరు?
ఇతని నిషేధింప నెవడువత్తాసి
వచ్చి క్రమ్మరుపంగ వలతియౌవాడు?
అతనికార్యములు సహాయంబుపడవు;
ఇతనికి ననుతాప గృహకవాటములు
ఎల్లప్పుడును తీసియే పెట్టబడును;

## ఏసుక్రీస్తువు - పాపి

ఏసుక్రీస్తువునాటి యొకకథవింట
తరుచు చరిత్రవేత్తలు చెప్పుచుండ,
అజ్ఞానమున తప్పులాచరించుచును
వ్యర్థంబుగాపుచ్చె బ్రతుకునొక్కండు;
కఠినచిత్తుడు పాపకార్యలంపటుడు

సాహసవంతుండు, సైతాను కూడ
అతని మాలిన్య మరసి సిగ్గిల్లె
ఫలితశూన్యంబుగా వాని కాలంబు
గడచె సంతప్తుల యెడదయొండేని
యూరడిల్లదు వాని యుపకృతివలన,
తలలో వివేకంబు నలుసంత లేదు
నిలువెల్ల గర్వంబు నిబిడీకరించు,
కడు నిషిద్ధములైన కబళముల్ మెసవి
యుదరంబు కొవ్వున నుఱువెక్కియుండె,
పాపంబుచే చెంగు పంకిలంబయ్యె,
కరిదువ్వనిల్లెల్ల కార్కొనియుండె.
కన్నులుండియును చక్కనిదారి చనడు,
వీనులుండియు తాను వినడు హితంబు,
కరవువత్సరమును గర్జించునట్లు
జనులు వానిని గాంచి శపియించుచుండ్రు,
విదియ చందురు రేఖ వ్రేలెత్తి దూర
మున నుండి చూపు సంచున నూరి జనులు
చోద్యంబుగా వాని చూపెట్టుచుండ్రు;
ఇంద్రియలోలుడై యేర్చెను పంట,
ఆవంత సత్కీర్తి నార్జింపడతడు
దుష్టచరిత్రుని దురితముల్ ప్రబల,
కవిలెలో నెడలేదు కడమవ్రాయ,

పాపి స్వాభిప్రాయపరుడు. కొమార్తు
డహారహంబు రేలు నవిచారబుద్ధి
తప్పత్రాపుట మత్తు తలకెక్కియుండు;
వినియుంటి, నొకనాడు వనములనుండి
క్రీస్తువుఒక భక్తుగృహముదగ్గరగ
మరలుచుండెనటంచు; మరవాసిచూచి
దిగివచ్చి యేసుని దివ్యపాదముల
తలమోపి మ్రొక్కెను ధరణిసోకంగ,
పాపియు దురదృష్టవంతుండు, వెలుగు
చూచినమిడుతనా చోద్యంబునొంది
దూరమునుండి యవ్వారినిగాంచె,
తప్పుడై తలపోసి, ధనికునిముందు
నిరుపేదయట్టులజ్జ పొరసెనతండు,
అవిచారముగ రేలు దివసంబులట్లు
చేసినరట్టుకు సిగ్గువహించి
గూఢంబుగా క్షమకోరుచునుండె,
"అయ్యో! నాజీవిత మవిచారబుద్ధి
కడవెళ్ళపుచ్చితి గర్వమానట్లు,"
అనుచు కన్నులను దుఃఖాశ్రుబిందువులు
జలదంబుకురియు పెక్కజడి యట్లుకార్చె,
బ్రతుకు రొక్కంబును పాడుచేసితిని,

ఎప్పుడైన నావంటి హీనవర్తనుడు
ఉండకుండునుగాత! యుర్విపై నొకడు,
వాని బ్రతుకుకంటె వరమైనను చావు!
బాల్యంబునకు స్మృతి పడసినవాడు
తప్పించుకొను, సిగ్గు దాల్చిన శిరము
కొనిపోడు ముదుకట్లు తన గోరి కడకు,
ఓసృష్టికర్త, నన్నొత్తు పాపముల
మన్నించు, మది నన్ను వెన్నడించినను
చెడుసహవాసమై చేటుమూడించు,
ఈమూల నొక పాపి వృద్ధుండు మొఱ
లిడె, "చేయి యందిచ్చు నీశ్వరా, నన్ను
నిట్టి దుఃస్థితినుండి యెడపి రక్షించు"
మనిలజ్జ తలవంచె, నార్తి నశ్రువులు
గండ భాగములపై కారుచునుండె,
ఆవైపునుండి గర్వాంధభక్తుండు
మోముమూడ్చుచు బొమల్ ముడివెట్టుకొనుచు
దూరమ్మునుండి యాతురితాత్మ గాంచి
యిట్లనె "ఈగర్వి యేల మావెంట
పడియె? నజ్ఞుడు హతభాగ్యుండు వీడు
మేమెట్లు సములమై మెలగంగవచ్చు?
నరకాగ్నికీలల దరిగొన్నవాడు,
బలు కోర్కె పయ్యెర బ్రతుకు తూర్పెత్తె,

ఏమంచి కూర్చె నీ హీనుండు బ్రతికి,
నాతోడ నేసుతో నడప నెయ్యంబు?
ఎంత చక్కగనుండు నితఁడు కష్టముల
గాపక నాయొద్ద, సొంత కార్యముల
నరయుచు నెట్టన నరకంబు చేర!
సంతసంబిడని యీజాల్మని మోము
నను తపింపగ చేయు, నారక వహ్ని
తాకకుండును గాత దైవంబు కృపను!
అంత్యదినంబున నందరం బిలిచి
యట జమాఖర్చులు అరసెడు నపుడు
వాని నన్నును నొక్క పరి లేపవలదు
అని ముందుగా నిన్ను యాచింతు దేవ,
భక్తుండు నీరీతి వచియింపుచుండ,
ఏసుకు వినిపించె నీశు దివ్యోక్తి
"అతడజ్ఞుడైనను నితఁడు పండితుడు
అయిన, నిద్దరి మొర లంగీకరింతు;
బ్రతుకు వ్యర్థముచేసెవా, డట్టులయ్యు
నను గూర్చి మొరపెట్టె వినతుడై యార్తి;
నిస్సహాయుండయి నిండు దుఃఖమున
ననువేడు వానికి గనిపింతు ప్రీతి,
వాని పాపములెల్ల వరుస మన్నింతు,
స్వర్గంబునకు వాని పంపింతు కరుణ,

భక్తుండు వానితో స్వర్గంబునందు
సమపంక్తి కూర్చుండ జంకును సిగ్గు
గనునేని. యతనితో ననుము నీవిట్లు
"అంత్యదినంబున నా పాపి గాంచి
సిగ్గుపడకుము, యట్లు చేసెదవేని
నిరయంబులోనిన్ను నిలుపుదు, రతని
నాకసౌఖ్యంబుల నంద పంపెదరు,"
దురితాత్ము నెడద నెత్తురులొల్క నార్తి,
భక్తుండు భక్తిని ప్రాపుగా నెంచు,
దైవ సన్నిధియందు తలనిక్కుకంటె
అడకువ మేలని యరయడో యేమొ!
అంగిని శుభ్రత యాత్మలో మురికి
గలవాడు నరకంబు తలుపులదీయ
తాళంబుచెవికయి తడవంగ నేల?
భగవంతు సన్నిధి పరమ నైచ్యంబు
నిస్సహాయత మేలు 'నే'నను నిక్కు,
భక్తుండనన్న గర్వంబుకంటె,
నిను నీవె పుణ్యాత్మునని ప్రశంసించు
కొనుదేని, నిజముగా కుటిలుండవీవు,
పరమేశునొద్ద నీపరువు గర్వంబు
కాసుకు గొరగావు, కరుణింపబోడు,
పురుషుండవగుదేని పురుషకారంబు

గురిచి చెప్పకు; ప్రితి గుర్రింపురాతు
చెందు గమ్యస్థలి చేర్చలేకుండు,
పిస్తాకు పప్పుండు విధముతలంచి
పండితమ్మన్యుని పరికించిచూడ
అతడుల్లిపోలిక నంతయుంబోరలె!
ఇటువంటిభక్తి నీకెటుకోరయాను?
తప్పులుమన్నింప దైవంబు వేడు,
దైవంబునకు మంచితలచి, లోకులకు
తప్పు చేసెడు దుర్విదగ్ధుండు, భక్తి
ఫలమును భుజియింపగలడె యెన్నటికి?
మరవరు ప్రాజ్ఞులు మంచిమాటలను,
జ్ఞప్తి పెట్టుకొనుము సాదివాక్యంబు:
"పదిమందికిని భక్తిప్రకటించువాని
కంటె, దైవము భీతిగలపాపిమేలు."

## పండితుడైన దరిబేసి - గర్వితుడైన ఖాజి

చినిగినచొక్కాయి సరిలేనితనము
గల పండితవరుండు ఖాజి సౌధమున
గోష్ఠిలో మునిపీరి కూర్చుండియుండె;
ఖాజి యాతనివైపు కరకరంజూచె,
పరిచయకరుడైన బంటు లెమ్మనుచు

వానిచొక్కా చెంగుపట్టి యిట్లనియె:
"తెలియవే నీవు, ముంగలిపీఠినుండ
నర్హతలేదని? ఆవెన్కఁ జనుము,
నిలుచుండు, కాకున్న వెలువడుమిపుడే,
గొప్పమనుష్యులు కూడినచోట
సాహసింపకు, గోళ్ళశక్తి లేకుండి
సింహంబుపోలిక చివ్వకురాకు,
కోరినవాడెల్ల కూర్చుండ తగడు
పండిత సభయందు ప్రథమపీఠమున,
దాతృత్వమునుబట్టి తనరు గౌరవము,
పదవి యోగ్యతచేత ప్రాప్తించుచుండు,
అన్యులహితము నీకక్కర యేమి,
ఈసిగ్గుపాటు నీకెన నైనశిక్ష
గౌరవంబుగ క్రిందికడ గూరుచున్న
వాడెత్తుపయినుండి పడడు భంగమున;
పొగ నిప్పులోన పెల్లెగయు చందమున
వేడినిట్టూర్పులు వెడలించి లేచి
దరిచేసి వెనుకటితట్టుగూర్చుండె,
'అదియేల' 'నేనొప్ప' నేను గాదనుచు
తగపూర్వపక్ష సిద్ధాంతంబులెత్తి
వాదించుచుండిరి పండితవరులు
మెడలు ముందుకుచాపి నుదులుగుప్పించి,

గోళ్ల ముక్కుల చీల్చుకొని పరస్పరము
పోరులోపడు కోడిపుంజులయట్లు;
తలపడిరని నీవు పలుకంగవచ్చు;
ఒకడు కోపంబున నుడికి మైమరచి
కై పెక్కినట్టుల కనిపించుచుండె,
మరియొకండిరుకేల ధరణిగుద్ది
వాదబలంబును ప్రకటించుచుండె,
సరి చక్కవివరింప సాధ్యంబుకాని
యొక సమస్యను విప్పనోడిరివారు;
చినిగిన చొక్కాయి చివరగూర్చున్న
వాడు తర్కమునందు పాల్గొననెంచి
గర్జించు సింహంబుగతి నిట్టులనియె·
"బలమైన సాదృశ్యములు ప్రమాణములు
సత్యదృష్టివలయు సవరించిచెప్ప
తర్కంబులో మెడ ధమనులుబ్బంగ
చాపినంతనెయేమి సాధించినారు?
వక్తృత్వమనుచెండు పరపనాచేత
చౌగాను గలదన, సభలోనివారు
చక్కగా వివరింప సాధ్యమానేని
వేగచెప్పుమటంచు వేడిరివాని,
వాగ్ధార కలమున వారిచిత్తముల
ముద్దుటుంగరమున గుద్దినలక్క

పడుముద్రియట్టుల బాగుగానంట
రచియించె చిత్రంబు రమణీయముగను,
బాహ్యంబునకు దాగబడియున్న ప్రతిభ
సర్వాంకషంబుగ సత్యతందాల్చె,
కపటపండితుల వాగ్వాదఘాలమున
కలము గీటును పెట్టి ఖండించెనతడు,
ప్రతిమూలనుండి మేల్ భళిభళీయంచు
అతని ప్రజ్ఞాశక్తి నగ్గించిమెచ్చి
వేమార్లు దీవనల్ వెదచల్లినారు,
వక్తృత్వహాయము పైవరకునెక్కంగ
ఖాజిపంక నిమగ్నఖరమటులుండె
తన పట్టుటంగీని తలపాగతీసి
యతనికి పంపించి యతిగౌరవముగ
''అకట! మీశక్తిని నరయంగనైతి,
తమరు విచ్చేయ కృతజ్ఞతం దెలిపి
యభివందన మొనర్పనైతి, మీవంటి
పాండిత్యధనమున్న ప్రాజ్ఞశేఖరులు
కడపటివరుసలో పడియుంటచూచి
జాలినొందితి, నాకు చాలసిగ్గయ్యె,
నని ఖాజి విన్నవించెను నొచ్చుకొనుచు,
ప్రణయంబుచూపుచు పరిచయకరుడు
ఖాజి పాగా తెచ్చె కడపంక్తినున్న

చింపి చొక్కావాని శిరముకై సేయ,
వాడు దగ్గరకును వచ్చుటగాంచి
వలదు వద్దని చేత వారించు చిట్టు
లనియె దూరంబున నాగుమచ్చుటనె,
గర్వలాంఛనమగు ఖాజి పాగాను
నాతలంబెట్టుట న్యాయంబుగాదు,
ఏలన నేనైన నేబదిమూర
తలపాగ భారంబు తలదాల్తునేని
రేపు గర్వంబున రిక్తులంగాంచి
అధములట్టులజూడ నవసరంబగును;
సను, స్వామి, దేవర, ఘనుడవౌ ఖాజి
అనుచు సంబోధించు జనసమూహములు
అధములట్టుల నాకు నగపడుచుంద్రు,
మలములేని జలంబు మంటి కూజాను
ఉన్న, బంగరుపాత్ర నున్న భేదంబు
గలదె యెన్నండును? తలలోన మెదడు
తెలివితేటలును గావలయునుగాని,
ఇంత చక్కనిపాగ యేల నాతలకు?
తలపెద్దదైనంత గలుగదు తెలివి,
గుమ్మడిపండును గొప్పదైయుండు
తొలిచిచూచిన లోన తొల్లగానుండు,
తలపాగ గడ్డంబు గలుగ నిక్కముగ

అదిచూడ తూలంబు ఇది యెండు గరిక,
పటములో బొమ్మల్లు బాహిరంబునకు
అగపడు మానవుండాబొమ్మయట్లె
పలుకక మౌనంబు వహియింప మేలు,
యోగ్యత కొలది నీవున్నతింగోరు,
శని యట్టు లున్నతస్థానంబుగలిగి
గురదృష్టమునజిక్కి తూలంగబోకు,
చాపరెల్లు ప్రశంస సలుపమేలగును,
చెరకుకట్టులదాన చిత్రగుణంబు
గల, దిట్టి తెలివితేటలు లేనివాని
నరుడని నినునెంచ న్యాయంబుగాదు,
వెనుక దాసశతంబు వేచియుండియును,
ఆస నజ్ఞుడు పంకముందున్న గుల్ల
చేనెత్త చక్కగా చెప్పెనానత్త,
"కాసిచ్చి ననుగొన కాంక్షింపరెవరు
పట్టువస్త్రంబున చుట్టకు పిచ్చి,"
ఇతరులకన్న తా నెక్కువగాడు
ధనము ధాన్యంబున్న ధనికవర్యుండు,
పట్టుడేరాలోన వసియించికూడ
ఖరముమారగబోదు ఖరమెయౌగాని,
ఈవిధంబుగవక్త యెదలోని ద్వేష
మును వాగ్జలంబున మొదలంట గడిగె,

కష్టచిత్తులమాట కరకుగానుండు;
శత్రువుపడు నేని జాగుసేయకుము,
బలముండగనె విరోధుల తలక్రొవ్వ
కటకటంబెరుకుము, కసిదీర్చుకొనగ
నవకాశమబ్బిననంత రంగమున
కార్కొన్న వగదుమ్ము కడుగంగగలవు;
వాని వాగ్దౌర్జన్య వాగురంజిక్కి
గప్చిపుమనియుండి ఖాజి యిట్లనియె,
“ఎంతదుర్దినమురా యీనాడునాకు!”
అనిప్రేలు మునిపంట నాశ్చర్యమంది
కరచుచు వానిపై కన్నులురెండు
జ్వలియించు తారలవలె నిల్పిచూచె,
అటనుండి యువవక్త యళుకింతలేక
బయటికివెడలి యేప్రక్కకు చనెనొ
వానిపోబడిసుంత గానరెవ్వరును,
సభలోన పెద్దలసందడి రేగె,
“ఈగర్వశీలి యిందెటనుండి వచ్చె”
నని యందరడిగిరి యటనున్న బంటు
బయటివీధికివచ్చి పలుచోట్లుతిరిగి
“ఇటువంటి మొక్కట్లు నిట్టిచిహ్నములు
గల దరిజేసిని కన్నారెమీరు”
అని ప్రశ్నచేయగ, ననియె నొక్కండు

అట్టి మాటలతీపు నట్టి చిహ్నములు
గలయాతడొక్కడే గలడు పట్నమున
సాదిమహాకవి, చాలు పేర్వ్యన్న,
పదివేల దీవనల్ వర్షించియనియె
అప్రియ సత్యంబునైన నాతండు
ఎంత తీపొదవగ నెత్తిచూపించె!



అరుణా ప్రెస్ - నెల్లూరు

# కవికోకిల
# దువ్వూరి రామిరెడ్డిగారి
## సాహిత్యం

---

1. కవికోకిల గ్రంథావళి మొదటిభాగము (కావ్యములు) 6—0—0
2. ,, ,, రెండవ భాగము (ఖండకావ్యములు) 5—8—0
3. ,, ,, మూడవభాగము (నాటకములు) 4—0—0
4. ,, ,, నాలుగవభాగము (వ్యాసములు) 3—0—0
5. ,, ,, అయిదవభాగము (గులాబితోట) 3—8—0
6. ,, ,, ఆరవభాగము (పండ్లతోట) 3—8—0
7. ,, ,, ఏడవభాగము (డైరీ– ఉత్తరాలు) ———

# విడీప్రతులు

| | | | |
|---|---|---|---|
| 8. | నలజారమ్మ | (కావ్యము) | 0–8–0 |
| 9. | వనకుమారి | ( ,, ) | 1–8–0 |
| 0. | కృషీవలుడు ౩ | ( ,, ) | 0–12–0 |
| 1. | జలదాంగన ౩ | ( ,, ) | 0–6–0 |
| 12. | కడపటివీడ్కోలు ౩ | ( ,, ) | 0–12–0 |
| 13. | యువకస్వప్నము | ( ,, ) | 0–8–0 |
| 14. | పానశాల | ( ,, ) | 2–0–0 |
| 15. | పలితకేశము | ( ,, | 1–0–0 |
| 16. | నక్షత్రమాల | ఖండకావ్యము | 1–0–0 |
| 17. | నైవేద్యము | ( ,, ) | 2–0–0 |
| 18. | భగ్నహృదయము | ,, ) | 1–0–0 |
| 19. | ప్రథమ కవిత్వము | ,, ) | 1–4–0 |
| 20. | మిత్రార్థ శతకము | | 0–4–0 |
| 21. | సీతావనవాసము | (నాటకము) | 1–4–0 |
| 22 | మాధవవిజయం | ( ,, ) | 1–0–0 |
| 23. | మీరాబాయి | ( ,, ) | 1–0–0 |
| 24. | కాంగ్రెసువాలా | ( ,, ) | 0–8–0 |
| 25. | సారస్వతవ్యాసములు | (వ్యాసములు) | 2–0–0 |
| 26. | తెలుగుకవితలో క్రొత్త తెన్నులు | ( ,, ) | 1–0–0 |